## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **త్రైత శకం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **త్రైత శకం** వారి వెబ్ సైట్: http://thraithashakam.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **త్రైత శకం** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - **సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## త్రైత శకం వారి వెబ్ సైట్:

## http://thraithashakam.org/

Thraitha Siddantham

thraithashakam.org/salebooks.php?lang=telugu

THRAITHASHAKAM - 36

అర్ధ శతాధిక గ్రంథకర్త
ఇందూ (హిందూ) ధర్మప్రదాత
సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు

త్రైత సిద్ధాంతము
(జీవాత్మ, ఆత్మ, పరమాత్మల వివరము)

Home | About Us | Publications | Videos | Events | Contact Us

PUBLICATIONS

**Naastikulu-Aastikulu**

This book explains who are atheists and who are theists and many get surprised to to know who are real atheists after reading this book.

Views : 24

Rs : 25/- READ ADD TO CART

**Mataatiita devuni maargamu**

This book tells that God does not like religion and he is above any religion and Moksham can never be attained if one follows religion. Moksham can be attained only by the gnanam given by God.

Views : 28

Rs : 40/- READ ADD TO C

View Page:1 2 3

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# కథల జ్ఞానము


ఇందూ ధర్మప్రదాత

సంచలనాత్మత రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు**





<u>ప్రచురించినవారు :</u>

**ఇందూ జ్ఞానవేదిక** (Regd.No. : 168/2004)

ఐదవ ముద్రణ సం॥ : 2011

# దయ్యాల కోన

అది ఒక భయంకరమైన అడవి. ఎత్తయిన చెట్లు, చిక్కుగ అల్లుకొనిన తీగలు, గుడ్లగూబలకు నిలయమైన మఱ్ఱిమాన్లు, భయంకర సర్పములకు నిలయమైన పొదలుకల్గి ఎటువైపు నరసంచారములేని అడవి మధ్యభాగములో పురాతన దేవాలయము ఒకటి కలదు. అది ఈశ్వర దేవాలయమైనప్పటికి అక్కడ పూజారిలేడు, పూజలు జరుగవు. కాని శివరాత్రి రోజు మాత్రము అక్కడికి జనముచేరి పూజలు చేయుట ఆనవాయితీగ కలదు. ఆ ఒక్క దినము తప్ప మానవ సంచారము ఆ అడవిలో ఉండెడిది కాదు. సంవత్సరమునకు ఒక రోజు పూజ జరుగు ఆ దేవాలయమునకు ఆ ఒక దినము లక్షల సంఖ్యలో మనుషులు వస్తారు కావున అందరి సౌకర్యార్థము దేవాలయము వరకు అడవిలో తారు రోడ్డును ప్రభుత్వమువారు నిర్మించారు. సంవత్సరమునకు ఒకమారు ఆ రోడ్డు వెంట మనుషులు ప్రయాణించెడివారు. అడవి ప్రారంభ మొదటి భాగమునుండి మధ్యలోగల దేవాలయమునకు అరవైమైళ్ల దూరము ఉండెడిది. అడవి మొదటి భాగములో రోడ్డు మీద పోలీస్ చెక్‌పోస్టు కూడ ఉండెడిది. శివరాత్రి రోజు కాకుండ విడి దినములలో ఆ రోడ్డు మీద ఎవరు ప్రయాణించకుండ పోలీస్‌వారు చూచుకొనెడివారు. అడవిలో క్రూరమృగములు సహితము విచ్చలవిడిగ ఉండుట వలన వాటి రక్షణ నిమిత్తము కూడ పోలీస్‌వారుండెడివారు. శివరాత్రి రోజు తప్ప రోడ్డు వెంబడి అడవిలోనికి పోలీస్‌వారు కూడ పోయెడివారు కాదు. రోడ్డు వెంట పోవడానికి కూడ భయపడునంత భయంకరమైన అడవి అది. అడవిలో దేవాలయమునకు అడవి మొదటిలోని పోలీస్ చెక్‌పోస్టుకు అరవైమైళ్ల దూరమన్నాము కదా! అందులో సగము దూరమునకు అనగ ముప్పయిమైళ్ల దూరములో రోడ్డు మీదనే కుక్కల కోన అని ఒక ప్రాంతము గలదు. అక్కడ అడవి కుక్కలు ఎక్కువగ ఉంటాయి. కుక్కలకోన ప్రాంతములోనికి మిగతా అడవి జంతువులు కూడరావు. అక్కడికొస్తే ఏవైన సరే కుక్కల బారిన పడవలసిందే. శివరాత్రి దినమునకు మూడురోజుల ముందు, మూడురోజుల వెనుక వరకు కుక్కలు అక్కడవుండవు. అందువలన నిర్భయముగ ఆ సమయములో మాత్రము ప్రయాణము సాగించెడివారు.

కుక్కలకోనకు అడవిలో ఒక ప్రత్యేకత కలదు. కుక్కలకోనను దయ్యాలకోన అనికూడ అనెడివారు. దయ్యాలే కుక్కలరూపములో ఉండుట వలన దానికి దయ్యాలకోన అనికూడ పేరుకల్గినట్లు కొందరు చెప్పెడివారు. శివరాత్రి సమయములో ఏడు దినములు కుక్కలు అక్కడ లేకుండ పోవుచున్నవంటే అక్కడి కుక్కలన్ని శివుని వరముతో భైరవులు అను దయ్యములుగ మారి శివునివద్దకు చేరి నమస్కరిస్తాయని మరికొందరి వాదన కూడ కలదు. కుక్కలు శివరాత్రి కాలములో ఏడు దినములు దయ్యాలుగ మారుతాయి కావున కుక్కలకోనను దయ్యాలకోన అంటున్నారని కొందరి వాదన. ఎలాగైతేనేమి కుక్కలకోన అనిన దయ్యాల కోన అనిన రెండు ఒక్కటే. కుక్కలకోన విషయము ఆ దారిలో ప్రయాణించు వారందరికి తెలుసు. శివరాత్రి సమయములో ఆ దారిలో ప్రయాణించువారందరు భైరవునికని ఒక కోడిని తీసుకపోయి కుక్కల కోనలో వదిలి పోయెడివారు. కుక్కలకోనలో రోడ్డు ప్రక్కనే భైరవుని గుడి కూడ కలదు. భైరవుని గుడివద్ద కోళ్లను వదిలిపోవు సాంప్రదాయము పూర్వమునుండి కలదు. మానవ సంచారములేని అడవికి పేరుకు మాత్రము కాపలా అన్నట్లు పోలీస్ చెక్‌పోస్టు ఉండెడిది.

ఒక దినము చెక్‌పోస్టు వద్ద విచిత్రమైన సంఘటన చోటు చేసుకొన్నది. అది ఏమనగా ఆ దినము అమావాస్య ఆదివారము. రాత్రి పండ్రెండు గంటల సమయములో ఒక నల్లటికారు చెక్‌పోస్టువైపు దూసుకొచ్చినది. ఏ వాహనము రాని ప్రాంతము కావున పోలీస్‌లు అజాగ్రత్తగయుండిరి. పోలీస్‌లు చూస్తున్నట్లే ఆ కారు అడవిలోనికి దూసుకపోయినది.

పోలీస్ వారికి ఏమి అర్థము కాలేదు. దొంగలు సహితము అడవిలోనికి పోవుటకు భయపడుతారు అటువంటిది ఒంటరి కారు మధ్యరాత్రిలో అడవిలోనికి ఎందుకు పోయినది. పోయినవారు ఎవరై ఉంటారని యోచించసాగారు. రాత్రి రెండున్నర గంటల సమయములో అదే కారు తిరిగి వచ్చినది. వస్తున్న కారును గమనించి పోలీస్‌లు కారును ఆపాలని ప్రయత్నించారు. కాని కారు ఆగలేదు. వచ్చిన స్పీడుతోనే వెళ్ళిపోయినది. అది పోలీస్‌వారికి అర్థముకాని సమస్య అయినది. ఆ విషయము వారి పై అధికారి అయిన ఎస్.పి గారికి కూడ తెలుపలేదు. అయినప్పటికి ఆ కారు విషయములో డి.ఎస్.పి స్థాయి వరకు తర్జన బర్జన పడినారు. అయిన ఏమి అంతు పట్టలేదు. ఇలాగా ఒక నెల కాలము గడచిపోయినది. తిరిగి అమావాస్య వచ్చినది. ఆ దినము కూడ ఆదివారము అమావాస్య దినమున జరిగినట్లే ఒక కారు రావడము పోవడము జరిగినది. పోలీస్‌లకు ఆశ్చర్యమైనది. అక్కడ ఒక గేట్‌ను తయారు చేసి పెట్టాలనుకొన్నారు. కొద్దిరోజులు శ్రమపడి రోడ్డు మీద గేట్‌ను ఉంచారు. గేటు తీయనిదే ఏ వాహనము అడవిలోనికి పోకుండునట్లు ఏర్పాటు చేశారు. తిరిగి అమావాస్య దినము వచ్చినది ఈ మారు కూడ రాత్రి 11-30 గంటల ప్రాంతములో అదే నల్లకారు వచ్చినది. పోలీస్‌వారు గేట్ మూసి ఉంచారు. కారు కథేమిటో తెలుసుకోవాలనుకొన్నారు. చూస్తున్నట్లుగానే స్పీడ్‌గా వచ్చిన కారు ఏమాత్రము ఆగలేదు. వచ్చిన స్పీడు తగ్గకుండ గేట్‌ను గుద్ది పోయింది. గేట్ విరిగి పడిపోయింది. జరిగిన పనికి పోలీస్‌వారు ఆశ్చర్య పోయారు. ఆ కారు ఎక్కడినుండి వస్తుందో, ఎక్కడికి పోతుందో, అందులో ఎవరున్నారో, ఎందుకు గేట్‌ను కూడ గుద్ది పోయారో ఏమాత్రము అర్థము కాలేదు.

పోయిన కారు దర్జాగా తిరిగి వచ్చినది పోలీస్‌వారు చూస్తున్నట్లే తిరిగి పోయినది. ఈ విషయమునంతటిని ఎస్.పి గారికి తెలియజేశారు. ఎస్.పి గారు ఆ ప్రాంతమునకు వచ్చి విరిగిపోయిన గేట్‌ను చూచి ఏదైన క్లూ దొరుకుతుందేమోనని కొంత ముందుకు నడచి చూచాడు అక్కడ కారు నంబర్‌ప్లేట్ పడి ఉండడము గమనించాడు. పడియున్న నంబర్‌ప్లేట్‌ను తీసుకొని చూచారు. ఆర్.టి.ఒ. ఆఫీస్‌కు పోలీస్‌లు పోయి ఆ నంబరు వాహనము ఎవరిదో విచారించుకొని వచ్చారు. అక్కడికి సమీపములో ఉన్న పాముల గూడెము అను ఊరిలోనిదని తెలిసినది. చెక్‌పోస్టుకు కేవలము ఐదు కిలోమీటర్ల దూరములోనే పాములగూడెము కలదు. పోలీస్‌లు అక్కడకు పోయి ఒక ఇంటి ముందు పార్కు చేసియున్న నల్లని కారును చూచారు. కారుకు ముందు భాగములో నంబరుప్లేటు కూడ లేదు. దాని ప్లేటే తమవద్దయున్నదని నిర్ణయించుకొనిన పోలీస్‌లు కారు యజమానిని ఎస్.పి ఆఫీస్‌కు పిలుచుకపోయారు. కారు రిజిష్టర్ బుక్ చూచి కారు యజమాని అతనేనని నిర్ణయించుకొన్న తర్వాత అతనిని ఈ విధముగ ప్రశ్నించారు.

ఎస్.పి : నీ పేరు

యజమాని : శేషయ్య. పూర్తిపేరు కరిమబ్బుల శేషయ్య అంటారు.

ఎస్.పి : వరుసగ మూడు అమావాస్యల దినములలో నీ కారు అడవిలోనికి పోయి వచ్చినది. ఎవరు పోయారు అడవిలోనికి?

శేషయ్య : మూడు అమావాస్యల దినములలోను మేము ఎవరు ప్రయాణము చేయలేదు. రెండు అమావాస్యల దినములలోను కారు ఎక్కడ పార్కింగ్ చేసియుంచామో అక్కడే ఉంది. కాని నిన్న అమావాస్య రోజున కొద్దిగ జాగా మారివుంది. అంతేకాక మేము పార్కు చేసినపుడు సైడ్ అద్దాలు మూసియుంచుతాము. కాని నిన్న దపా అద్దాలు తెరిచియుండగా చూచాను. రాత్రి పదిగంటలకు తలుపులు వేసుకొని లోపల పండుకుంటాము. తిరిగి ఉదయము

వరకు బయటకు చూడము. ఉదయము కారు ఉందిలే అనుకుంటాము తప్ప మాకు ఏ అనుమానము రాలేదు. ఇపుడు నంబర్‌ప్లేట్ పోయినది మరియు అద్దాలు తెరువబడి యున్నాయి. కావున నాకు కూడ బయట ఏమో జరిగినదని అనుమానము వచ్చినది.

ఎస్.పి. : కారు డ్రైవర్ ఎవరు?

శేషయ్య : గత మూడు నెలలుగ డ్రైవర్ లేడు సార్. మేమే నడుపు కొంటున్నాము.

ఎస్.పి. : ముందు ఎవరు డ్రైవర్‌గ ఉండేవారు?

శేషయ్య : గరుడయ్య డ్రైవర్‌గ ఉండేవాడు. అతను చనిపోయి మూడు నెలలకు పైగా అయినది.

ఎస్.పి. : జరిగినది ఏమైవుంటుందని నీ నమ్మకము.

శేషయ్య : ప్లేట్ ఊడిపోయినది కావున కారు పోయి వచ్చినదనుట సత్యమే ఉంటుంది. ఎవరు పోయారు? ఎందుకు పోయారు అను విషయము మీ ఇన్వెస్టిగేషన్‌లోనే తేలాలి. కారు తాళాలు నావద్దనే ఉండగ కారు డోరు ఎలా ఓపనైనది, కారు ఎలా స్టార్టయింది. అయోమయముగ ఉన్నది సార్.

ఎస్.పి. : డూప్లికేట్ తాళాలు ఉన్నాయా?

శేషయ్య : లేవుసార్ ఉన్నది ఒక తాళమే.

ఎస్.పి. : నీకు తెలియకుండ నీబండి అడవిలోనికి పోయి వచ్చిందంటే నమ్మమంటావా?

శేషయ్య : ఈ విషయములో నాబండిని ఎవరో వాడుకున్నట్లు రిపోర్టు వ్రాసి ఇవ్వగలను.

ఎస్.పి. : సరే నీవు వెళ్లిపో తర్వాత పిలిచినపుడు వచ్చి మాకు సహకరించు.

శేషయ్య : అలాగే సార్. నమస్కారము.

ఎస్.పి గారికి ఏమి అర్థము కాలేదు. ఈ విషయములో ఎవరు బాధితులు లేరు. ఏ నష్టము ఎవరికి జరుగలేదు. ఎవరు రిపోర్టు ఇచ్చువారు లేరు. ఈ విషయమును లోతుగ యోచించాలను కొన్నారు. చెక్‌పోస్టువద్ద గేట్‌ను కూడ తయారు చేయలేదు. కాని చెక్‌పోస్టుకు ముందు ఒక ఫర్లాంగు, వెనుక ఒక ఫర్లాంగు దూరములో మరో పదిమంది పోలీస్‌లను ఈ విషయములో గమనించుటకు ఏర్పాటు చేశారు. మొత్తము మూడు జాగాలలో ముప్పైమంది పోలీస్‌లను ఉంచి వారికి వీడియో కెమెరాలు ఇచ్చి పెట్టారు. ఏదైన వాహనము ఆ ప్రాంతములోనికి వస్తే దానిని వీడియో తీయమని దానివలన అందులో ప్రయాణించువారు, ఆ బండినంబరు, బండిని నడుపు డ్రైవరు తెలియ బడతారని ఎస్.పి గారు చెప్పి పెట్టారు. అప్పటినుండి పోలీస్‌లకు వయర్‌లెస్ ఫోన్‌లను కూడ ఇచ్చి ఏదైన వాహనము వస్తే ఒకరికొకరు ఫోన్ చేసుకొను ఏర్పాటు కూడ చేసి పెట్టారు. ప్రతి దినము పోలీస్‌లు బహు జాగ్రత్తగ కాపలా కాయుచుండిరి. తిరిగి అమావాస్య రోజు రానే వచ్చింది. ఆ దినము మీదనే అందరికి అనుమానమున్నది కావున అందరు జాగ్రత్తగయుండిరి. కాని ఈమారు కారు రాలేదు. ఏకముగ బస్సే వచ్చినది. బస్సులోపల లైట్లన్ని వెలుగుచున్నవి కాని బస్సులో ఎవరు లేరు. ప్రయాణీకులే కాదు డ్రైవరు కూడ లేడు. ఖాళీ బస్సు రాత్రిపూట లైట్లన్ని వేసుకొని పోవడము అందులో ఎవరు లేకుండ పోవడము అంతయు వీడియో టేపులలో పోలీస్‌లు చిత్రీకరించారు. కారు

విషయము తెలియక పోయిన ఈ మారు బస్సు విషయము బాగా తెలిసి పోయినది. ఏమి తెలిసిన ఇదంత ఎందుకు జరుగుచున్నదను వివరము మాత్రము ఎవరికి అంతుబట్టలేదు. ఈ విషయములో పోలీస్‌లు జుట్టు పీక్కున్నా అర్థము కాలేదు. ఈ మారు బస్సు నంబరు కూడ తెలిసి పోయినది. ఆ విషయమంతయు ఎస్.పి గారికి వెంటనే వయర్‌లెస్‌లో తెలియజేశారు. బస్సు తిరిగి వచ్చు లోపల రోడ్డు మీద పెద్ద రాళ్ళతో గోడకట్టమని ఎస్.పి ఆదేశించాడు. పోలీస్‌లు అలాగే ఒక గంటలోపల రోడ్డుకు అడ్డముగ మూడు అడుగుల ఎత్తు రాళ్ళను పేర్చి పెట్టారు. ఇపుడు దారిలేదు వచ్చిన బస్సు నిలబడనైన నిలబడాలి, లేకపోతే గోడను గ్రుద్ది ఆక్సిడెంట్ అయిన కావాలి అనుకొన్నారు. కరెక్టుగ 12 గంటలకు పోయిన బస్సు తిరిగి వస్తుందని లైట్ల వెలుతురు కోసము ఎదురు చూస్తున్నారు. 2,3,4 చివరకు ఐదు గంటలైన బస్సు తిరిగి రాలేదు. ముందు దఫా ఇదే అమావాస్య రోజులలో పోయిన కారు తిరిగి రాగ బస్సుమాత్రము తెల్లవారిన రాలేదు. బస్సు రాని విషయమును ఎస్.పి గారికి తెలియజేశారు. ఎస్.పి కి కూడ ఏమి అర్థము కాలేదు. అయితే బస్సునంబరు ఉందికదాయని అది ఎవరిదో విచారించమని తెలియజేశాడు. ఆ విషయమై పోలీస్‌లు పోయి బస్సు ఓనర్‌ను విచారించారు. బస్సు ఓనర్ తన బస్సు రాత్రి దొంగలించబడినదని, అదే విషయమును సంబంధిత పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చామని తెలియజేశాడు. అంతటితో పోలీస్‌లకు ఏ క్లూ దొరకకుండ పోయినది. రాత్రి 11-30 గంటల నుండి తన బస్సు కనిపించలేదని బస్సు ఓనర్ పిర్యాదు చేశాడు. దానితో బస్సు ఆచూకి తెలుసుకొను బాధ్యత పోలీస్ వారి మీద పడినది. పోలీస్ డిపార్టుమెంటుకు ఇది ఒక సవాలుగ మిగిలినది. రోడ్డు మీద అడ్డగోడను పోలీస్‌వారు అలాగే ఉంచి యోచించసాగారు. అడవిలోనికి పోయి చూడమని ఎస్.పి. గారు ఆర్డరు వేశాడు. దానితో క్రిందిస్థాయి పోలీస్‌లకు ముందు నుయ్యి వెనుక గొయ్యి అయినది.

చివరకు పోలీస్‌వారు తమ బందోబస్తుతో ఖైదీలను తీసుకపోయే క్లోస్డ్ వ్యాన్‌లో అడవిలోనికి బయలుదేరారు. చెక్‌పోస్టువద్ద గోడను తీసివేసి అడవిలోనికి పోయారు. ఇరవైమంది పోలీస్‌లు బందూకాలు తీసుకొని పోయినప్పటికి వారికి భయముగానే ఉన్నది. రోడ్డు ఉన్నది అడవిలోని ఈశ్వరదేవాలయము వద్దవరకే కావున అంతవరకు పోయి చూడాలనుకొన్నారు. వ్యాన్ కుక్కలకోన దాటింది, చివరకు ఈశ్వర ఆలయము వరకు వచ్చింది. అక్కడ ఈశ్వరాలయము ప్రక్కన బస్సు ఆగి ఉండడము గమనించారు. బస్సు ఖాళీగ ఉన్నది. అక్కడ ఆ పరిసరప్రాంతములో ఎవరులేరని నిర్ధారించుకొన్నారు. బస్సును తమ వెంట తేవాలనుకొన్నారు. బస్సును స్టార్టు చేస్తే అది స్టార్ట్ కాలేదు. ఎందుకు స్టార్ట్ కాలేదని గమనిస్తే దానిలో డీజిల్ అయిపోయివుంది. చివరికి చేయునది లేక వ్యాన్‌కు బస్సును కట్టి తేవాలనుకొన్నారు. అలాగే చేసి బస్సును లాగించితే బస్సుచక్రములు తిరుగలేదు. టైర్లు భూమికి రాసుకొంటున్నవి కాని దొర్లడములేదు. చక్రములకు బ్రేక్ వేసినట్లు బస్సు నడవడములేదు. బ్రేకులు ఏమైన పట్టుకొన్నవేమోనని ఒక టైర్‌కు జాకీ ఎత్తి త్రిప్పి చూచారు జాకీ ఎత్తి త్రిప్పితే టైర్ ఫ్రీగా తిరుగుచున్నది. కాని బస్సు ముందుకు కదలడములేదు. పోలీస్‌వారికి ఏమి అర్థము కాలేదు జాకీ ఎత్తి చూస్తే తిరిగే టైరు జాకీ దింపితే తిరగకుండపోవడము పెద్ద ఆశ్చర్యముగ కనిపించింది. ఇదేదో దయ్యాల పనిలాగ ఉన్నదని మొట్టమొదట అనుమానము వచ్చినది. ముందే ఎవరురాని ప్రదేశము. తాము రావడమే తప్పు. వచ్చిన తర్వాత ఎక్కువసేపు అక్కడ ఉండకూడదనుకొన్నారు. వెంటనే బస్‌ను వదలి వ్యానులో బయలుదేరి వచ్చారు. వచ్చిన తర్వాత జరిగిన విషయమంతయు ఎస్.పి.గారికి చెప్పారు. ఎస్.పి గారికి కూడ ఆశ్చర్యమనిపించింది. ఏమి అర్థముకాక ఏమి చేస్తామని పోలీస్‌వారినే అడిగాడు. అందులకు డి.ఎస్.పి.గారు ఇలా అన్నారు. "ఇదేదో మనకు అర్థముకాని విధముగ ఉన్నది. ఈ అడవి విషయము, దయ్యాల విషయము, ఈశ్వర

దేవాలయ విషయము పూర్తిగ తెలిసిన వారిని అడిగితే కొంతైన విషయము అర్థమవుతుంది. లేకపోతే ఏమి అర్థము కాదు.”

ఎస్.పి. : అలాంటివారు ఎవరైన ఉన్నారా?

డి.ఎస్.పి. : నాకు కూడ తెలియదు. విచారిస్తే తెలుస్తుంది.

ఎస్.పి. : అలాగే విచారించండి. మనకు తెలియని విషయము చెప్పగల వారుంటారంటావా?

డి.ఎస్.పి. : దేవాలయరహస్యములు, దయ్యాల పనులు, ఆత్మల జ్ఞానమును తెలిసినవారు ఒకరు ఉన్నారు. వారు వ్రాసిన పుస్తకములలో ఇటువంటి సంఘటనలు కొన్నిటిని వ్రాశాడు. కావున ఆయనను విచారిస్తే కొంత వివరము తెలియగలదు. అతను తప్ప ఈ విషయము చెప్పువారు ఎవరు లేరనుకుంటాను. కాని ఆయన ఇక్కడికి చాలా దూరములో అనగా 300 కిలోమీటర్ల దూరములో ఉన్నాడు. ముందు అక్కడికి పోయి వస్తాను సార్.

ఎస్.పి. : అలాగే నీవు ముందు పోయి మనకు తెలియని విషయమేమైన ఉన్నదేమో కనుక్కో.

డి.ఎస్.పి. : అలాగే సార్ పోయి వస్తాను.

డి.ఎస్.పి పుస్తకరచయిత కోసము పోయాడు. అయిన ఆయన దొరకలేదు. ఆయన దొరకాలంటే ఒక నెలరోజులు పడుతుందని తెలిసింది. రచయిత పేరు గిరీశానంద. గిరీశానంద గారు ఒక నెల రోజులు క్యాంప్ వెళ్ళాడని తెలిసింది. డి.ఎస్.పి చేసేది లేక వెను తిరిగి వచ్చాడు. ఇక్కడ ఎస్.పి గారికి కడుపునొప్పి ప్రారంభమైనది. ప్రతిరోజు ఒక గంటసేపు కడుపునొప్పి రావడము జరుగుచున్నది. విచిత్రమేమిటంటే ఎస్.పి. గారు కాకీడ్రస్‌లో ఉన్నపుడు నొప్పిరాదు. ఆయన సివిల్‌డ్రస్‌లో ఉన్నపుడే నొప్పిరావడము జరుగుచున్నది. డాక్టర్లకు చూపించిన తగ్గడము లేదు. ఏ కారణముతో నొప్పి వచ్చేది ఎవరికి తెలియకుండ పోయినది. ఎస్.పి. గారికి దయ్యాల మీద నమ్మకము తక్కువ. దయ్యాలున్నాయంటే నమ్మేవాడు కాదు. చివరకు అల్లోపతి మందులు విడిచిపెట్టి ఆయుర్వేదిక్ మందులు వాడిన తగ్గలేదు. పదిహేనురోజులుగ బాధ వస్తునేయున్నది. ఇది ఎస్.పి గారి పరిస్థితి. ఇకపోతే పోలీస్ చెక్‌పోస్టువద్ద పోలీస్‌ల పరిస్థితి కూడ అలాగే తయారైనది. వారు డ్యూటీ చేసేదానికే భయపడు చున్నారు. ప్రతిరోజు చెక్‌పోస్టులో ఎవరో అడవిలోనికి పోయినట్లు కనిపిస్తూనే ఉన్నది. చూస్తున్నట్లుగానే ఒక మనిషి పోస్టు దాటి పోవడము జరుగుతాయున్నది. గత పదిహేను రోజులుగ అలాగే జరుగుచున్నది. ఎస్.పి గారి కడుపునొప్పి రాకుండ ఉండడము లేదు. అలాగే అడవిలోనికి మనిషి పోకుండ ఉండడము లేదు. రెండు విచిత్రముగానే ఉన్నాయి. డి.ఎస్.పి గారికి ఏమి అర్థముకాలేదు. ఎవరినైన అడగాలంటే చెప్పుకొనే దానికే సిగ్గుగ ఉన్నది. ఈ విధముగ నెలరోజులు గడచినది. ఎస్.పి గారికి కడుపునొప్పి మరికొంత ఎక్కువైనది. అన్ని చెకింగ్స్ (పరీక్షలు) చేయించారు. లోపము లేదని తేలింది.

డి.ఎస్.పి గారు గిరీశానంద గారి కోసము పోయాడు గిరీశానంద స్వామిగారు దొరికారు. డి.ఎస్.పి గారు ఏదీ దాచకుండ మొదటినుండి జరిగిన తతంగమంతయు చెప్పాడు. అలాగే ఎస్.పి గారి కడుపునొప్పిని గురించి, చెక్‌పోస్టులో జరిగే సంఘటన గురించి చెప్పాడు. గిరీశానంద స్వామి అన్నియు సావధానముగ విన్నాడు. తర్వాత ఆయన ఇలా మాట్లాడాడు.

గిరీశానంద : మీరు చెప్పుచున్న అడవికి కొంత ప్రత్యేకత కలదు. అందులో ఈశ్వర గుడి ఉండడము, దారి మధ్యలో కుక్కలకోనలో భైరవుని గుడి ఉండడము అంతయు ప్రత్యేకతయే. మీరు అడవిలోనికి పోయి ఉండకూడదు.

డి.ఎస్.పి. : డ్యూటి కదా స్వామి! బస్సు పోయిన పిర్యాదును గూర్చి పోవలసి వచ్చినది. అదీ ఎస్.పి గారు స్వయాన పొమ్మన్నారు.

గిరీశానంద : అందువలనే పోయిన మీకు, పొమ్మనిన మీ ఎస్.పి గారికి అంతుచిక్కని కష్టాలు మొదలయ్యాయి.

డి.ఎస్.పి. : దీనికి పరిష్కారము మీరే చెప్పాలి. అసలు మేము చేసిన తప్పు ఏమిటి?

గిరీశానంద : అడవిలోనికి పోవునపుడు ఒక నియమము కలదు. దానిని మొదట మీరు పాటించలేదు. లోపలికి పోవువారు కుక్కలకోనవద్ద కోళ్ళను వదలకుండ, అక్కడ నమస్కరించకుండ పోవడము పెద్ద పొరపాటు. అడవిలో శివాలయము వరకు పోయిన వారు ఆలయము లోనికి పోయి శివునికి పూజ చేయకుండ రావడము మరీ పెద్దతప్పు. ఇలా చేశారు కావున మీ పనులు ఇష్టపడనివారు మీకు అన్ని ఆటంకములు కలుగజేశారు. బస్సును లాగిన రాకుండ చేశారు. అప్పటికైన మీది తప్పని గ్రహించి శివునికి పూజ చేసియుంటే బస్సు సులభముగ వచ్చెడిది.

డి.ఎస్.పి : ఒక విధముగ మేము చేసినది తప్పే. బస్సు కదలకుండ పోవడానికి కారణము ఏమిటి? ఎవరు ఆ విధముగ చేసియుంటారు?

గిరీశానంద : అన్ని వివరముగ చెప్పెదను. మొదట నీకు అర్థము కావడానికి కొన్ని విషయములు తెలియాలి. మీరు డ్యూటియే ముఖ్యమనుకొన్నారు. దానితో మనకు కనిపించకుండ మనకంటే శక్తిమంతులు ఎందరో ఉన్నారను మాటను మరచిపోయారు. మీరు చేయుచున్న పనిని ఇష్టపడని కనిపించనివారు చేసిన పనియే బస్సు కదలక పోవడము. మీరు అక్కడికి పోయి పూజ చేయకుండ మీ పనిలో లగ్నము కావడము, దేవున్ని విస్మరించడము అక్కడి వారికి సరిపోలేదు.

డి.ఎస్.పి : అక్కడ ఎవరు లేరు స్వామి!

గిరీశానంద : మీకు కనిపించనివారని నేను ముందే చెప్పానుగ. మిమ్ములను ఆదేశించిన ఎస్.పి.గారికి కూడ వారి వలనే కడుపునొప్పి వచ్చినది. అది మందులతో పోదు, మంత్రములతో పోదు. కేవలము భక్తితోనే పోవాలి.

డి.ఎస్.పి : ఆయనకు ఏమి జరిగి ఉంటుందంటారు?

గిరీశానంద : అడవిలో ఎవరైతే బస్సును కదలకుండ చేశారో వారే మీ ఎస్.పి గారికి కడుపునొప్పిని కలుగజేశారు. ఇదంతయు అర్థము కావాలంటే ఇంతకు ముందు కాలములో జరిగిన కథను తెలుసుకుంటే ఇప్పటి విషయము అర్థముకాగలదు. చెప్పెదనువిను పూర్వము ఒక చిన్న అడవి ఉండెడిది. అందులో మల్లేశ్వరకోన అని ఒక శివుని గుడి ఉండెడిది. ఇప్పటి అడవి అంత పెద్దఅడవి, ఇప్పటి ఈశ్వరుని గుడియంత గుడి కాకపోయిన చిన్న అడవిలో చిన్న గుడి అనుకో. ఆ అడవిలో నిత్యము జన సంచారము కూడ ఉండెడిది. కాని రాత్రిపూట మల్లేశ్వరకోనలో నరసంచారము ఉండెడిది కాదు. అక్కడ నీటికోన కూడ ఉండెడిది కావున దానిని మల్లేశ్వరకోన అనెడివారు. ఆ కోనవద్ద పగలంతయు భక్తుల సందడి ఉండినప్పటికి రాత్రి అవుతూనే ఎవరు గుడివద్ద ఉండెడివారు కాదు. అది ఒక పుణ్యక్షేత్రమని, అక్కడ రాత్రిపూట ఋషులు తపస్సు చేసుకుంటారని వదంతియుండెడిది. కావున రాత్రిపూట ఎవరు అక్కడికి పోయేవారు

కాదు. గుడికి మూడు కిలోమీటర్ల దూరములోనే కొన్ని ఊర్లు ఉండెడివి. ఒక వేసవికాలములో చుట్టు ప్రక్క ఊర్లలో దొంగతనములు ఎక్కువగ జరిగెడివి. దొంగలకోసము పోలీస్‌వారు కాపల కాసిన ఎవరిని పట్టుకోలేక పోయారు. సంబంధిత ఎస్.ఐ గారికి దొంగలు రాత్రిపూట మల్లేశ్వరకోనలో దాగియుండి అప్పుడప్పుడు దొంగతనము చేస్తు తమకు పట్టుపడలేదని ఆలోచన వచ్చినది. ఒక రోజు ఇద్దరు పోలీస్‌లతో సహా రాత్రి ఏడుగంటలకే మల్లేశ్వరకోన సమీపమునకు చేరుకొని సైకిల్‌మోటర్‌లను గుడికి ఫర్లాంగు దూరములో పొదలమాటున పెట్టి కాలినడకన రహస్యముగ కోనవద్దకు చేరుకొని ఒక గుండు క్రింద చాటుగ కూర్చొని గమనించసాగారు.

రాత్రి 12గంటల సమయమైనది, వెంటవచ్చిన పోలీస్‌లు ఇద్దరు నిద్రలోనికి జారుకున్నారు. ఎస్.ఐ.గారు ఒక్కరు జాగ్రత్తగ మేల్కొని గమనిస్తున్నాడు. అంతలో కొంత అలికిడి అయినది. గుడి ముందర ఒక మర్రి చెట్టు గలదు. ఆ చెట్టు మీద ఏదో కదలినట్లు అలికిడి. వెంటనే ఎస్.ఐ.గారు తన వెంట తెచ్చుకొన్న ఐదుసెల్‌ల టార్చి చేతిలోనికి తీసుకొన్నాడు. ఏమి జరుగుతుందని చూస్తున్నాడు. చెట్టు మీద ఒక వ్యక్తి దిగుచున్నట్లు కనిపిస్తున్నది. చెట్టు దిగిన వ్యక్తి చీకటిలో మసకగ కనిపిస్తున్నాడు. మనిషి ఆజానుబాహుడు, పొడవాటి గడ్డము గలవాడు. చెట్టు దిగిన వెంటనే ప్రక్కనేయున్న నీటికోనలోనికి పోయి స్నానము చేస్తున్నాడు. ఎస్.ఐ. గారికి ఒకప్రక్క భయమేస్తున్నది. కానిస్టేబుల్స్‌ను తట్టాడు వారు లేవలేదు. చేయునది లేక జాగ్రత్తగ చూస్తున్నాడు. చెట్టు దిగిన ఆకారము స్నానము ముగించుకొని శివుని గుడి ముందరకు వచ్చి కూర్చుంది. కూర్చున్న ఆకారము కదలలేదు. ఏదో ధ్యానములోనికి వెళ్ళిపోయినట్లున్నది. పదిహేను నిమిషముల తర్వాత ఆ ఆకారము లేచి చిన్నగ చెట్టువైపు పోవుచున్నది. అపుడు ఎస్.ఐ.గారు కొంత ధైర్యమును పుంజుకొని టార్చి వెలిగించాడు. టార్చి ఫోకస్ ఆ ఆకారము మీద పడినది. కాని ఆకారము కనిపించలేదు. లైట్‌ఫోకస్ ఆకారములో దూరి అవతలివైపు కొండరాళ్ల మీదపడి రాళ్లు కనిపిస్తున్నవి. వెంటనే టార్చి ఆఫ్ చేశాడు. తిరిగి ఆకారము కనిపిస్తున్నది. ఆకారము చెట్టు వైపు పోతూనే ఉన్నది. మరియొకమారు ఎస్.ఐ. టార్చి వేశాడు. అయిన మొదటి మాదిరే ఏమి కనిపించలేదు. వెంటనే ఆఫ్ చేశాడు. ఆకారము మొదటి మాదిరే కనిపించుచున్నది. అది చెట్టు దగ్గరకు పోతూనే ఉన్నది. చివరికి చెట్టు దగ్గరకు పోయి తిరిగి చూచింది. అది కూడ ఎస్.ఐ. వైపు చూచినట్లనిపించింది. దానితో ఎస్.ఐ. కొంత భయపడి పోయి నిశ్చేష్టుడయ్యాడు. ఆ ఆకారము చెట్టు ఎక్కిపోయినది. చెట్టు దిగునపుడు చెట్టు కొమ్మలలో ఎలా శబ్దమైనదో చెట్టు ఎక్కునపుడు కూడ ఆ విధముగనే చెట్టు కొమ్మలలో శబ్దమైనది. చేయునది లేక ఎస్.ఐ. అక్కడనే రాత్రంతయు ఉండిపోయాడు. దొంగల ఆచూకి తెలియలేదు కాని అనుకోని అనుభవము ఎదురైనది.

ఈ సంఘటనతో ప్రజలు రాత్రిపూట అక్కడికి ఎందుకురారో అర్థమైనది. అంతేకాక వారు అనుకొను మాటలలో కూడ కొంత సత్యమున్నట్లు తెలిసినది. ప్రజలు ఎవరు అక్కడికి పోరు కావున దొంగలు కూడ అక్కడికి పోరని నిర్ధారణకొచ్చాడు. కాని ఆ దినమునుండి ఆ ఎస్.ఐ.కి కడుపునొప్పి మొదలైనది. ఎన్ని ఆస్పత్రులు తిరిగిన బాగుకాలేదు. ఆ దినమునుండే నొప్పి వచ్చిన దానివలన ఆ సంఘటనకు దీనికి ఏదైన సంబంధముందేమోనని అనుమానము వచ్చి తావెత్తులు కూడ కట్టించుకొన్నాడు. అయిన నయము కాలేదు. ఇపుడు మీవలె వారు నావద్దకు వచ్చి అంతా చెప్పారు. ఇపుడు మీకు చెప్పినట్లే ఆ దినము కూడ ఆ నొప్పి మందులకు, మంత్రాలకు పోదని చెప్పాను. ఎస్.ఐ. గారినే నావద్దకు రప్పించుకొని చూచాను పరిస్థితి అంత అర్థమైనది. ఆ దినము చెట్టు మీదినుండి దిగివచ్చినది ఒక గొప్ప యోగి. అతడు ఎన్నో సంవత్సరములనుండి ఆ చెట్టు మీద నివశిస్తు ప్రతి దినము అర్థరాత్రి సమయములో

యోగము చేసుకొని పోయెడివాడు.  అలా పోవు వాని మీద లైట్ వేయడము వలన అతనికి కొంత అసౌకర్యము కల్గినది.  చెట్టు దగ్గరకుపోయి చివరిగ చూచి పోయాడు.  అంతవరకు ఆ ప్రాంతమునకు ఎవరు రాత్రిపూట పోలేదు. అలా రాత్రి పోవడము ఒక తప్పు, లైట్‌వేసి చూడడము రెండవ తప్పు.  ఈ తప్పులకు శిక్షగ కడుపునొప్పి వచ్చినది. కడుపునొప్పికి కారణము తెలిసినది.  యోగము చేయు యోగికి అనుచరుడొకడు కలడు.  అతను యోగియొక్క సేవ చేసుకొనుచున్నాడు.  అతను యోగి యోగము అయిపోయిన తర్వాత యోగము చేసుకొనెడివాడు.  అతను కూడ కనిపించని వాడే ఆ దినము ప్రక్కనుండి గమనించిన అనుచరుడు యోగియొక్క ఆజ్ఞతోనే వచ్చి ఎస్.ఐ.కడుపునొప్పిగ మారాడు.  అదంత తెలిసిన నేను ఆ ఇద్దరికి నచ్చచెప్పడము వలన అప్పటినుండి కడుపునొప్పి లేకుండ పోయినది. ఇదంతయు కల్పిత కథకాదు జరిగిన యదార్థము.  ఆనాడు జరిగినట్లే ఈనాడు జరిగినదని నేను అనుకొంటున్నాను. బయటి ప్రపంచములో ఎంత పెద్ద అధికారి అయిన దైవము దృష్టిలో సాధారణ మనిషియే.  అలాగే కనిపించని యోగుల దృష్టిలో కూడ.  పవిత్ర క్షేత్రములలో కొన్ని నిబంధనలుంటాయి.  వాటిని ఎవరు అతిక్రమించ కూడదు. మాది పోలీస్ డిపార్టుమెంటని అనుకొనిన ప్రయోజనము లేదు.  పోలీస్‌లుగాని, పై అధికారులుగాని అందరు మనుషులే అవుట వలన, నిబంధనలు అతిక్రమించుట వలన వచ్చు శిక్ష ఎవరికైన పడవచ్చును.  ఆ దినము మీరు అడవికి పోవడానికి కారణము మీ ఎస్.పి.గారే అందువలన ఆయనకే శిక్షపడినదని అనుకుంటాను.  ప్రతి విషయమునకు ఒక పరిష్కార మార్గము ఉంటుంది.  కావున ఏమి జరిగింది? ఎందుకు కడుపునొప్పి వచ్చింది? అని వివరము తెలియాలంటే కడుపునొప్పి ఉన్నపుడు మీ ఎస్.పి.గారిని చూడాలి.  అలా చూస్తేగాని నాకు అర్థముకాదు.  ముందు మీ ఎస్.పి. గారిని పిలుచుకొని రా తర్వాత అన్ని తెలియగలవు.

డి.ఎస్.పి. : చెక్‌పోస్టు సంఘటన విషయము చెప్పలేదు స్వామి.

గిరీశానంద : అందరికి ఒక్కమారు మందిచ్చుటకు నేను వైద్యుడను కాను, తావెత్తు ఇచ్చుటకు మంత్రగాడినికాను. ఇదంతయు యోచించి చేయవలసిన పని.  నా మార్గము జ్ఞానమార్గము.  రేపు ఈ సంఘటనలతో జ్ఞానులుగ మారగలరను నమ్మకముతో మిమ్ములను చూస్తానని చెప్పుచున్నాను కాని వేరు మార్గము కాదు.  అజ్ఞానానికి, జ్ఞానానికి మధ్యలో గల తారతమ్యము తెలుపుటకు ఈ సంఘటనలు పనికి వస్తాయని, వీటివలన కొంతైన జ్ఞానవివరము తెలియగలదని మిమ్ములను రమ్మన్నాను.  మీ ఎస్.పి.గారి సమస్య అయిపోయిన తర్వాత అతని విధానమును బట్టి మిగత సమస్య చూడగలను. అంతేగాని సమస్యలు తీర్చడము నా పనికాదు.

ఆ మాటలువిన్న డి.ఎస్.పి. గారు స్వామిగారికి నమస్కరించి బయలుదేరి పోయి జరిగిన విషయమంతయు ఎస్.పి.గారికి తెలియ జేశాడు.  అంతవిన్న తర్వాత గిరీశానంద స్వామిగారి వద్ద తన కడుపునొప్పి నయము కాగలదని ఎస్.పి.గారు నమ్మారు.  కొద్ది రోజులు డ్యూటికి సెలవుపెట్టి బయలుదేరి గిరీశానందస్వామి వద్దకు పోయాడు. **అంతవరకు దేవుడు దయ్యములంటే నమ్మని ఎస్.పి. తనది తప్పుడు అంచనాయని అనుకొన్నాడు.  ఎందరో మహానుభావులు భూమిమీద కలరని, వారు తనకంటే ఎంతో ఎక్కువ తెలిసినవారని, తనకు కనిపించు ప్రపంచములో కొన్ని తప్ప అన్ని విషయములు తెలియవను భావములోనికి వచ్చాడు.** మరుసటి దినము గిరీశానంద స్వామి దర్శనమునకు ఆయన నివాసమునకు పోయాడు.  ఎస్.పి.గారితో డి.ఎస్.పి.గారు, ఎస్.పి.గారి తండ్రి, వారి బంధువులు ఇద్దరు మొత్తము ఐదుమంది పోయారు.  ఉదయము 8 గంటల ప్రాంతములో గిరీశానందస్వామి వచ్చి తన స్థలములో కూర్చొన్నాడు. గిరీశానందస్వామి క్రింద కూర్చోవడము చూచి అందరు క్రిందనే కూర్చొన్నారు.  స్వామిగారికి ఎస్.పి.గారిని  డి.ఎస్.పి

పరిచయము చేశాడు. ఎస్.పి.గారిని తనముందర కూర్చోమని స్వామి చెప్పాడు. ఎస్.పి. గారు అలాగే కూర్చుని నమస్కరించాడు.

స్వామి : మీరు ఏ ఉద్దేశ్యముతో నావద్దకు వచ్చారు.

ఎస్.పి. : తమరు గొప్ప వ్యక్తులని, తమ మేధస్సు గొప్పదని, తమకున్న దైవజ్ఞానము గొప్పదని, తమ జ్ఞానశక్తి వలననే నాకున్న ఈ జబ్బు పోగలదను నమ్మకముతో వచ్చాను స్వామి.

స్వామి : మీరు ఇక్కడికి ఎస్.పి.గ వచ్చారా లేక సాధారణ మనిషిగ వచ్చార !

ఎస్.పి. : నేను నాహోదాను ఇంటిదగ్గర వదలి దానికి సెలవుపెట్టి, ఎస్.పి.గ కాకుండ సాధారణ మనిషిగ వచ్చాను స్వామి.

స్వామి : సరే మంచిది! నిన్ను నేను సాధారణ మనిషిగానే మాట్లాడించెదను నేను అడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పు. నీకు ఎన్ని దినములుగ కడుపు నొప్పి ఉన్నది.

ఎస్.పి. : దాదాపు నెలరోజులుగ ఉన్నది స్వామి.

స్వామి : నీవు నాముందర కూర్చొని తదేకముగ నాముఖమువైపు చూడు. ఇపుడు నీకు కడుపునొప్పి ఉందా?

ఎస్.పి. : లేదు స్వామి. ఇపుడు బాగానే ఉంది. బహుశ సాయంకాలము రావచ్చుననుకుంటాను.

స్వామి : ఆ నొప్పిని ఇపుడే పిలుస్తాను. నీవు నొప్పితోయున్నపుడే అన్ని విషయములు నాకు తెలియగలవు.

ఈ విధముగ చెప్పిన గిరీశానందస్వామిగారు ఎస్.పి.గారిని తీక్షణముగ చూచారు. వెంటనే కడుపులో నొప్పి మొదలైనది. ఆ విషయము ఎస్.పి. గారు స్వామికి తెలియజేశాడు. సరేనని తలూపిన స్వామిగారు ఆ నొప్పి ఎక్కడున్నదో కరెక్టుగ వ్రేలుపెట్టి చూపమన్నాడు. ఎస్.పి.గారు ఆ విధముగనే చూపించాడు. స్వామి వెంటనే వ్రేలుపెట్టి చూపించిన భాగమును చూచాడు. అంతే అంతవరకు చూపిన చోటున నొస్తున్ననొప్పి వెంటనే భుజములోనికి వచ్చినది. ఎస్.పి.గారు ఆ విషయమును స్వామిగారికి చెప్పాడు. ఎక్కుడున్నదో వ్రేలుపెట్టి చూపమన్నాడు స్వామి. అతను అలాగే చేశాడు. స్వామి భుజమువైపు చూస్తునే ఆ నొప్పి అక్కడ నిలువలేదు. వెంటనే వీపుమీదికి పోయినది. స్వామి చూస్తునే నొప్పి అలా జాగా మారిపోవడము ఎస్.పి.గారికి విచిత్రముగ తోచినది. ప్రక్కనున్న డి.ఎస్.పి.గారు మిగతావారు అందరు ఆశ్చర్యపోయారు. వెనుతిరిగి వీపును స్వామికి చూపించాడు ఎస్.పి. స్వామి వీపువైపు చూచాడు. అంతవరకు వీపులోనున్న నొప్పి ఒక్కసారిగ మోకాలులోనికి వచ్చినది. ఆ విషయము స్వామిగారికి చెప్పి మోకాలును చూపించాడు ఎస్.పి. తిరిగి స్వామి మోకాలువైపు చూచాడు. స్వామి చూపు సోకినంతనే ఆ నొప్పి అక్కడ నిలబడలేదు. వెంటనే తలలోనికి చేరుకొన్నది. అదే విషయమునే స్వామికి తెలియజేసి తలను చూపించాడు ఎస్.పి. స్వామిగారి చూపుకు తాళలేనినొప్పి తలను కూడ వదలి తిరిగి కడుపులోనికి వచ్చినది. స్వామికి సహనము సన్నగిల్లినది. చేయునది లేక ఇలా అన్నాడు.

స్వామి : నీవు నాచూపుకు భయపడి ఉన్న జాగాను వదలి వేరు జాగాకు ప్రాకుచున్నావు. అలా చేయవద్దు. నేను నీకు శత్రువును కాదుకదా! నీకు నావలన ఏ హాని ఉండదు. నీవు ఉన్నచోటునే ఉంటే నేను నిన్ను చూడగలను. నా

చూపువలన నీకు ఎట్టి హాని ఉండదు. నేను నిన్ను చూడగలిగితే అన్ని వివరములు నాకు అర్థము కాగలవు. అటువంటపుడు నేను నీకుకాని తర్వాత ఈ ఎస్.పి.కికాని ఏదైన మేలు చేయగలను. సమస్య అర్థము కానపుడు నేనేమి సహాయము చేయలేను కదా! అందువలన నీవు జాగా కదలవద్దు.

స్వామిగారు చెప్పిన మాటలతో నొప్పి కడుపులోనే ఉండి పోయినది. స్వామిగారు తదేకముగ కడుపును చూచాడు. ఐదు నిమిషములపాటు చూచిన స్వామి ఇక మీ సమస్య అర్థమైనది ఇక నీవు వెళ్లిపోవచ్చును. నీకు తగిన విధముగ నేను చేయించగలనని కడుపువైపు చూస్తు చెప్పాడు.. ఆ మాటలతో ఏదో కండీషన్‌మీద నొప్పిని పొమ్మని చెప్పినట్లు బయటివారు అర్థము చేసుకొన్నారు. స్వామి ఇక నీవు వెళ్లవచ్చని కడుపువైపు చూచి చెప్పగానే నొప్పి వెంటనే మాయమైపోయినది. ఎస్.పి గారికి వెంటనే బాధనుండి విముక్తి కల్గినది. ఇదంతయు ఎవరికి ఏమి అర్థముకాలేదు. కాని నొప్పి లేకుండ పోయినది. పిలిచిన వెంటనే రావడము, నిలబడమని చెప్పగానే నిలబడడము, పొమ్మని చెప్పగానే నొప్పి పోవడము చూస్తే స్వామిగారు సామాణ్యులుకాదని మిగతా వారందరికి అర్థమైనది. స్వామిగారు ఎస్.పి.వైపు చూచి ఇలా అన్నాడు.

స్వామి : ఇక నీవు నిర్భయముగ ఇంటికెల్లవచ్చును. ఇక మీదట ఆ నొప్పి రానట్లు ఏర్పాటు చేశాను. నీవు ఎంతకాలము దైవజ్ఞానమును తెలుసుకొంటు దైవజ్ఞానమునకు విలువనిస్తావో అంతకాలము ఆ నొప్పి నీ చెంతకు రాదు. ఆ మాటలువిన్న ఎస్.పి.గారు సరేనని ఒప్పుకొన్నాడు. చెక్‌పోస్టు విషయమును గురించి డి.ఎస్.పి.గారు స్వామిని అడిగితే. తర్వాత వారము రోజులకు రమ్మన్నాడు. అలాగేనని అక్కడినుంచి అందరు వచ్చేశారు. స్వామిగారి ముందర జరిగిన సంఘటనను ఎవరికైన చెప్పిన నమ్మేటట్లు లేదనుకొన్నారు. పిలిచిన వెంటనే నొప్పివచ్చిందంటే, పొమ్మని చెప్పిన వెంటనే పోయిందంటే స్వామి మాటను తూచ తప్పకుండ విన్నట్లని వారికి అర్థమైనది. స్వామి మాటను తాము పాటించి జ్ఞానము తెలుసుకొంటే ఇక ఆయన మాటను అతిక్రమించి నొప్పి రాదనుకొన్నారు. స్వామి గొప్పతనమును గూర్చి తమలోతాము ఎన్నోమార్లు అనుకొన్నారు. స్వామిమాట ప్రకారము ఆ నొప్పి ఆ దినమునుండి ఎస్.పి.గారికి రాలేదు.

వారము దినములకు డి.ఎస్.పి.గారు తిరిగి స్వామి దగ్గరకు వచ్చారు. ఈమారు చెక్‌పోస్టు విషయము అడిగారు. స్వామిగారు తలూపి ఆ విషయము నీకు అర్థము కావాలంటే ఒక చోట జరిగిన యదార్థకథను చెప్పెదను విను అని చెప్పను మొదలుపెట్టెను. అది ఒక పల్లెటూరు. ఆ ఊరి బయట రోడ్డు ప్రక్కన ఒక పచ్చిమిరప తోట ఉండెడిది. దానికి ఒక మనిషి కాపలాగా కూడ ఉన్నాడు. ఒక రోజు దారిలో పోవు ఒక సాధువు తోట ప్రక్కలో పోతూ తోటలోని మిరప కాయలను చూచి రెండు మిరపకాయలను త్రుంచుకోవాలనుకొన్నాడు. వెంటనే తోటలోనికి పోయి రెండే రెండు మిరపకాయలు త్రుంచుకొన్నాడు. అతని వద్ద అన్నము మాత్రమున్నది, కూర లేదు. అందువలన కూర బదులు మిరపకాయ కొరుక్కొని అన్నము తినవచ్చుననుకొన్నాడు. అతను మిరపకాయలు త్రుంచినది తోట కాపలాదారుడు చూచాడు. కాపలా దారుడు అరుస్తూ అక్కడికి వచ్చాడు. సాధువును నానాదుర్భాషలాడి మిరపకాయలు ఎందుకు త్రెంచావని అరుస్తూ అతను ఏమి చెప్పిన వినకుండ, కేవలము రెండుకాయలే త్రెంచినదని చెప్పిన వినకుండ సాధువును బాగా తన్నినాడు. రెండు మిరపకాయలకు సాధువును అంతగ తన్నడము చూచిన వారికి ఎవరికైన అన్యాయమనిపిస్తుంది. కాని అక్కడ ఎవరులేరు. సాధువు బాధపడుచు తన దారిన తాను పోయాడు. అయిన ఆ విషయమును అంతటిని, ఒక వ్యక్తి గమనించాడు. ఇద్దరు స్థూలశరీరుల మధ్య జరిగిన సంఘటనను ఒక సూక్ష్మశరీరి అయిన వ్యక్తి చూచాడు.

సూక్ష్మశరీరి అంటే కనిపించని వ్యక్తి అని అర్థము. కనిపించని వ్యక్తికి ఆ సంఘటన చాలా అన్యాయమనిపించింది. అయిన తాను కనిపించని వ్యక్తి అయినందువలన అప్పుడు తానేమి అనలేక పోయాడు. అయిన ఆ తోట కాపలాదారునికి తగిన ప్రాయాశ్చిత్తము చేయాలనుకొన్నాడు. ఆ దినము రాత్రికి వచ్చి ఆ తోటలో ఒక సెంటు జాగాలోనున్న మిరపచెట్లను పెరికి కుప్పవేసి పోయాడు. తెల్లవారిన తర్వాత ఆ తోట కాపలాదారుడు వచ్చి చూచి లబోదిబోమన్నాడు. నిన్న రెండు మిరపకాయలకు ఒక సాధువును కొట్టినాను కదా అతనే కక్షతో రాత్రికి వచ్చి నా చెట్లను పెరికాడను కొన్నాడు. కాని సాధువుకు ఏమి తెలియదు. తన దారిన తాను ఏడుస్తూపోయాడు. ఆ సంఘటన చూచిన మూడవ వ్యక్తి పెరికి వేశాడను విషయము తోటమాలికి తెలియదు. రెండవరోజు రాత్రి కూడ ఒక సెంటు జాగాలోని మిరపచెట్లు పెరకబడి ఉండడము తోటమాలి చూచాడు. ఈమారు సాధువు మీద చాలాకోపము వచ్చినది. మూడవ దినము కూడ ఆ విధముగనే చేస్తాడని ఊహించిన తోటమాలి రాత్రికివచ్చి తోట దగ్గరనే పడుకోవాలనుకొన్నాడు. అలాగే రాత్రికి వచ్చి తోటలో పడుకొన్నాడు. రాత్రి 12 గంటల వరకు మేల్కొని తర్వాత నిద్రపోయాడు. తెల్లవారి చూచాడు. ఇంకేముంది మూడవరోజు కూడ చెట్లు పెరకబడినాయి. తాను ఇక్కడే పడుకొన్నా ఫలితము లేకుండ పోయిందని అనుకొన్నాడు. పెరకబడిన చెట్లను చూచి చాలా బాధ అయినది. ఈ మారు సాధువును ఎలాగైన పట్టుకొని బాగాతన్ని తన తోటవైపు రాకుండ చేయాలనుకొన్నాడు. నాల్గవరోజు రాత్రి తోట దగ్గరకు వచ్చి కాపలాగ కూర్చున్నాడు. ఈ మారు నిద్రపోకుండ జాగ్రత్తగ ఉన్నాడు. రాత్రి 12 గంటలు దాటింది తెల్లని దుస్తులు వేసుకొన్న ఒక ఆకారము దూరముగ వస్తున్నట్లు అగుపించింది. వెంటనే తోటమాలి జాగ్రత్తపడ్డాడు. చేతి కట్టె తీసుకొని అటువైపు పోయాడు. తోటమాలి తాను పోతూవున్నట్లే కనిపించిన వ్యక్తి తోటలోనికి రావడము చెట్లు పెరకడము అన్ని జరిగిపోయాయి. అక్కడికి పోవులోపలే చెట్లు పెరికిన వ్యక్తి తిరిగి పోవడము జరిగినది. ఈ మారు తాను చూస్తూ వస్తున్నట్లే ఇంత స్పీడుగ పని జరిగిపోవడము తోటమాలికి ఆశ్చర్యము వేసింది. నాల్గవ దినము కూడ సెంటు జాగాలో చెట్లు పెరకబడినాయి. ఎవరు వచ్చినది అంతుబట్టలేదు. సాధువైతే కాదనిపించింది. దూరము నుండి చూస్తూన్నట్లే తోటలోనికి రావడము పోవడము జరిగిపోయినదంటే ఆశ్చర్యముగ ఉన్నది. ఈ విషయమంత ఊరిలో చెప్పాడు. అందరికి వింతకథగ కనిపించింది. ఐదవరోజు ఊరిలోని మరినలుగురు వ్యక్తులను పిలుచుకొని కాపలాగ వచ్చాడు తోటమాలి. ఐదుమంది ఒక చోట కూర్చొని ఈ దినము జాగ్రత్తగ చూడసాగారు. వారందరు తోట ఒక మోటులో కూర్చొని ఉన్నారు. అర్థరాత్రి దాటింది వారికి ఎదురు మోటులోనికి ఒక మనిషి వచ్చినట్లు కనిపించింది. వెంటనే అందరు కేకలు వేయుచు అటువైపు పోయారు. అటువైపు పోయేలోపలే వచ్చిన వ్యక్తి చెట్లను పెరికి పోవడము జరిగినది. దూరమునుండి తెల్లని ఆకారము కనిపిస్తుంది కాని పలానా మనిషి అని ఎవరికి తెలియదు. అటువైపు పోయేలోపలే తన పని ముగించుకొని పోవడము అంటే అది మనుషులతో అయ్యేపని కాదని, అది ఏ దయ్యము పనో అయి ఉండవచ్చునని కొందరికి అనుమానము వచ్చినది. మరుసటి దినము ఈ విషయమే ఊరంత చర్చనీయాంశ మైనది. ఏదో దయ్యమంట మిరపతోటను ప్రతి దినము పెరికివేస్తున్నదట అని కొంత ప్రచారముకాగ, అలా కాదు ఏ దయ్యాలు అట్లు చేయవు ఇదేదో మనుషుల పనియేనని కొందరు అనుకొనుట ప్రారంభించారు. ఆరవ దినము ఆ విషయమును గూర్చి తేల్చుకోవాలని ఊరిలోని వారికి కూడ పట్టుదలకల్గినది. ఆ దినము నలభైమంది యువకులు అందరు తోడై కట్టెలు తీసుకొని రాత్రికి తోటవద్దకు వచ్చారు. నలభైమంది నాలుగు గుంపులుగ విడిపోయి నాలుగు వైపుల కాపలా ఉండునట్లు మాట్లాడుకొన్నారు. ఒక గుంపుకు పదిమంది ప్రకారము విడిపోయి నాలుగువైపుల వేయికళ్ళతో చూస్తున్నారు. రాత్రి 12 గంటలైనది. ఒక గుంపులో చిన్నరాయి పడినది. ఎక్కడిది ఆ రాయి అని చూచుకొనులోపల మరొక చిన్నరాయి పడినది. పడిన రాళ్ళు

వక్క (పోక) సైజుకంటే లావులేవు. నీవు ఏమైన వేశావా నీవేమైన వేశావా అని ఒకరినొకరు అడుగుకొని ఎవరు వేయలేదని నిర్ధారించుకొన్నారు. అయిన చిన్నరాళ్ళు ఎక్కడి నుండి పడినవని ఆలోచించసాగారు. అంతలో వారిముందర ఉన్న చిన్నరాయి చూస్తున్నట్లుగానే ఎగిరిపడింది. అందరు ఆశ్చర్యముగ చూస్తున్నట్లుగానే ఒకరాయి తర్వాత ఒకటి ఎగురుటకు మొదలుపెట్టాయి. వాటంతటకవి మనిషిఎత్తు ఎగిరెగిరిపడుచున్న ఆ రాళ్ళను చూచి అందరికి భయమువేసింది. ఇది మనుషులు చేయు పనికాదని అర్థమైనది. రాళ్ళు పడిన గుంపు భయపడి మరొక గుంపువద్దకు పోయారు. వారివద్ద కూడ ఆ విధముగానే జరిగినట్లు విని ఆశ్చర్యపోయారు. అందరు ఒక చోట చేరి అందరికి అలాగే జరిగినట్లు చెప్పుకొన్నారు. ఇలా అందరు భయపడుచు ఒకచోట గుమికూడి చూస్తున్నట్లుగానే తోటలో ఒక ఆకారము కనిపించింది. ఈ దపా ఎవరు అటువైపు పోలేదు. ఎవరికి అటువైపు పోవుటకు ధైర్యము చాలడము లేదు. ప్రతి దినము జరిగినట్లే ఆ దినము జరిగినది. చెట్లు పెరకబడినాయి. ఆ ఆకారము అక్కడినుండి పోయినట్లు నిర్ధారించుకొన్న తర్వాత అందరు తోటలోనికి పోయి చూచి చెట్లు ఆ రోజు కూడ పెరకబడినట్లు తెలుసుకొన్నారు. అందరు ఇదేమి వింత అని ఆలోచిస్తువుండగానే ఒకని మెడమీద చేతితో ఫలీమని కొట్టినట్లయినది. కొట్టిన శబ్దము అందరికి వినిపించినది. దెబ్బతిన్న వాడు అబ్బా అని గట్టిగ అరిచాడు. ఎవరు కొట్టినది అర్థముకాలేదు. అందరికి భయమేసింది. అక్కడినుండి అందరు ఊరిలోనికి పోయారు. ఆ దినము నుండి ఎవరు ఆ తోటవైపు పోలేదు. తోటలో చెట్లు మాత్రము ప్రతి దినము కొన్ని పెరకబడేవి. ఆ విధముగ తోటలోని చెట్లన్ని అయిపోయినవి. రెండు మిరపకాయలు అవికూడ అన్నములోనికి తీసుకొంటే సాధువును అంతగ కొట్టి చివరకు ఏమిచేయలేక తోట మొత్తమును పోగొట్టుకున్నాడు.

ప్రపంచములో మనలాగ కనిపించకుండ ఎందరోగలరు. వారికి అన్యాయమనిపిస్తే ఏమైన చేయగలరని ఈ తోట విషయములో తెలిసి పోయింది. అలాగే మీరు కనిపించని వ్యక్తులకు సరిపడని పనులు చేశారు. కారుకు గేట్‌పెట్టి ఒక పొరపాటు చేశారు. తర్వాత కోళ్ళు వదలకుండ కుక్కలకోన దాటారు. ఆ తర్వాత ఈశ్వరాలయములో పూజలు చేయకుండ వచ్చారు. ఈ విషయము మీద మీకు ధ్యాసలేదు. మీకు తెలియకుండానే ఒక బృహత్తర కార్యమునకు ఆటంకము కల్గించారు. ఎవరు పోకూడని సమయములో అడవిలోనికి పోయారు. మీకు కనిపించెడి లోకము తప్ప కనిపించని లోకము తెలియదు. అందువలన మీరలాచేశారు. మీ పనులతో కొంతమందికి కోపము వచ్చింది. ఆ కోపము యొక్క ఫలితమే ఎస్.పి.గారికి కడుపునొప్పి రావడము జరిగినది. మీరు చేసిన తప్పులకు మీ తరుపున ఎంతో సంజాయిషీ నేను చెప్పాను అన్నాడు స్వామిగారు అదంతయు విన్న డి.ఎస్.పి.గారికి ఏమి అర్థముకాలేదు. ఏ కార్యమునకు ఆటంకము తమ వలన కలిగిందో తెలుసుకోవాలనుకొన్నాడు.

డి.ఎస్.పి. : స్వామి మాకు తెలియకుండ మేము ఏ కార్యమునకు ఆటంకము కలుగజేశాము?

స్వామి : అది నేను చెప్పిన మీకు అర్థము కాదు. అయిన చెప్పక తప్పదు. రాబోవు అమావాస్యరోజున భూమిమీద పెద్ద భూకంపము జరుగనున్నది. ఆకాశమునుండి కనిపించని ఒక గ్రహము భూమిమీదకు రానున్నది. ఆ గ్రహము భూమిమీద పెద్ద భూకంపమును కలుగజేసి అనేక మంది ప్రాణములను హరించగలదు. భూకంపము పొలములలో జరుగకూడదు. పెద్ద పట్టణములో జరుగవలసియున్నది. అది ఏ పట్టణములో జరుగవలెనని చర్చించుటకు భూమి మీదనున్న చిన్నచిన్న గ్రహములన్నియు ఒకచోట కలిసి చర్చించవలసియున్నది. ఆ చర్చ అడవిలో శివాలయమువద్ద జరుగుటకు నిర్ణయించుకొన్నారు. ఆ పని నిమిత్తము కొన్ని సూక్ష్మగ్రహాలు అక్కడ చేరుటకు మూడునెలలు కారు అడవిలోనికి పోయివచ్చినది. బయటికి ఖాళీ కారు అడవిలోనికి పోయి వచ్చినట్లు కనపించిన అందులో ముఖ్యమైన

గ్రహములు గలవు. తర్వాత నాల్గవనెలలో ఎక్కువమంది అక్కడ కలువవలసియున్నది కావున ఏకంగా బస్సే లోపలికి పోవలసి వచ్చినది. బస్సు ఖాళీగ కనిపించిన అందులో ఎక్కువ మంది గ్రహలున్నారని ఎవరికి తెలియదు. ఈ గ్రహముల సమావేశ ఫలితముగ రాబోవు భూకంపము ఈ దేశమునుండియే మార్చబడినది. జరుగబోవు భూకంపము ఈ దేశములో జరుగక పోవడానికి కారణము ఎన్నో గ్రహాముల చర్చల కృషి అనియే తెలియు చున్నది. ఒక భయంకర భూకంపమును నివారించుటకు జరుగబోవు సమావేశమునకు పోవువారికి ఆటంకము కలుగజేశారు కావున దాని ఫలితముగనే మీ చెక్‌పోస్టులో భయానక వాతావరణము నెలకొనియున్నది. మీరు చెక్‌పోస్టు ఎత్తివేయవలసియున్నది. చెక్‌పోస్టు ఎత్తివేయడమే కాక రాబోవు శివరాత్రికి కుక్కలకోనలో భైరవునికి పూజలు చేయించి అక్కడ కోళ్ళను వదలవలసియున్నది. అంతేకాక ఈశ్వరాలయమునకు 108 ప్రదక్షిణలు చేయవలసియున్నది.

ఆ రోజు అడవిలోనికి ఎవరైతే పోయారో వారందరు ప్రదక్షిణలు చేయకతప్పదు కుక్కలకోనలో పూజచేయక తప్పదు. అలా చేయని ఎడల తర్వాత అమావాస్యనుండి నయముగాని రోగములు అందరికి తగులుకోగలవు. వాటిని ఎవరు బాగుచేయలేరు. ఇదంతయు నమ్మరాని విషయముగ మీకు కనిపించిన నేను చెప్పునది సత్యము. భూకంపము నకు గ్రహములకు ఏమి సంబంధము అని నీవనుకోవచ్చును. ఒక్క భూకంపమునకే కాదు ఎచ్చటైతే సామూహికముగ ప్రజలు చనిపోవు సంఘటనలు జరుగుచున్నవో అక్కడంతయు గ్రహముల హస్తముండును.

డి.ఎస్.పి : భూకంపమును నివారించలేమా స్వామి.

స్వామి : ఎవరు నివారించలేరు. అది తప్పక జరిగితీరుతుంది. కాని పలాన చోటనని ముందుగా చెప్పుటకు వీలులేదు.

డి.ఎస్.పి : గ్రహములు వాహనములలో ప్రయాణించునా?

స్వామి : అవును అలాగే జరుగుచున్నది. వాహనము తిరుగు జాగాలో పదిమంది మనుషులలో ఒక గ్రహా అయిన ప్రయాణించుచుండును. అది ఎవరికి తెలియదు. అడవిలోనికి పోవు వాహనములులేవు కనుక ప్రత్యేకముగ వాహనములో అవి పోవలసి వచ్చినది. చెక్‌పోస్టు ఉన్నదానివలన ఖాళీవాహనము పోయినట్లే గుర్తించగలిగారు. లేకపోతే తెలిసేది కాదు.

డి.ఎస్.పి. : ప్రతి దినము రాత్రిపూట చెక్‌పోస్టులో ఒక మనిషి అడవి లోపలికి పోయినట్లు కనిపిస్తువున్నది. పోవడము మాత్రము కనిపిస్తున్నది, రావడము ఏ దినము చూడలేదు. ఇది ఏమైవుంటుంది? కొంచెము వివరముగ చెప్పండి స్వామి!

స్వామి : ప్రతి దినము అడవిలోనుండి మనిషి రావడము జరుగుచున్నది, అలాగే పోవడము జరుగుచున్నది. పోవడము రాత్రిపూట జరుగుచున్నది కావున మీరు చూడగల్గుచున్నారు. రావడము పగలుపూట జరుగుచున్నది కావున ఎవరు చూడలేకపోవుచున్నారు. పగలుపూట సూక్ష్మశరీరము కనిపించదు అడవిలోనికి ప్రతి దినము రాత్రిపూట పోవునది సూక్ష్మశరీరము కావున అది మసక మసకగ చీకటిలో కనిపిస్తున్నది. పగలుపూట ఎవరికి కనిపించకుండ వచ్చిన సూక్ష్మశరీరము నేరుగ ఎస్.పి. గారి వద్దకు పోవుచున్నది. సమయము చూచి సాయంకాలము పూట ఎస్.పి. గారి శరీరములోనికి ప్రవేశించి కడుపులో నొప్పిని కలుగచేయుచున్నది. ఆ పని అయిపోయిన తర్వాత తిరిగి రాత్రిపూట అడవిలోనికి పోవుచున్నది. అలా ప్రతి దినము పోవుటకు ఒక కారణము కలదు. అదేమనగా! అడవి మొదటి భాగములో ఫర్లాంగు దూరములోనే ఒక పెద్ద పుట్టగలదు. ఆ పుట్టలో చాలాకాలము నుండి ఒక పెద్ద సర్పము ఉన్నది.

పుట్టకు ఎదురుగ నూరు అడుగుల దూరములో ఒక మర్రిచెట్టు గలదు. ఆ మర్రిచెట్టు మీద ఒక మనిషి సూక్ష్మశరీరముతో నివశిస్తున్నాడు. ఆ మనిషి ఎదురుగనున్న పుట్టలోని పాముకు కాపలాగా ఉన్నాడు. అడవి మొదటి భాగమైనందు వలన ఎవరైన మనుషులు అక్కడికి వచ్చు అవకాశమున్నది. అట్లు ఎవరైన వస్తే వారివలన ఆ పాముకు ఏ ముప్పు లేకుండునట్లు కాపలా కాస్తుయుండెను. పుట్టలోని పాము మామూలు పాముకాదు. దాని తలలో మణికల్గి ఎంతో ప్రత్యేకత కల్గియున్నది.

ఒక దినము అక్కడికి దగ్గరగనున్న పాములగూడెములోని ఆవులు కొన్ని అడవి మొదటి భాగమైన పుట్ట సమీపమునకొచ్చాయి. వాటిని వెతుకుతు ఆవులకాపరి వచ్చాడు. ఆవులు పుట్ట సమీపములో పడుకొని ఉన్నాయి. ఆవులకాపరి ఆవులకోసము పుట్ట సమీపములోనికి వచ్చాడు. ఇదంతయు పుట్టకు ఎదురుగనున్న మర్రిచెట్టు మీదనుండి సూక్ష్మశరీరము చూస్తూనే ఉన్నది. అక్కడికి వచ్చిన పశువులకాపరిని చూచి పడుకొన్న ఆవులు లేచాయి. లేచినవి మూత్రము పోయను మొదలుపెట్టాయి. వాటిని చూచిన పశువులకాపరికి కూడ మూత్రము వచ్చినది. వాడు అక్కడే పుట్టవైపు తిరిగి నిలబడి పుట్టమీద మూత్రము పడునట్లు మూత్రవిసర్జన చేశాడు. మూత్రము పోసినపుడు పుట్టమీద కూడ కొంత మూత్రము పడినది. దానిని గమనించిన సూక్ష్మశరీరమునకు కోపము వచ్చినది. వెంటనే చెట్టు దిగివచ్చాడు. తన కోపమును ఓర్చుకోలేకపోయాడు. అంతలోనే మూత్రము పోసిన శబ్దమునకు పాము బయటికి వచ్చినది. పశువులకాపరి పామును చూడలేదు. తన పనిలో తాను లగ్నమై పశువులను త్రోలను మొదలు పెట్టాడు. సూక్ష్మశరీరము పాము శరీరములోనికి ప్రవేశించింది. సూక్ష్మశరీరము చేరిన పాము పశువుల కాపరివైపు కోపముగ వచ్చింది. దానిని చూచిన కాపరి పారిపోవాలని చూచాడు. దగ్గరనున్న ఆవునెక్కి ఆవును పరిగెత్తునట్లు చేసి పాము బారినుండి తప్పించుకొన్నాడు. సూక్ష్మశరీరమునకు కోపమాగలేదు. ఎలాగైన వానిని చంపాలనుకొన్నాడు. పామును వదలి సూక్ష్మశరీముతో పాములగూడెముకు పశువులకాపరిని వెదుకుచు వచ్చాడు. కాపరి చిరునామా తెలుసుకోగలిగాడు. అంతలోనే పశువులకాపరి ఒక గ్రామదేవత దగ్గరికిపోయి పాము తనదగ్గరకు రాకుండ చూడమని మ్రొక్కుకున్నాడు. గ్రామదేవత ఒక మనిషిలోనికి ఆవేశమైవచ్చి పుట్టమీద మూత్రము పోయడము వలననే నీకు ముప్పువచ్చినదని చెప్పినది. పుట్టలో పవిత్ర సర్పముందని అక్కడ మూత్రము పోయుట వలన నీకు మూడు రోజులు ప్రాణాపాయమున్నదని మూడురోజులు గడిస్తే పరవాలేదని చెప్పినది. పశువులకాపరిని వెదుకుచు పోయిన సూక్ష్మశరీరము ఊరిలో ఒక పాముయందు చేరి కాపరిని కాటువేయబోయింది. రెప్పపాటులో కాపరి తప్పించుకొన్నాడు. అయిన మూడు రోజులలోపల పాములో ప్రవేశించిన సూక్ష్మశరీరము కాటువేయడము అతను చనిపోవడము జరిగినది. ఈ తతంగమంతయు ఊరిలోని వారికి తెలిసిపోవుట వలన అడవిలోనికిగాని, పుట్టవద్దకుగాని ఎవరు పోకుండిరి.

పుట్ట దగ్గరే చెట్టుమీద గల సూక్ష్మశరీరము ఎవరిని అక్కడికి రాకుండ చూచుకొనెడిది. ప్రతి దినము రాత్రిపూట పాము పుట్టనుండి బయటకు వచ్చి తన నోటిలోని మణిని తీసి బయటపెట్టెడిది. ఆ మణి దీపమువలె చీకటిలో వెలుగుచుండెడిది. అది దీపమని భ్రమించి అక్కడికి వచ్చిన కప్పలను చిన్నచిన్న పురుగులను పాముతిని కడుపునింపుకొనెడిది. ఈ విధముగ ఒక గంటసేపు ఆహారము తీసుకొనునంతవరకు ఆ మణి ఎవరి కంట పడనట్లు సూక్ష్మశరీరము కాపల కాసెడిది. తర్వాత ఆ మణిని పాము నోటిలో పెట్టుకొనెడిది. ఆ వెంటనే పాములోనికి సూక్ష్మశరీరము ప్రవేశించి దయ్యాలకోన (కుక్కలకోన)వైపు పోయెడిది. పాము దయ్యాలకోనలోని భైరవునిగుడి దగ్గరకు పోయి అక్కడ భైరవుని ప్రతిమముందర మణినియుంచి అక్కడే వేచియుండెడిది. అడవి మధ్యభాగములోగల ఈశ్వర

దేవాలయములో కూడ ఒక పెద్ద సర్పముండెడిది. అది కూడ మణిగల సర్పమే. ఆ సర్పము కూడ సరిగ అర్ధరాత్రి సమయమునకు కుక్కలకోనకు వచ్చి తన మణిని భైరవుని పాదములచెంత పెట్టి అక్కడే కాచుకొనియున్న సర్పము వద్దకు పోయెడిది. రెండు పాములు ఒక గంటసేపు కలిసియుండెడివి. ఆ సమయములో ఏ ముంగిసగాని, ఏ పిల్లిగాని, ఏ జంతువుగాని అటువైపు రాకుండ గుడిచుట్టు కుక్కలు కాపలాయుండెడివి. ఇదంతయు ఎవరు చెప్పకనే క్రమము తప్పక జరిగెడిది. దేశములో ఎదైన పెద్ద విపత్తు జరుగబోవుముందు ఎంతోమంది దేవతలు భైరవుని గుడిముందుకు వస్తారని, అపుడు భైరవుడు బయటికి వస్తాడని, భైరవుడు వచ్చు సమయమునకు మణులు ఆయన పాదములచెంతయుంచి ద్వార పాలకులుగ రెండు పాములుండడము, బయట కుక్కలు కాపలా యుండడము అక్కడ ఆనవాయితీయైపోయినది. అర్ధరాత్రి సమయములో అక్కడ పాములు లేకుండ పోవడముగాని, కుక్కలు లేకుండ పోవడముగాని జరుగదు. ఒక్క శివరాత్రి సమయములో ఏడు దినములు అక్కడ ఏమి ఉండదు. దీపములేని భైరవుని గుడి అర్ధరాత్రి సమయములో మణుల ప్రకాశముతో వెలుగుతువుంటుంది. ప్రతిదినము పాములు రెండు పోను 30 మైళ్ళు, రాను 30 మైళ్ళు ప్రయాణించెడివి. పాములో చేరి ప్రయాణించిన సూక్ష్మశరీరము పగలంతయు మర్రిచెట్టు మీద ఉండెడిది.

మీరు అకాలముగ అడవిలోనికి పోయారు కావున భైరవునికి కోపము వచ్చినది. భైరవుని అజ్ఞతోనే సర్పరూపముగ మారుచు సర్పములో చేరుచున్న సూక్ష్మగ్రహము పగలు మర్రిచెట్టును వదలి అడవి బయటకు వస్తున్నది. పగటిపూట మనిషి సూక్ష్మముగానే వస్తున్నది కావున ఎవరికి కనపించడములేదు. పగలు ఎస్.పి.గారి వద్దకు చేరి సమయముకొరకు వేచియుండి సమయము దొరికినపుడు ఎస్.పి.గారి లోనికి దూరి కడుపు నొప్పిని కలుగజేయుచున్నది. కడుపునొప్పిని కలుగజేసిన సూక్ష్మశరీరము తిరిగి రాత్రికి చెక్‌పోస్టు దాటి అవతలివైపునున్న మర్రిచెట్టు వద్దకు చేరుచున్నది. అందువలన ప్రతి దినము రాత్రిపూట చెక్‌పోస్టులో మనిషి అడవిలోనికి పోయినట్లు కనిపిస్తున్నది. ప్రతి దినము పాములో చేరి అడవిలోని భైరవుని గుడివద్దకు పోవలసియుండుట వలన, ప్రతి దినము ఎస్.పి.గారికి కడుపును నొప్పించవలసియుండుట వలన, ఈ రెండు కార్యములను ఒకే సూక్ష్మశరీరము చేయుట వలన, ప్రతి దినము అడవి బయటకు అడవిలోపలికి సూక్ష్మము ప్రయాణించవలసి వచ్చినది. కావున ప్రతి దినము చెక్‌పోస్టులో మనిషిలోపలికి పోయినట్లు కనిపిస్తున్నది. పుట్టయు, మర్రిచెట్టుయు చెక్‌పోస్టుకు చాలాదగ్గరగ ఉన్నాయి కాబట్టి, పుట్ట చెట్టు రెండు ప్రత్యేకత కల్గియున్నవి కాబట్టి, మీరు చెక్‌పోస్టు అక్కడ లేకుండ చేసుకోవడము మంచిది. కొన్ని సందర్భములలో పుట్టలోని మణిపాము చుట్టూ ఫర్లాంగు వరకు తిరుగుతుంది కావున ఆ పామును మీరు చూచుటగాని లేక ఆ పాము మిమ్ములను చూచుట గాని జరుగుట మంచిది కాదు. పాము బయటికివస్తే దానికి కాపలాగానున్న చెట్టుమీది సూక్ష్మము కూడ వస్తుంది. ఇవన్నియు ఆలోచించి మిమ్ములను అక్కడినుండి ఖాళీ చేయమన్నాను. అంతగా అయితే కిలో మీటరు దూరములో చెక్‌పోస్టును పెట్టుకోండి. ఇదంతయు ఎవరికి తెలియని వివరము. దీనిని మీకు నేను చెప్పాను ఇదంతయు సత్యమనిపిస్తే నామాట విని అక్కడినుండి పోండి.

డి.ఎస్.పి. : అడవిలో నిలిచిపోయిన బస్సునెలాగ తెచ్చుకోవాలి స్వామి.

స్వామి : వచ్చే అమావాస్యయే శివరాత్రి కావున ఆ దినము పోయి నేను చెప్పినట్లు పూజలు ప్రదక్షిణలు చేసి డీజిల్‌పోసి తెచ్చుకోండి తప్పక వస్తుంది.

డి.ఎస్.పి : స్వామి ఎన్నో ప్రశ్నలు అడగాలని ఉంది కాని ఏమి అడుగుటకు బుద్ధిపుట్టడము లేదు. మీరు చెప్పినవన్ని సత్యము అను నమ్మకము నాలో ఏర్పడినది. మీ మాట ప్రకారము మా ఎస్.పి.గారికి కడుపునొప్పి పోయినది. మీరు చెప్పినట్లు చెక్‌పోస్టు ఎత్తివేసుకొని అడవిలోనికి శివరాత్రి సమయములో పోయి పూజలు చేసి వస్తాము.

ఈ విధముగ స్వామివద్ద సెలవు తీసుకొని డి.ఎస్.పి. తిరిగి పోయాడు. అన్ని స్వామి చెప్పినట్లే చేశారు శివరాత్రి దినముననే ఆఫ్రికా ఖండములో పెద్ద భూకంపము సంభవించినది. ఆ సంఘటనతో స్వామివారు చెప్పిన వాక్కు సత్యమని తెలిసినది. మనము కూడ కనిపించెడి ఈ ప్రపంచమునొక్క దానినే ధ్యాసలో పెట్టుకోక కనిపించని సూక్ష్మశరీరముల (గ్రహముల)ను ధ్యాసలో పెట్టుకొని జీవిస్తాము.

# జీవిత నాటకము

మానవ జీవితమొక నాటకములాంటిది. నాటకమును ఆట అని కూడ అందుము. జీవితము ఒక నాటకమునకు ఆటలాంటిది. ఒక నాటకమునకు ఒక డైరెక్టరు (దర్శకుడు), ప్రొడ్యూసర్ (నిర్మాత) ఉన్నట్లు మానవ జీవిత ఆటకు కూడ ఒక నిర్మాత, ఒక దర్శకుడు గలరు. నిర్మాత ఈ సినిమా తయారు చేయమని దర్శకునికి చెప్పి అందులకు కావలసిన ధనమిచ్చి దర్శకునిచేత సినిమాను తయారు చేయించుచున్నాడు. చిత్ర నిర్మాణ కార్యమంత దర్శకుని మీదనే ఆధారపడివుండును. చిత్రనిర్మాణ కార్యమందు నటీనటులతో దర్శకునకే సంబంధముగలదు. ఎలా ఆడించవలసినది దర్శకుని మీదనే ఆధారపడి వుండును. నిర్మాత మాత్రము తన చిత్రనిర్మాణమును దర్శకుడెలా చెప్పుచున్నది నటీనటులెట్లు ఆడుచున్నది ప్రక్కనుండి గమనించు చుండును. అట్లే జీవితనాటకమునకు కూడ దర్శకుడు, నిర్మాత ఉన్నారు. నిర్మాత పరమాత్మకాగ, దర్శకుడు ప్రకృతియైనది. సినిమాకు డబ్బు ఇచ్చి నటీనటులను ఆడించినట్లు పరమాత్మ ఆత్మ (శక్తి)యను డబ్బునిచ్చి జీవులను ఆడించుచున్నాడు. ఆత్మ చైతన్యము జీవులను కదలించుచుండగ, ఆ కదలికను ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగవుండి ఒక్కొక్కరి ఆట ఒక్కొక్క విధముగ ఉండునట్లు చేయుచున్నది ప్రకృతి. జంత్రగాడు బొమ్మలను ఆడించునట్లు సకల జీవులను నేను ఆడించుచున్నానని భగవద్గీతలో భగవంతునిగయున్న పరమాత్మ పలికినాడు. పరమాత్మ సృష్టించిన ఈ సృష్టిలో సకల మానవుల జీవితములన్నియు ఆటలైవున్నవి. కాని మన నిత్యకృత్యములు నాటకీయముగ జరుగుచున్న ఆటలని మనము ఇంకొకరిచేత ఆడింపబడు బొమ్మలమని మానవునికి తెలియదు.

మన జీవితములన్నియు ముందే నిర్ణయింపబడిన పాత్రల నిర్ణయము ప్రకారము ప్రకృతి జనిత గుణములచేత ఆడింపబడు ఆటలని మానవునికి తెలియునట్లు మనము చేయు పనులయందు చాలా భాగము ఆటలని పేర్లు పెట్టి మాట్లాడునట్లు తెలిసిన పెద్దలు చెప్పారు. మన కార్యములలో ఆటలను పేర్లు కలిగిన ఆటల పేర్లు ఇలా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| 1. ఆట్లాడుట | 2. పోట్లాడుట | 3. గుద్దులాడుట |
| 4. కొట్లాడుట | 5 తిట్లాడుట | 6. స్నానమాడుట |
| 7. ఈదులాడుట | 8. గుంజులాడుట | 9. నాట్యమాడుట |
| 10. పాటపాడుట | 11. హాస్యమాడుట | 12. నీల్లాడుట |
| 13. వసంతమాడుట | 14. జూదమాడుట | 15. నవ్వులాడుట |
| 16. త్రిప్పులాడుట | 17. ఎగుల్లాడుట | 18. ద్రుంకులాడుట |

| | | |
|---|---|---|
| 19. బ్రతిమలాడుట | 20. పీకులాడుట | 21. బంతి ఆడుట |
| 22. బొమ్మలాడుట | 23. అబద్ధమాడుట | 24. సత్యమాడుట |
| 25. పెండ్లియాడుట | 26. పెత్తనమాడుట | 27. బేరమాడుట |
| 28. గిచ్చులాడుట | 29. వ్యవహారమాడుట | 30. ముద్దులాడుట |
| 31. పందెమాడుట | 32. సరసమాడుట | 33. వేటాడుట |
| 34. దొర్లాడుట | 35. త్రోచులాడుట | 36. దోబూచులాడుట |
| 37. మాట్లాడుట | 38. వెదుకులాడుట | 39. పరుగులాడుట |
| 40. తగాదాలాడుట | | |

ఈ విధముగ మన జీవితము ఎన్నో ఆటలమయమైనది. పరమాత్మ చూచుచుండగ ప్రకృతిచేత ఆడింపబడు మనము ప్రకృతిని గాని, పరమాత్మను గాని గుర్తించలేకుండ ఇవన్నియు మనము మన స్వంతముగ ఆడునవేనని అనుకొని పొరబడుచున్నాము. కాని తెలిసిన పెద్దలు ప్రపంచమొక నాటకరంగమని ఏనాడో చెప్పారు. ఈ ప్రపంచరంగస్థలము మీద మన పాత్రలు ఎన్నో విధములుగ ఉండినను ఇవి పాత్రలని గుర్తించలేని మనము జీవితము కొద్ది కాలముండు ఒక పాత్రయని ఆ జీవితముండువరకే వాడుకొడుకని, ఈమె భార్యయని, వీరు అన్నదమ్ములను భావముండవలెనని నిజమునకు వారు తనకెలాంటి సంబంధములేనివారని తెలియక నావారేనను భ్రమలో మునిగి పోవుచున్నారు.

ఒక నాటకములో రంగస్థలము మీద కొందరు నటీనటులు కలసి కుచేల సంసారమను నాటికను నిర్వహిస్తున్నారనుకొందాము. అందులో బార్యవేషము వేసిన ఆమె గుంటూరు నుండి వచ్చివుంటుంది. భర్త వేషము వేసినవాడు హైదరాబాద్ నుండి వచ్చాడు. పిల్లలవేషము వేసినవారు ముద్దనూరు నుండి కొందరు, ప్రొద్దుటూరు నుండి కొందరు వచ్చారు. ఆ నాటకములో కుచేలవేషము వేసిన వెంకయ్య అనువాడు నాటక మాడునంతవరకు గుంటూరునుండి వచ్చిన లతాదేవి అను ఆమెను బార్యగ మాట్లాడించుచు దగ్గర దగ్గరగ ఉంటున్నా పైకి కుచేలునిగ పూర్తిలగ్నమై ఉండినప్పటికి తనది హైదరాబాదైనది తను పలానా వెంకయ్యనను విషయము అంతరంగమున ఇమిడ్చి ఉండును. అట్లే ఆమె కూడ తనది గుంటూరని తనపేరు లతాదేవియని మరవకుండును. పైకి మనము బీదవారమను బాధపడుచున్నను నిజముగవారు బీదవారు కారను భావము వారికుండును. ఆ విధముగనే జీవిత నాటకములో తనొక జీవాత్మయని ఎందరో జీవాత్మలు కుంటుంబమను పేరుగల నాటకములో పాత్రలు వహిస్తున్నారని తెలిసి జ్ఞప్తికలిగి ఉండాలి. కుంటుంబ విషయములో కొన్ని చోట్ల బాధ సంతోషములు వచ్చిన అవి పైకి కనిపించునవిగ ఉండినప్పటికి తన అంతరంగమున ఇవన్ని వచ్చునవి పోవునవియని, తనొక జీవాత్మనని పైన జరుగునవి, తనకు కావని, తన జీవితములో జరుగునవేనను ఎరుకకల్గి ఉండాలి. అలాంటపుడు గీత చెప్పినట్లు జ్ఞానము కలిగిన సర్వదుఃఖములకు హానికల్గునను మాట నిజమౌను. అందువలన జీవులమైన మనము అనేక జన్మల నాటకములలో పాల్గొనువారమని, మన స్వస్థలము వేరని, మనపేరు వేరని తలచి జీవిత నాటకములో మునిగి తన ఊరుపేరు తెలిసి స్వస్థలము చేరితే అదే మోక్షమగును. స్వస్థలమైన మోక్షము చేరినవాడు ఇక జీవితనాటకము ఆడుటకు ప్రపంచరంగస్థలము మీదికి రానవసరము లేదు.

అట్లని నేను ముసలివాడనైనాను కదా! నాతో నా కుటుంభీకులకు ఏమి పనిలేదు కదా! ఇక్కడెందుకు ఊరకుండాలి ఎక్కడైన గురువువద్ద చేరి ఇప్పుడైనా జ్ఞానము తెలుసుకొందామని ప్రయత్నించినప్పుడు కూడా ఎన్నో ఆటంకములు ఈ నాటకములో ఏర్పడగలవు. ఎందుకనగ ఈ ప్రపంచములో నాటకములాడించునది ప్రకృతియే కదా! అందువలన ప్రకృతి పరమాత్మవైపు ఎవరిని పోకుండునటుల చేయడము దాని సహజము. కావున దాని చేతిలోని నాటకములో దైవమువైపు ప్రయాణించువారికి రకరకములుగ ఆటంకములు కలుగజేయును. ఆ ఆటంకములను దాటవలయునంటే చాలా కష్టము. అందువలన భగవద్గీతలో విజ్ఞానయోగమున 14వ శ్లోకములో ***'నాచేత నిర్మింపబడిన గుణముల మయమైన మాయను (ప్రకృతి) దాటుటకు దుస్సాధ్యము.'*** అనుమాటను శ్రీకృష్ణుడు కూడ చెప్పాడు. అది నిజమైన మాటయే అందువలన మాయచేత ఆడింపబడు ఈ మాయ నాటకములలో జ్ఞానమార్గమున ఒక వ్యక్తికి తన భార్య ఆటంకమైనిలచును. ఇంకొకరికి తన కుమారులాటంకమై నిలతురు. మరియొకరికి తల్లి, ఒకనికి తండ్రి మరియొకనికి బంధువులు ఇలా ఎందరో ఎన్నో సమస్యల రూపముగ నిలతురు. అపుడు వారిని కాదని వారికి వ్యతిరేఖముగ నడువవలయు నంటే చాలా కష్టము. వీరంతా కొంతకాలము ఉండువారే! ఉన్నంతవరకే నావారను భ్రమ! నిజముగ ఎవరి పాత్రవారిది. పాత్ర అయిపోయినపుడు భర్త స్టేజీ దిగిపోతూవుంటే భార్యగవున్న ఆమెగాని, కొడుకులుగాని, బంధువులుగాని ఎవరు వెంటరారు కదా అలాంటపుడు వీరితో నాకేమిపని వీరిదారి వీరిది నాదారి నాదియని నీవు జ్ఞానమువైపు సాగితే భార్యగయున్న ఆమె టైమ్‌కు (తగిన సమయమునకు) అన్నము చేయదు. నేను విషము త్రాగి చనిపోతానంటుంది. ఒక రకముకాదులేండి చాలా రకములుగ ఉండును ఆ సమస్యలు. ఉదాహరణకొక వివరమిస్తాను చూడండి.

ఒక వ్యక్తి తన చేతనైనంతవరకు ఉద్యోగము చేసి చివరకు రిటైర్టయినాడు అనుకొందాము. అపుడు అరవై సంవత్సరముల పైబడిన ఆ వ్యక్తి ఒక దినము ఇలా అనుకొన్నాడు. 'నేను ఇంతకాలము ఉద్యోగము చేసి భార్య బిడ్డలను పోషించాను. అంతో ఇంతో డబ్బు సంపాదించు కొన్నాను. అయినప్పటికి అందరిలాగ నేను కూడ ఒకరోజు చనిపోవాల్సిన కాలము దగ్గరైనది. ఇపుడున్న డబ్బుగాని ఈ భార్యబిడ్డలుగాని వెంటరారు. నా వెంటవచ్చునదేదైనా ఉన్నదా అనుకొంటే ఈ ప్రపంచములో ఏమిలేదు. కొందరు పెద్దలు జ్ఞానము తెలుసుకోండి అదియే మన వెంటవచ్చు ధనమంటున్నారు. ఆ మాట వాస్తవమనుకొన్నట్లు కొందరు పుట్టుకతోనే జ్ఞానులై ఉన్నారు. వెనుకటి జన్మసంస్కారము చేతవారు పుట్టుకతో జ్ఞానులను మాట వినుచున్నాము. కొన్ని జన్మల జ్ఞానార్జన జన్మలనుండి ముక్తి కల్గిస్తుందను మాట కూడ విన్నాము. పూర్వము ఎందరో మనకంటే తెలివైనవారు సిద్ధార్థుడు (బుద్దుడు), విశ్వామిత్రుడు మొదలైనవారు కూడ వారివారి గొప్ప రాజ్యములను వదలి జ్ఞానార్జన చేసారు. ఇంతవరకు ధనార్జన చేసిన నేను ఇప్పటినుండైన నా వెంటవచ్చు జ్ఞానమును సంపాదించుటకు పూనుకోవాలి. జీవితనాటకములో నేను కేవలము పాత్రధారినే అనుమాట మరచి నాటకములోని వారందరు నావారేనను కోవడము పొరపాటు. ఇక వారితో ఏవిధముగ ఉండాలో అలాగే ఉంటూ జ్ఞానము తెలుసుకోవాలి.'

ఇట్లు యోచించిన ఆ వ్యక్తి ఒక గురువును ఆశ్రయించి అపుడపుడు అక్కడకు పోయి జ్ఞానము తెలుసుకొని వస్తుండెను. ఒకమారు గురువువద్దకు పోయిన ఆ మనిషి పదిహేను రోజులు ఇంటికి తిరిగి రాలేదు. గురువుగారి జ్ఞానప్రచారములో ఇతరులకు కూడ జ్ఞానమిదియని తెలుపుటకు ఇతర ప్రాంతములకు అతడు పోయాడు. అప్పుడు ఇంటినుండి అతని భార్యకొడుకు వచ్చి గురువుగారితో వాదనకు దిగారు. ఆ వాదన ఎలావుందంటే :-

**భార్య :** ఏమయ్య గురువుగారు! నామొగుడు వచ్చి 15 రోజులైనది. ఇక్కడ కూడలేదు. ఎక్కడికి పోయాడు.

**గురువు :** నీ భర్త జ్ఞానకార్యము మీద వెళ్లాడమ్మా. ఇంతలో వస్తాడు.

**భార్య :** ఇలా జ్ఞానమని ఇన్ని దినములు ఇక్కడక్కడ ఉంటే మాకు సంసారములు లేవా? మాకు పనులు ఉండవా?

**గురువు :** అతను నాకేమి పనిలేదన్నాడే. నాతో మావారికి ఏ అవసరము లేదని, అతనే మేము వద్దన్నా వెళ్లాడు. వచ్చిన వెంటనే పంపుతాము.

**కొడుకు :** మానాయనకంటే బుద్ధిలేదు! ఇన్ని దినములు పెట్టుకొనేదానికి మీకు బుద్ధిలేదా! అని ఎవరైన అంటారు కదా!

**గురువు :** ఎవరైన ఎందుకులేండి ఎవరైన అనుచు ప్రత్యక్షముగ మీరే అంటున్నారు. కదా! మీ నాయనకు, నాకు బుద్ధి ఉండబట్టే అతను ఆ కార్యము మీద వెళ్లుతానన్నాడు. సరేనని నేనన్నాను.

**కొడుకు :** ఇలాంటిది ఏమి భక్తి దినములకొద్ది ఇల్లు విడచి ఉండడము. ఎవరైన గురువులు మార్గదర్శకులుగ ఉండాలి కాని ఇలానా?

**గురువు :** నీమాట నేనొప్పుకుంటాను మాది భక్తికాదని. నేనొక ప్రశ్న అడుగుతాను జవాబు చెప్పు. నీవు తలపెంచి బాబా నాకు అపుడపుడు ప్రత్యక్షమై మాట్లాడునని నేను బాబా భక్తుడనని చెప్పుకొంటుంటావు కదా! బాబా దగ్గర నెలలకొద్ది కొందరుంటారు కదా! అపుడు వారికి బుద్ధిలేదా? వీరికి బుద్ధిలేదని నీవు అనకూడదా. 15 దినములకే బుద్ధి లేదన్న వానివి అంతో ఇంతో భక్తుడనని గుర్తుగ తలవెంట్రుకలు పెంచిన వానివి నీవు ఇలా మాట్లాడితే ఏమి బాగుండును.

పైగా మార్గదర్శకులుగా ఉండాలన్నావు. గురువులని దగ్గరికివస్తే సాయంకాలము వరకు దర్శనములేదనడము, కొన్ని దినముల వరకు మాట్లాడకుండడము మార్గదర్శకమా? మా మాదిరి వెంటనే పిలిచి ఆప్యాయతగా మాట్లాడించడము మార్గదర్శకము కాదా?

**కొడుకు :** మీ పద్ధతి మాకు నచ్చడములేదు. బాబాగారు ఎవరికి పనులు చెప్పరు.

**గురువు :** అవును ఆయన మా మాదిరి వచ్చిన వారిని జ్ఞానప్రచారమునకు వినియోగించివుంటే జ్ఞానము చిన్న పల్లెలలో కూడ తెలిసివుండేది. అలాకాక ఆయన భజనలు చేయించబట్టి మీలాంటి తెలియని మనుజులు జుట్టుపెంచబట్టారు. మీకు జ్ఞానము తెలియక రకరకాలు వేషాలు వేస్తు జ్ఞానులవలె నటిస్తు అంతో ఇంతో జ్ఞానమార్గములో పోవువారికి ఆటంకములౌతారా. మీనాన్నకున్న జ్ఞానము నీకు లేదు. నీవు అతనికే బుద్ధిలేదని అంటావా! అతనికి అంతో ఇంతో జ్ఞానమున్నది కావున జ్ఞానమనునది వేషములో ఉండదని నీమాదిరి వేషము వేయలేదు. నీవు అందరితో భజనలు చేయిస్తే ఆయన జ్ఞానమిదియని ఇతరులకు తెలుపు కార్యమునకు పోయాడు. ఎవరిది మంచిపనో ఒక్కమారు ఆలోచించు.

**కొడుకు :** మా స్వామిగారు ఎక్కువ మహత్యము కల్గినవారు, వారి భజనలు చేస్తే ఎంతో మంచిది. మా స్వామి పటములో కూడ విభూతి రాలుతుంది. మీకేమి మహత్తుంది. మీ జ్ఞానము ప్రచారము చేయడానికి.

**గురువు :** మహత్తులు చూపువాడు మధ్యముండు అని వేమన అన్నట్లు అసలైన జ్ఞానమునకు మహత్తులుండవు. మహత్తులన్ని జనాకర్షణకొరకని తెలుసుకో. స్మశానములో రాల్లుపెట్టి పలానా ఇల్లని మంత్రించితే ఆ ఇంటిలోనికి పోయి ఆ రాళ్లుపడును. దాన్ని రాళ్లతంతు అంటారు. అదే విధముగ ఒకచోట నుండి మరియొకచోట విభూది పోయి రాలడమును భూడిద

తంతంటారు. నీకు ఆ విషయములు తెలియవు కావున దానిని మహత్తంటున్నావు. మావద్ద అలాంటి మహత్తులు ఏవి లేవు. నీ చేతనైతే నా భక్తున్ని జ్ఞానము తెలిపి మీ భక్తునిగ మార్చుకో అదే మహత్తని తలుస్తాను నేను ఎవరిని ఈ పని చేయమని చెప్పను వారు చేస్తుంటే వద్దని చెప్పను. నా పని అంతయు ధర్మయుక్తమైన జ్ఞానము తెల్పడము తప్ప ఏమిలేదు. మీకు మా పద్ధతి నచ్చకపోతే మీరు రావద్దండి, మీ నాన్నను రానీయకండి అట్లుకాక మీది భక్తికాదు అని అంటే మీది భక్తియేనా అని దుప్పటిప్పవలసి వస్తుంది.

ఇలాగ వాదించుకొన్నవారు ఎవరి దారిన వారు పోయారు. కొద్ది రోజులకు ఆయన రానేవచ్చాడు. అపుడు ఆయన తిరిగి ఆశ్రమానికి గురువువద్దకు పోకుండ అన్ని బంధనములలో బంధించారు. ఆయన అప్పుడిలా అన్నాడు. 'నేను మీకు ఏమి పనికిరానుగ నేను ఇక్కడ చేయవలసినదేమిలేదుగ వృద్ధాప్యములోనైన జ్ఞానము తెలుసుకొందామంటే నన్ను ఎక్కడికి పోవద్దంటారేమిటి"

అప్పుడు భార్య అన్నది "నీవు ఎక్కడికి పోవద్దు. నీకు ఏ జ్ఞానము వద్దు ఊరకనే ఇంట్లో ఉండు."

ఇలా ఎందరో ఎన్నో చిక్కులను ఎదుర్కొనవలసి వస్తున్నది. కావున ఈ ప్రపంచ రంగస్థలము మీద జీవితమను నాటకములో అలసి పోయినవారు మనము ఇంతవరకు ఆడుచున్నది నిజమైనది కాదు కేవలము నాటకమేనని తెలిసి దానిమీద వ్యామోహము తగ్గించుకొన్నను, ఆ విషయము ప్రక్కవారికి తెలియక అనేక ఆటంకములు కలుగజేయు చున్నారు. ఎవరి ఆటంకములు వారికి తెలుసును. కనుక పాత్రదారులైన ఓ జీవులారా ఈ నాటకమునకు సూత్రదారి ఎవరో తెలుసుకోండి.

P P M P P

## వేట - ఏడుచేపలు

అనగనగనగ ఒక రాజు, ఆ రాజుకు ఐదు మంది కొడుకులు. ఐదుమంది కొడుకులు వేటకుపోయారు. ఏడు చేపలు పట్టారు. ఆ ఏడు చేపలలో ఆరు మాత్రము ఎండిపోయాయి. ఒకటి మాత్రము (చనిపోలేదు) ఎండిపోలేదు. అది ఎందుకు (చనిపోలేదు) ఎండి పోలేదు అంటే దానికి ఒక కారణముంది. గడ్డివామి అడ్డముంది కాబట్టి నేను ఎండిపోలేదన్నదట ఆ చేప. ఇది పిల్లల కథ మాదిరి ఉన్నది కదా! ఇది పిల్లల కథయే. పూర్వము పెద్దలు ఇటువంటి కథలే పిల్లలకు చెప్పెడివారు ఇప్పుడైతే ఎంతో మార్పువచ్చింది. ఇటువంటి కథలు లేవనుకోండి.

పూర్వము పిల్లల భవిష్యత్తును జ్ఞానమార్గముతో నింపవలెనను భావముతో పెద్దలు ఎంతో జ్ఞానార్థమునిచ్చు ఇటువంటి కథలను పిల్లలకు చెప్పెడివారు. పై కథలో ఏమి జ్ఞానముందని అనుకోవద్దండి. అందులో జీవబ్రహ్మైక్యసంధానమగు విధానము ఇమిడి ఉన్నదని తెలియాలి. ఉదాహరణకు ఆ కథలోని మొదటి పదమును తీసుకుందాము. "అనగ" అను పదము అర్థమిచ్చునది లేక భావము తెలియజేయునది. తోయము అనగ నీరు అన్నమాటలో తోయమంటే నీరు అనునట్లు చేయునది అనగ మనకు ఒక వస్తువు యొక్క వివరము తెలియనపుడు అనగ అనగ అనగ అని రెండు మూడుమార్లు అందుమే కాని వివరము చెప్పలేము. అలాగే పై కథలో అనగ అనగ అనగ (అనగనగనగ) అనడములో చెప్పలేనిదని భావము తెలియుచున్నది. చివరకు ఒక రాజు అన్నారు. అయిన రాజుకాదు. కాని రాజని చెప్పవలసివచ్చిందని మొదటనే తెలియుచున్నది. చూడలేముకాని ఎదుటేవున్నది. భాషకందనిది

కాని అంతటా వ్యాపించినదైన **"పరమాత్మ"ను గుర్తింపుగ ఇక్కడ "అనగనగనగ ఒక రాజు" ని చెప్పబడినది.** శరీరములో యోగమాచ రించడమును "వేట" అన్నారు. వేటలో వేటాడవలసిన నీటిలోని చంచలమైన చేపలను మన శరీములోని ఏడునాడీ కేంద్రములుగ అనగ సప్త స్థానములుగ పోల్చి ఏడు చేపలన్నారు. యోగమాచరించినపుడు శరీరములోని ఆరు నాడీకేంద్రములు స్తంభించి పోయినప్పటికి చివరి ఏడవ కేంద్రము మాత్రము చైతన్యముకల్గి స్తంభించకవుండును. కావున ఆరు చేపలు ఎండి పోయినా ఒక చేప మాత్రము ఎండి పోలేదన్నారు.

ఇది ఎంతో జ్ఞానపరమైన కథ. జీవుడు మోక్షమును పొందుటకు రెండే మార్గములు కలవు. అవియే ఒకటి కర్మయోగము రెండవది జ్ఞానయోగము. ఈ కథ పూర్తి జ్ఞాన యోగ సంబంధమైనది. యోగ సాధన చేసి యోగమాచరించినప్పటికి జీవుడు వెంటనే మోక్షము పొందడు. మోక్షము పొందాలంటే కర్మ పూర్తిగా కాలిపోవాలి. కర్మ పూర్తిగ కాలిపోవాలంటే ఒక్కమారు యోగమాచరించినంత మాత్రమున సరిపోదు. కొద్దిసేపు యోగమాచరించిన కొంత కర్మ మాత్రము కాలిపోవును. అలాగ ఎన్నో మార్లు, ఎంతో కాలము యోగమాచరించగ పూర్తి కర్మ కాలిపోగలదు. అలా కర్మ నిశ్శేషముగ కాలిపోవుటకు ఒక జన్మ కావచ్చు లేక రెండు జన్మలు కావచ్చును ఇంకనూ ఎక్కువ కావచ్చును. అది కర్మ నిలువనుబట్టి ఉండును.

ఇక్కడ పై కథలో విశేషమేమిటంటే కథ రెండు భాగములుగ ఉన్నది. ఒక భాగములో వేటకు పోయి చేపలు పట్టడము అవి ఆరు ఎండి ఒకటి మాత్రము ఎండకపోవడము జరిగినది. రెండవ భాగములో ఆ ఒక చేప ఎందుకు ఎండలేదు అనుటకు వివరము ఉన్నది. రెండవ భాగములోని వివరము చేప ఎండక పోవడానికి కారణము గడ్డివామి అడ్డమున్నది ఎండతగలడము లేదు. కావున చేప ఎండలేదన్నారు. గడ్డివామి నీవు ఎందుకు అడ్డము వచ్చావు అని అడిగితే అది ఆవు మేయలేదని చెప్పిందట, ఆవు నీవెందుకు మేయలేదని అడిగితే పనివాడు మేత వేయలేదని చెప్పిందట, పనివానిని ఎందుకు మేత వేయలేదని అడిగితే అవ్వ బువ్వపెట్టలేదని చెప్పాడట, అవ్వను ఎందుకు బువ్వ పెట్టలేదని అడిగితే పిల్లవాడు ఏడుస్తున్నాడు కావున పెట్టలేదన్నదట. పిల్లవాడా నీవు ఎందుకు ఏడుస్తున్నావు అని అడిగితే నాకు చీమ కుట్టిందని చెప్పాడట, చివరకు చీమను నీవు ఎందుకు పిల్లవానిని కుట్టావు అని అడిగితే నాపుట్టలో వేలుపెడితే నేను కుట్టనా అన్నదట. ఇక్కడ చీమ ఇంకొదానిమీద చెప్పక దీనికంతటికి కారణము నేనే అని చెప్పి ఇంకొకరిని అడగకుండ కథ ముగిసేలాగా చేసింది.

మొదటి భాగమైన కథలో రాజు, కొడుకులు, వేట, చేపలు చివరి చేప ఏదన్నది తెలుసుకున్నాము. రెండవ భాగమైన కథలో గడ్డివామి, ఆవు, పనివాడు, అవ్వ, పిల్లవాడు, చీమ, చీమపుట్టను గురించి తెలుసుకోవాలి. ముఖ్యసారాంశము ఈ రెండవ భాగములోనే ఉన్నది. కనుక జాగ్రత్తగా తెలుసుకొందాము. కథ మొదటి భాగములో యోగ విధానము మాత్రము తెలియజేయబడినది. కొందరు యోగాభ్యాసము చేసి యోగము సాధించి ఆత్మదర్శనము చేసుకొన్న తర్వాత కూడ నాకు మోక్షము రాలేదే! పైగా ప్రపంచ విషయములు నన్ను బాధించుచునే ఉన్నవే అనుకొందురు. తమ యోగమే తప్పేమో అనుకొనుట కూడ జరుగుచుండును. అట్లనుకొని యోగసాధనలో వెనుకంజవేయుట కూడ జరుగును. అందువలన పరిపూర్ణ జ్ఞానమున్ననాడే అన్నిటికి సమాధానము ఉండును. కనుక యోగాభ్యాసమును ఒక భాగముగ, తర్వాత పూర్తి కర్మ కాలిపోవు విధానమును మరియొక భాగముగ పై కథలో తెలియజేయడమైనది.

యోగము సాధించి ఆత్మదర్శనము గావించుకొన్న వెంటనే 'మోక్షము' ఎందుకు రాలేదు? అన్న ప్రశ్నకే ముఖ్యముగ ఇక్కడ జవాబున్నది. ఒక జీవుడు మోక్షము పొందవలెనన్న కర్మ పూర్తిగ అయిపోవలయును. కర్మ అయిపోవుటకు కనుగొనబడిన ఉపాయమే యోగము. యోగమను విధానములో కర్మ కాలిపోవుటకు జ్ఞానాగ్ని అనునది ఏర్పడి కర్మను కాల్చుతూపోవును. పొయ్యిముందర కూర్చొని కట్టెలను రగిల్చినంత వరకు పొయ్యిలో అగ్నివుండును. అలాగే యోగము ఆచరించినంత కాలము జ్ఞానాగ్నిచే కర్మ కాలును. యోగమాచరించ నపుడు కర్మకాలదు. కర్మ అనేక రకములుగ మనకు సంక్రమించి వుండును. అందువలన ఆ కర్మను చిన్న పెద్ద గడ్డిపోచలుగ, ఆకులుగ, తీగలుగ ఉన్న గడ్డివామిగ పోల్చి చెప్పారు.

జీవుడు శరీరములో నివసించుటకు చైతన్యమిచ్చునది ఏడవ కేంద్రమైన సహస్రారము, దానినే ఏడవ చేపగ చెప్పారు. ఈ కేంద్రములోనే మన కర్మనిలువ ఉన్నది. ఈ కేంద్రమే శరీరమును సజీవముగ కదిలి స్తున్నది. ఈ కేంద్రములో కర్మలేనపుడు మాత్రమే చైతన్యము నిలిచిపోవును. కర్మ ఉన్నంతవరకు అలాగేయుండును. అందువలన చేప చేప నీవు ఎందుకు ఎండలేదు అని అడిగితే నాకు గడ్డివామి అడ్డమొచ్చినదని చెప్పినదట. దీనిని బట్టి ఈ కథమూలముగ కర్మ అను గడ్డితుంపరలు వున్నంతవరకు జీవునికి మోక్షములేదు అని తెలియుచున్నది. గడ్డి తుంపరలు లేకుండ పోవాలంటే కర్మ కాలిపోవాలని అర్థము. దీనికి భగవద్గీత 4వ అధ్యాయము37వ శ్లోకములో "**యథైధాంసి సమిద్ధోగ్నిః భస్మసాత్కురు తేర్జున! జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసా త్కురుతే తథా**" అన్నారు. ఏ విధముగ అగ్నికి కట్టెలు కాలిపోవునో అదే విధముగ జ్ఞానమను అగ్నిచేత సర్వకర్మలు కాలిపోవును.

కర్మలు కాల్చు జ్ఞానాగ్నిని ఈ కథలో ఆవుగ పోల్చి చెప్పారు. 'కర్మ' అను గడ్డి అయిపోయినపుడు దానిని లేకుండ తినివేయు 'జ్ఞానాగ్ని' ఆవుగ మారినది. ఆవు మేయకపోతే గడ్డి అయిపోదు. కావున గడ్డి వామి నీవెందుకు అడ్డమొచ్చావు అని అడిగితే ఆవు నన్ను మేయలేదని చెప్పిందట. దినమునకు రెండు మూడు పూటలైన ఆవుకు గడ్డిని పెడితే గడ్డి అయిపోతుంది. అట్లు కాక రెండు మూడు రోజులకొకమారో, వారమునకొక మారో గడ్డివేస్తే ఆవు ఎట్లుండునో యోచించండి. అసలు గడ్డిని తినే ఆవే లేనివారు లక్షలలో కోట్లలో వుండి వారిలో ఏ ఒక్కరో జ్ఞానాగ్ని అను ఆవును కల్గినవారుండడము అరుదు. ఉన్నవారు కూడ సరిగ మేపే స్థితిలోలేరని ఈ కథలో తెలియుచున్నది. అట్లు ఎందుకు మేపలేకపోతున్నారనిన? ఇక్కడ యోగసాధన ఉన్నపుడే కర్మకాలుటకు అనగా ఆవు గడ్డిని మేయుటకు అవకాశము కలదు. యోగము తెలిసి కూడ చాలామంది సాధన చేయలేక పోవుచున్నారు. సాధన అనునదియే ఇక్కడ పని. ఆ పనినే 'పనివాడుగ' కథలో చెప్పబడినది. ఆవు నీవు గడ్డి ఎందుకు మేయలేదు అని అడిగితే పనివాడు గడ్డివేయలేదని చెప్పినదట. అనగ సరిగా సాధన చేయడములేదని అర్థము.

అట్లు సాధన చేయలేకపోవడానికి సాధనకు ఆటంకములు ఎన్నో కలవు. ప్రకృతి జనితమైన మాయ ఆటంకములను కల్పిస్తూనే ఉండును. దాని ఆటంకములను లెక్కచేయనివాడే యోగసాధన ఆచరించగలడు. అట్లుకాక అది అనుకూలంలోలేనపుడు యోగము చేస్తామనుకుంటే కాదు. మాయ బయట ప్రపంచములోని చిత్రవిచిత్ర సంఘటనలను తెచ్చి పెట్టుచునేవుండును. మాయను అవ్వగ పోల్చి తృప్తిని బువ్వగ పోల్చి చెప్పారు. పనివాడా నీవు ఆవుకు గడ్డి ఎందుకు వేయలేదని అడిగితే అవ్వబువ్వ పెట్టలేదని చెప్పాడట.

ఇక్కడ అవ్వా నీవు ఎందుకు బువ్వపెట్టలేదని అడిగితే సమాధానమేమిటో చూస్తాము. జీవుడు కర్మానుసారము కష్టసుఖములు అనుభవించుచునేవుండును. ఎడ తెరపిలేకుండ వాటిచేత బాధపడుచునే ఉండును. జీవుడు బాధపడుటకు కర్మ ఆచరణకు శరీరములోని మిగతా భాగములను తగురీతిగా స్పందింపజేయునదియే మాయ. కర్మ అనుభవ మున్నంతవరకు మాయకు పని పూర్తివున్నట్లే. జీవుడను పిల్లవాడు కర్మ అనుభవించుచున్నంత వరకు మాయ వాని వెంటనే స్పందించు చున్నది. కావున పిల్లవాడు ఏడుస్తున్నాడు వానివెంట నేనున్నాను. పనివానికి బువ్వపెట్టు తీరిక నాకులేదని అవ్వ సమాధానము. అవ్వ సమాధానము తర్వాత పిల్లవాడా నీవెందుకు ఏడుస్తున్నావను ప్రశ్న మరొకటి ఉన్నది. దానికి అతని సమాధానమేమిటో చూద్దాము.

జీవుడు ఎడతెరపిలేకుండా కష్టసుఖములు అనుభవించుచున్నపుడు వాటిలోనే నిత్యము కొట్టుమిట్టాడుచున్నాడు. కష్టసుఖాలు అనుభవములకు ఆలోచనలు ప్రధానములు వాటివలననే చివరకు కార్యము, కార్యములలోనే కష్టాలు సుఖాలువున్నవి. ఆలోచనల నిలయము మన తలలోని గుణభాగమే ఆ ఆలోచనలవలననే కష్టాలు ఏర్పడుచున్నవి. యోచనలే చీమలైతే తలలోని గుణభాగమే చీమలపుట్ట, జీవుడు ఎల్లపుడు చీమలపుట్టవలననే బాధపడు చున్నాడు. అందువలన పిల్లనిని నీవెందుకు ఏడుస్తున్నావు అంటే చీమ కుట్టిందని చెప్పాడట.

చివరి ప్రశ్న చీమా! నీవెందుకు కుట్టావు? అని అడుగుదాము. తలలోని గుణములే అన్ని పనులకు కారణము. గుణములతో సంబంధము లేకపోతే ఏ కార్యములేదు, ఏ కర్మ లేదు. గుణములలో జీవుడు కలిసినంత వరకు వాటి బాధ జీవునకు తప్పదు. గుణముల పనియే అది కావున నాపుట్టలో వేలుపెడితే నేను కుట్టనా అని చీమ సమాధానము చెప్పినదట.

గడ్డితో మొదలైనది చివరకు చీమతో ముగిసినది. అనగ కర్మ చివరకు గుణముల వరకు ఆచరణగవుండి జీవున్ని కష్టసుఖములలో ముంచి యోగమువైపుకు రాకుండ చేయుచున్నది. యోగము ఆచరించవలెనంటే కర్మ, ప్రకృతి, గుణములు అన్నీ ఆటంకములే. ఇవి గొలుసులాగ ఒకదానివెంట ఒకటివుండి ఏమాత్రము అవకాశమివ్వవు. ఈ గొలుసు ఆటంకములు తెగిపోవాలంటే జ్ఞానముమీద, యోగముమీద శ్రద్ధ అవసరము. శ్రద్ధకర్మను తెంచి వాటివలన కల్గు గుణములను అణచి యోగమార్గములో నడిపించగలదు. "**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం**" అని గీతలో కూడ అన్నారు. శ్రద్ధ అనునదియే పనివానికి అమృత ఆహారమై, సాధన అను పనిచేయించి, కర్మ అను గడ్డిని ఆవు అను అగ్నికి ఆహుతిగ వేయించగలదు. శ్రద్ధలేనపుడు కర్మచక్రము నుండి బయటపడలేరు, యోగమాచరించలేరు. కర్మ అను గడ్డివామిని తొలగించనులేరు. నిత్యము యోగము ఆచరించువారికైన కర్మ నశించుటకు ఎంతో కాలము లేక (ఎన్నో) జన్మలు పట్టును. పూర్వము పెద్దలు చిన్నవయస్సులోనే జ్ఞానమును ప్రజలకందించాలను ఉద్దేశ్యముతో ఇటువంటి కథలు ఎన్నో చెప్పి వాటివివరము తెలియజేసెడివారు. ఆ కథలే ఇపుడు లేకుండ పోయాయి. మచ్చుకు ఏదైన ఒకటి మిగిలి ఉన్నప్పటికి వాటివివరము తెలియదు. ఇటువంటివే జ్ఞాన-అజ్ఞానముల గురించి తెలియజేయు **"పులిమేక"** కథను, జనన మరణములు తప్పవని తెలియజేయు **"ఆవుదూడ"** కథలను, కర్మభేదములు తెలియజేయు **"కాకమ్మగువ్వమ్మ"** కథలను తెలియజేసిన పెద్దలకు మనము ఎన్నో ధన్యవాదములు తెలుపవలసివున్నది. పెద్దలకృషికి సానుకూలముగ మనము జ్ఞానమార్గములో నడువగలమని ఆశిద్దాము.

1. అనగనగనగ (ఒక) రాజు = పరమాత్మ
2. ఆరు చేపలు, ఏడవచేప = షట్చక్రములు, సహస్రారము
3. గడ్డివామి = అనేక తుంపరులుగ పేరుకు పోయిన కర్మ
4. ఆవు = జ్ఞానాగ్ని
5. పనివాడు = యోగసాధన
6. అవ్వ = యోగసాధనకు ఆటంకమైన మాయ
7. బువ్వ = తృప్తి
8. పిల్లవాడు = జీవుడు
9. చీమ = యోచనలు
10. చీమపుట్ట = తలలోని (గుణచక్రములోని) గుణభాగము.

P P M P P

# అత్తపత్రి - కలబంద

అనగనగ ఒక రాజు. ఆ రాజుకు ఏడు మంది కొడుకులున్నట్లు, అనగనగ ఒక గురువు. ఆ గురువుకు ఏడు మంది శిష్యులుండెడివారు రాజు కొడుకులు అడవికి వేటకు పోయినట్లు శిష్యులంతా కలసి అడవికి కట్టెలకోసము పోయారు. అడవిలో వారికి ఒక అత్తపత్రి చెట్టు కనిపించింది. ఒకని చేయి పొరపాటుగ ఆ చెట్టుకు తగిలింది. తగిలిన వెంటనే చేయి తాకిన ఆకులన్ని ముడుచుకొనుటకు మొదలు పెట్టడము చేయి తగిలించిన శిష్యుడే చూశాడు. చేయి తగిలిన వెంటనే ఆకులు ముడుచుకోవడము ఆ శిష్యునికొక వింతగ కనిపించింది. వెంటనే మిగత ఆరు మందిని పిలిచి ఆ చెట్టును చూపి ఇదీ విషయమని చెప్పాడు. విన్న తర్వాత మిగతావారు కూడ తాకి చూచారు. మొదటివాడు చెప్పినట్లే ఉన్నది. అందరు ఇంటికి పోయాక గురువుగారి వద్ద చేరి అడవిలో ఒక చెట్టును తాకిన వెంటనే ముడుచుకున్నదని ఎందుకలా ముడుచుకొనుచున్నదని అడిగారు. విషయము తెలుసుకొన్న గురువుగారు వారిని జ్ఞానమార్గములో తీర్చిదిద్దాలని తలచి ఆ విషయమును చమత్కరించి ఇలా చెప్పాడు. “ఎదుటి మనిషి తాకితే ఆ చెట్టు ముడుచుకొంటు ఇతరులకు ఒక సందేశము నిచ్చుచున్నది. గురువు జ్ఞానమనే శబ్దమును శిష్యునికి తాకించిన వెంటనే శిష్యుడు కూడ ఈ విధముగ తనలోని అహంకారమును ముడుచుకోవాలని అత్తపత్రి చెట్టు ముడుచుకొనుచున్నదన్నారు. అత్తపత్రి చెట్టులాంటి చిన్న చెట్టు ఇలాగని సూచించిన అర్థము చేసుకోలేక అహంకారమును అణుచుకోలేని మీలాంటి శిష్యులు గురువువద్ద ఎన్ని సంవత్సరములున్న ఏమి ప్రయోజనములేదని మందలించాడు గురువుగారు” మందలించిన దానికి శిష్యులందరు బాధపడి ఇక మీదట తమలో అహంకారము ఏమాత్రము లేకుండ చేసుకోవాలి అనుకొన్నారు. ఇక మీదట తమలో అహంకారము లేకుండా చేసుకుంటామని గురువుగారి ఎదుట ప్రతిజ్ఞ చేశారు.

గురువు వారి పట్టుదలకు నవ్వి “మీరు ఇలాంటి పట్టుదల కలిగి అహంకారమును మీయందు లేకుండ చేసుకోవాలనే తెల్పుచున్నాను. ఒక దినము అహంకారము లేకుండ అణుచుకొన్నంత మాత్రమున దానిని పూర్తి గెలచినట్లు కాదు. అహర్నిశలు దానిమీద జ్ఞప్తి కలిగియున్నప్పుడే అహంకారమును పూర్తి జయింప సాధ్యమగును. అట్లు కాకపోతె దానికి వశులై జ్ఞానమునకు దూరమై కర్మబద్ధులగుదురు. అలా కాకుండ నిత్యము జాగ్రత్తపడండి” అన్నాడు. అంతటితో ఆగక

ఈ దినము నుండి మీరు మీ ఇంటికి వెళ్లండి అపుడపుడు వస్తూ జ్ఞానమును తెలుసుకొంటూ అహంకారరహితులై ఉండాలని చెప్పాడు. గురువుగారు వెళ్లిపోమన్నాడు కావున అందరు వారివారి ఇళ్లకు వెళ్లిపోయి గురువుగారు చెప్పినట్లు అపుడపుడు ఎవరి అనుకూలముకొద్ది వారు వస్తూపోతూ ఉండెడివారు.

గురువుగారి వద్ద ఉన్నపుడు నిత్యము గురువుగారిని దర్శించుకొనుచు గురువుగారు నిత్యము చెప్పుచున్న బోధలు వినుచుండెడివారు. అపుడు దాని విలువ తెలియకున్న ఎవరి ఇళ్లకు వారు వెళ్లిన తర్వాత ఆ విలువ వారికి పూర్తి తెలియవచ్చింది. అప్పుడప్పుడు గురువు ఆశ్రమము వదలి బయటికి పోవుట వలన గురువుగారి దర్శనము దొరికేది కాదు. ఒక వేళ దొరికిన అయన ఏదో పనుల మీద లగ్నమై మన్నుమసి పూసుకొని కనిపించెడివారు. మంచి గుడ్డలు వేసుకొన్న శిష్యులు మసిపూసుకొన్న గురువును చూచి గురువును తాకితే తమకు కూడ మసి అయితుందని అనుకొనెడివారు. మొదటి మాదిరి లేక ఎక్కువ పనులు చేయుటయందు లగ్నమైనారు, గురువుగారికి కూడ ఈ మధ్యన ఆశ ఎక్కువయింది కాబోలని అనుకొనెడివారు. పాపమిలా వారికి ముందు మాదిరి జ్ఞాన బోధలు దొరికెడివి కావు. మొదట గురువుగారికి గురుపూజలు నిర్వహించేవారు శిష్యులు. కాని పూజరోజున కూడ గురువుగారు బిజీగా ఉండడము వలన ముందువలే పూజలు చేయలేక పోయారు. గురువుగారు ఆశ్రమములో ఉండరు ఎక్కడో తిరుగుచుంటారని వారు ఆశ్రమానికి రావడమే తగ్గించారు.

ఇట్లు కొంత కాలము జరుగగ శిష్యులు ఏడుమంది ఒక చోట చేరి మన గురువు పనుల మీద ఉన్నాడని మనము జ్ఞానము మీదనే శ్రద్ధ తగ్గించాము, గురువు నెలకు పది రోజులైన ఆశ్రమములో ఉండును కదా! అటువంటి సమయములో తెలుసుకొని గురువుగారిని దర్శించి జ్ఞానము తెలుసుకోవచ్చును కదా! ఇందులో మన పొరపాటే ఎక్కువ ఉన్నది. ఇప్పటి నుండి కడుజాగ్రత్త కలిగి గురువుగారిని దర్శించి సేవించాలనుకొన్నారట. అప్పటి నుండి ఎపుడు వచ్చిన ఎన్నో మార్లు వచ్చిన గురువుగారు దొరకనే లేదు. శిష్యులలో మరి శ్రద్ధ ఎక్కువైనది. చివరకు గురుపూజ రోజైన ఆశ్రమములో ఉంటారు కదా అని ఏడు మంది శిష్యులు ఆ దినము కోసము కాచుకొన్నారట. ఆ దినము రానే వచ్చింది. ఈ రోజు గురువుగారి దర్శనము తప్పక కలుగుతుంది. ఈ దినమెట్లు తప్పించుకుంటాడో చూస్తామని శ్రద్ధాభక్తులతో ఫలపుష్పము లతో ఆశ్రమానికి ఏడుమంది వచ్చారు. కాని ఆ దినము కూడ గురువుగారి దర్శనము దొరకలేదు. కారణము పది రోజుల ముందే గురువుగారు చనిపోయారు. ఆ విషయమును కూడ బయటికి పోయి చెప్పు మగవారు లేనిదానివలన ఎవరి సహాయము లేకనే ఆశ్రమములో ఉన్న ఆడవారే గురువుగారిని సమాధి చేశారు. ఈ విషయమును తెలుసుకొన్న ఏడు మంది శిష్యులు వారి వారి భక్తినంత చూపి ఏడ్చారు. అయ్యో మేముండి నీకు ఏమి ప్రయోజనము లేకపోయెనే అని ఒకడంటే, ఇంత తొందరగ చనిపోతివా ఇది నీకు తగునాయని మరియొకడు, పొయ్యేవానివి పలానా అప్పుడు పోతానని ముందుగానన్న చెప్పివుంటే తప్పక వచ్చేవాల్లము కదాయని మరియొకడు, నా శిష్యులున్నారు కదా యని మా మీద దయలేకుండా పోయావే అని ఒకడు, మమ్ములను అటు ఇటు కాకుండ చేసిపోతివే అని ఇంకొకడు, పోయిన గురుపున్నమి రోజున గురుపూజ చేయలేదంటే మేము రాలేదు. ఈ రోజు దొరుకుతావని వస్తే మమ్ములను అన్యాయము చేసిపోయావే అన్నాడొకడు. ఇక ఏడవవాడు నీవు చనిపోయేది తెలిసివుంటే ఎలాగైన నిన్ను చనిపోకుండ కాపాడుకొనెడి వాడినని ఏడుమంది ఏడ్చారు.

నాలుగు రోజుల తర్వాత గురువుగారు అందరికి స్వప్నములోనికి వచ్చి ఒక్కొక్కరిని ఒక్కొక్క విధముగ పలకరించాడు. "ఏమయ్యా మేముండి నీకు ఏమి ప్రయోజనములేదేయని ఏడుస్తావా? నీకు బుద్ధి ఉందటయ్యా నేను

మీకు ప్రయోజనమా? లేక మీరు నాకు ప్రయోజనమా? నేనుంటేనే నాగుండా మీకు జ్ఞాన ప్రయోజనముంటుంది. మీరుంటే నాకు ఏ ప్రయోజనములేదని తెలుసుకో” అన్నాడు.

మరియొకనికి కనిపించి “ఇంత తొందరగ చనిపోతివాయని, ఇది నీకు తగునా? అంటావా! చావనేది మన చేతిలో ఉందేమయ్యా నా ఇష్ట ప్రకారము నీ ఇష్టప్రకారము చనిపోయేదానికి. కాలము తీరి నాకు చావు వస్తే నేనేదో తప్పు చేసినట్లు ఇది నీకు తగునా అంటావా! చావు పుట్టుకల టైమ్ ఎవరి చేతిలోలేదని తెలుసుకో. చావు కాని పుట్టుక కాని చెప్పిరావు. విధి ప్రకారము జరిగేవే కాని ఎవరి ఇష్టముకావని తెలుసుకో” అన్నాడు.

మూడవవానికి కూడ స్వప్నములో కనిపించాడు. అతనితో కూడ “ఏమయ్యా నేను పోయేటపుడు నీతో ముందుగా చెప్పాలా? చెప్పితే నీవు నన్ను సాగనంపే దానికి వచ్చేవానివా! నీవు వచ్చే దానివలన నాకు ఏదో మేలు కలుగుతుందన్నట్లు చెప్పివుంటే వచ్చేవాడినే అంటున్నావు నీవు వచ్చే దానివలన లాభము కాని, రాని దానివలన నష్టము కాని నాకు ఏమాత్రములేదని తెలుసుకో” అన్నాడు.

అట్లే నాల్గవవానికి కూడ కనిపించాడు. “నీవు ఏమయ్యా! నా శిష్యులున్నారు కదాయని కొంతైన దయలేకుండా పోయావే అంటున్నావు. నాకు మీ మీద దయలేదయ్యా, మీరు జ్ఞానము తెలుసుకోవాలను ఆకాంక్ష తప్ప మరియేమి లేదు. మీరేమో నాకు కూడ ఆశ ఎక్కువైందని పనులు ఎక్కువ చేస్తున్నాడని అనుకొంటిరి. ఇంక కొంత కాలముంటే ఆశను తగ్గించుకొని పనులు మానుకొని సుఖముగ ఉండండి ఎందుకింత కష్టపడుతారని నాకే జ్ఞానము చెప్పేలాగున్నారని, అంతవరకు రాకమునుపే చనిపోవడము మంచిది కాదా! శిష్యులు జ్ఞానము తెలుసుకుంటూ ఉంటే గురువు ఇంకా కొంత కాలము బ్రతకాలను కొంటాడు. కాని జ్ఞానము మీద ఆసక్తి మాత్రము చూపుచు అజ్ఞానములోనే ఎక్కువ కాలముండు వారితో ఇక పనిలేదని చిన్నగ జారుకోవడము మంచిది కాదా! కర్మయోగమాచరించి పనులు చేసి మీకు మార్గదర్శకతగ ఉంటే మసి పూసుకొన్నాడనుకొంటారా? కర్మానుసారము ఏ పని తటస్థపడిన ఆచరింపవలసి వచ్చిన చెడ్డదైన మంచిదైన అహంకారరహితుడై పని చేయాలని మీకు నేను చెప్పలేదా! ఆ మాట మరచి అహంకారయుతులై మాకంటే గురువుగారికే పనుల మీద ఎక్కువ తాపత్రయము ఉందను కుంటారా? “నాకు పనులతో లాభము లేదు. చేయకపోతే నష్టము లేదు. అయినా పనులాచరించుచున్నాను మీకొరకు” అన్న భగవద్గీత మాటను మరచినారా? ఇప్పటికైన కనువిప్పు కలిగి బ్రతకండి” అని చెప్పాడు.

ఇంకొకనికి కూడ స్వప్నమందే కనిపించి “ఏమయ్యా నన్ను అటుఇటు కాకుండ చేసిపోతివా అంటావా! అటు అజ్ఞానములో ఉన్నవానిని ఇటు జ్ఞానము ఉందని చెప్పి, ఇటు రమ్మని ఎంత చెప్పిన వినక అటే ఉంటూ, అటు ఇటు కాకుండ చేశావే అంటావే! ఇటు అంటే రాలేదు కాని అటునే ఉన్నావు కదా! ఒక వేళ కొంత ఇటు వచ్చాననుకుంటే అది నీకు మేలేకాని చెడ్డకాదు కదా! అటు కొంత లేకుండా పోయావనుకో అటు పూర్తి లేకుండ చేశావే అను బాధ ఉన్నట్లుందికదయ్యా నీకు. అటు కొంత చెడి, ఇటు కొంత వచ్చిన పరవాలేదనుకో పూర్తి అటు లేకపోతినేయని బాధపడకు. అటు ఇటు అని అజ్ఞానము జ్ఞానములను తెలిపాను కదా పూర్తి ఇటు నీవు రాలేకపోయావు. దానికి నీ శ్రద్ధ తక్కువ కాని నా తప్పిదములేదు. ఇప్పటికైన అటు విడచి ఇటు వైపు రమ్మని తెల్పుచున్నాను మెలుకువ కల్గి బ్రతుకు” అన్నాడు.

ఇక ఆరవవాని వద్దకు కూడ వచ్చాడు.  అతనితో “గురుపూజ చేస్తారా గురుపూజ ఉందా అంటే లేదయ్యా నాకు వ్యవధి లేదు.  గురుపూజ చేసే తీరికలేదు. పూజకు కొన్ని దినములు ముందు వెనక వదలి వేయాల్సి వస్తుంది. అందువలన చేయడములేదని చెప్పాము.  అయిన గురుపూజ శిష్యులు మీరు నాకు చేయాలి కాని  నేను గురుపూజ చేయడమేమిటి.  నాకు పనులున్నాయని అంటే నీ పనులు నీవు చేసుకో.  పూజ దినము మాత్రము కొంతసేపు నీవు కూర్చుంటే మేమే పూజ చేస్తామని ఎందుకు చెప్పలేదు.  మీరు చేసే పూజకైన ఎన్నో మార్లు ముందు పనులు నేనే చేయాల్సి వచ్చిందికదయ్యా! పదిరోజుల ముందు నుంచి అన్ని పనులు చేసి రెడీగా ఉంచుకొంటే  పూజదినము మాత్రము కొందరొచ్చి శ్లోకములు చదివి పూజచేసి మరుదినమున పోయిన దినములు ఇంతకు ముందులేవేమయ్యా.  అట్లయిన గడచిన సంవత్సర పూజకు నీవు రాకుండ తప్పించుకొన్నావుకదయ్యా! నాకు నిలచిపోయినట్లు ఎందుకురాలేదని నేను అడిగితే ఏవో సాకులు చెప్పలేదా!  అపుడు నీవు తప్పించుకొన్నావు ఇపుడు నీకు నేను పూర్తిగ తప్పించుకొన్నాను సరిపోయింది గదా! ఏదైన ఉన్నపుడు దానివిలువ తెలియదు.  లేనపుడే తెలుస్తుంది అయిన లేనపుడు తెలిసిన ఏమి ప్రయోజనములేదు.  ఉన్నపుడే విలువ గ్రహించడము సరియైనది.  బోధ చెప్పేటపుడు దాని మీద శ్రద్ధ చూపక ఇంటి దగ్గర చింతలు చేస్తుంటిరి, కొంతకాలానికి బోధ కరువైపాయె.  పాదపూజ జరిగేటపుడు కూడ అట్లే చేసుకొంటిరి. అదియు లేకుండపోయే.  గురుదర్శనము ఎప్పుడైన సులభముగ దొరుకుకాలములో  ఈ ఊరికి వచ్చి కూడ ప్రపంచ పనులకే కాలము వినియోగించి గురుదర్శనము కొరకు కూడ రాకుండపోయిన దినములున్నాయి.  కొంత కాలానికి గురుదర్శనమని వస్తే గురువే దొరకడాయే.  కాపు కాచి ఈ దినమైన దొరకగలవని వస్తే గురువే ప్రపంచములో లేకపోయే.  గురువు ఉన్నాడా ఊడిపోయాడా అని కూడ అనుకోలేదని మీకు తెలియకనే గురువు మరణకార్యములు జరిగి పోయాయి  ఇప్పటికైన గురువు మీద అహర్నిశలు శ్రద్ధ కలిగి బ్రతకండి” అని మందలించాడు.

ఇక ఏడవ వానిదగ్గరకు కూడ గురువు స్వప్నములోనే పోయి అక్కడ కూడ ఇలా చెప్పారు. “ఏమయ్య చివరి శిష్యా  నేను చనిపోయేది తెలిసి ఉంటే నన్ను నీవు కాపాడేవానివా?  నేను బ్రతికి ఉన్నపుడంతా నిన్ను కాపాడమని నాకు మ్రొక్కెడివానివి.  నేను చనిపోయిన తర్వాత నన్ను కాపాడెడి వానివని ప్రగల్భాలు పలుకుతావా! నేను కాపాడెదను అనడములో అహంకారము పూర్తి ఆవహించివుంది,  వెనకల కర్మ ఉన్నదని దాని ప్రకారము జరుగునని తెలియుట మరిచి మాట్లాడావు.  ఒకనాడు అడవికి పోయినప్పుడు అత్తపత్రి (ముడుగు తామర) చెట్టు ఒకే స్పర్శకు ముడుచుకొన్నట్లు గురువు జ్ఞానస్పర్శకు అహంకారమనెడి ఆకులు ముడుచుకోవాలని చెప్పిన మాటను మరచి, తుంచిపారవేసిన తిరిగి భూమిలో పాతుకొని బ్రతుకు కలబంద చెట్టులాగ అహంకారమును పొందుచున్నారు.  నేను ఎన్నో మార్లు మీ అహంకారమనగి పోవులాగున ఏమి చేసిన చేయించిన అత్తపత్రి (ముడుగు తామర) చెట్టులాగ కాక, కలబంద చెట్టులాగ అజ్ఞానములో తిరిగి అహంకార కొమ్మను అభివృద్ధి చేసుకొనుచున్నారు.  అందుకే మీకు దక్కకుండా పోయాను.  మీరు ఎంత ఏడ్చినా మీ గురువురాడు.  కలబంద చెట్టులాగ కాక అత్తపత్రి (ముడుగు తామర) చెట్టులాగ బ్రతకండి అలాగైతే నా సమాధియన్న మీకు దక్కుతుంది లేకపోతే మీరు నమస్కరించేదానికి నా గుర్తుగ సమాధి కూడ దొరకదు జాగ్రత్త” అని చెప్పాడు.

తెల్లవారుతూనే శిష్యులందరు ఒకచోట చేరి నాకు గురువు కనిపించాడంటే నాకు గురువు కనిపించాడని ఒకరికొకరు చెప్పుకొన్నారు.  చనిపోయినప్పటికి గురువుగారికి మనమీద ఎంతో ప్రేమ ఉండబట్టే స్వప్నములో వచ్చి ఎంతో హితము చెప్పాడు. ఈ దినమునుండి కలబంద లాగ కాక అత్తపత్రి (ముడుగు తామర) లాగ బ్రతకాలని

నిర్ణయించుకొని ప్రతినిత్యము గురువుగారి సమాధిని శ్రద్ధగా పూజిస్తూ జ్ఞానమును నెమరువేస్తూ కాలము గడిపెడివారు. ఒక దినము ఏడుమంది శిష్యులు ఒక శిష్యుని ఇంటిలో కలసి మన గురువుగారు ఉంటే ఇది మంచిది ఇది చెడ్డదని చెప్పెడివారు. మన గురువేవుంటే ఎంతటి జ్ఞానులమయ్యే వాల్లమో గురువుగారు ఉన్నపుడు విలువ తెలియక కాలమును వృథా చేసుకున్నామని అనుకొనుచుండిరి. అంతలో ఆ శిష్యుని ఇంటిలో ఒక మనిషికి ఒక దయ్యము ఆవహించింది. అది తెలిసిన ఏడుమంది శిష్యులు ఆ మనిషి చుట్టుచేరి "ఏయ్ ఎవరు నువ్వు. ఎందుకొచ్చావు చెప్పు" అని గద్దించారు. ఆ మాటవిన్న దయ్యము "ఏమిరా నేను మీ గురువును మీతో మాట్లాడడానికి వచ్చాను" అన్నది. ఆ మాటవిన్న శిష్యులంతా నవ్వారు. నీవు గురువువని చెప్పితే నమ్మేదానికి మేము ఏమి తిక్కవాల్లమా! మా గురువు మాటెత్తితే తంతాము చూడన్నారు. పాపము గురువుగారు శిష్యులచేతిలో తన్నులు తినవలసి వస్తుందేమోనని ఆ శరీరమునందు అణిగిపోయాడు.

చనిపోయేటపుడు శిష్యులు దగ్గర లేరుకదా అందువలన వారికి ఏదో ఈ విధముగనైన చెప్పుదామని శిష్యులను వెతుక్కొని గురువు వస్తే శిష్యులు తన్నేదానికి మొదలు పెట్టారే, ఏ విధముగ వీరితో మాట్లాడేదియని గురువు సూక్ష్మశరీరముతో యోచిస్తూవుండెను. చాలామంది శిష్యులు ఉన్నపుడు తన్ననైన తన్నేవారే ఒకరిద్దరున్నపుడు చూస్తామనుకున్నాడు గురువు. ఒక దినము ముగ్గురు శిష్యులు ఉన్నపుడు ఒకనిలో దూరి మాట్లాడజొచ్చాడు. "ఏమయ్యా శిష్యులారా గురువే శిష్యులను వెదకుచు వచ్చిన శిష్యులు పలికేదే కరువైందే ఇదేనేమయ్యా నేను చెప్పిన జ్ఞానము" అని వస్తూనే జ్ఞానము కథ ఎత్తుకున్నాడు లేకపోతె తంతారేమోనను భయముతో, జ్ఞానమని మాట్లదేదానివలన మిగత ఇద్దరు కొంత నమ్మగలిగారు. అయిన కొంత అనుమానమున్ననే ఉన్నది. నీవు మా గురువైతే అత్తపత్రి (ముదుగు తామర) చెట్టు జ్ఞానము నీకు తెలుసునా చెప్పు అన్నారు శిష్యులు. గురువుగారికి చిన్నతనమైనది. ఎక్కడైన గురువుగారు ప్రశ్న అడిగితే శిష్యులు చెప్పాలి. ఇక్కడ శిష్యులు గురువుగారికి జ్ఞానము తెలుసునా అని అడుగుచుంటే పాపమాగురువుకు చిన్నతనము కాక మరియేమౌతుంది. అపుడు గురువు ఇలా అన్నాడు. " ఒరే ఇది చాలా అన్యాయమురా! ఆ జ్ఞానము చెప్పింది నేనురా, మీరు మరచిపోయినారని చెప్పేదానికి వస్తే నీకు తెలుసునా అని నన్ను అడుగుతారా!" అని పాపమా గురువు అత్తపత్రి చెట్టు జ్ఞానము శిష్యులకొప్పజెప్పాడు. అది విన్న ఆ ఇద్దరు శిష్యులు " అంతా కరెక్టే తప్పులేకుండా చెప్పావు. ఇపుడు మా గురువేనని నిన్ను నమ్ముతాము. గురువై ఇలా దయ్యముగ మారి వేరేవాల్లకు చేరుతావా! ఇంకొకరికి పట్టేవానివి నీవు గురువెలా అవుతావు. ఇట్లొచ్చే దానికి నీకు బుద్ధివుందా"యని గట్టిగ అరచారు. వారి అరుపులకు గురువు బయపడి "నన్నేమి అనవద్దండి కొంచెము మాట్లాడనీయండి. దయ్యమైతే నీవు గురువెట్లా అయితావని అడుగుతున్నారే దయ్యమైనాక గురువయితానని చెప్పివుంటినా నేను బ్రతికినపుడే గురువును చచ్చి దయ్యమైనాక ఇంకా గురువునయ్యేది కాకపోయేది ఏమిలేదు" అన్నాడు. అంతలోనే మిగత శిష్యులంతా అక్కడ చేరి విషయమంతా తెలుసుకొన్నారు. ఎంత గురువైతేనేమి ఇలా మనుష్యులకు పట్టితే మేము గురువుగ ఒప్పుకోము అని ఒకడంటే, పొగవెయ్యండి పోని అని ఒకడంటే. చచ్చి దయ్యమైనాడంటే నిజగురువైతే అలాకాకూడదని ఒకడంటే, ముందు పోతావా లేదాయని ఒకడంటే ఇలా పాపము గురువుగారి గురుత్వమే సరికాదను స్థితికొచ్చారు. శిష్యులపై అపుడు గురువుగారికి కోపమొచ్చింది. "నోర్ముయండి గాడ్దెల్లారా! అసలు మీరు మనుష్యులా? మీరు అజ్ఞానమువైపు పోకుండ జ్ఞానమువైపు సాగాలని దానికి కావలసిన జ్ఞానబండారమును మీకు అందిద్దామని నేనే స్వయంగా వచ్చిన, నేను పలానాయనిన, నన్ను హేళనగ మాట్లాడుతారా! జ్ఞానము తెలుపడమును బట్టి గురువని చెప్పానా లేక దయ్యముగ మారకపోతె గురువైతానని చెప్పానా! ఉన్నప్పుడు విలువ తెలియక పోయెనని ఏడ్చింది మీరే, ఎదురుగా వస్తే తన్నండి తరమండి అనేది మీరేనా!

అసలు మీవద్ద నేచెప్పిన జ్ఞానము కొద్దిగైన ఉందా అని బ్రతికివున్నపుడు తిట్టినట్లు తిట్టిపడివేశాడు. ఇప్పటికైన గ్రహించండి నేను మీకు ప్రతిది అవకాశముగ ఇచ్చాను. ప్రతి అవకాశమును చేయి జారవిడుచుకొన్నారు. చివరకు ఇలాగైన దగ్గరగ ఉందామని నేనే వచ్చాను. అయినా ఈ అవకాశమును కూడ జారవిడచుకొన్నారు. ఈ విధముగ కూడ నేను ఎప్పటికి రాను, నా మాటలు మీరు వినలేరు. కాని నావద్దకు చేరినందుకు మీకు ఒక ముఖ్యవిషయము తెలుపుచున్నాను నాకు తెలిసిన జ్ఞానమంత వ్రాసిన పుస్తకము చివరగ మీకివ్వాలనుకొన్నాను. దురదృష్టవంతులు సమయానికి నావద్దకెవ్వరు రాలేకపోయారు. ఆ పుస్తకము పలాన చోట ఉన్నది. దానిని తీసుకొని పూర్తి జ్ఞానము తెలిసి బ్రతకండి ఇక నేనుగ రాను" అని చెప్పి అణిగిపోయాడు. అపుడు శిష్యులంతా తేరుకొని వెంటనే గురువుచెప్పిన చోటికి పోయి ఆ పుస్తకమును తీసి చూచారు. అది కేవలము తెల్లకాగితముల పుస్తకము తప్ప అందులో ఏ వ్రాత లేదు. అప్పటికి కూడ గురువు మీద విశ్వాసములేని కొందరు గురువు ఎంత మోసగాడు అని మనసులో అనుకొన్నారు. అందులకు ఒక శిష్యుడు యోచించి గురువు మనమేలు కోరియే పుస్తకముందని చెప్పాడు. మోసగాడైతే అసలు ఈ పుస్తక విషయము చెప్పేవాడే కాదు కదా! ఇందులో మనయందే లోపముందని అందరికి చెప్పి భక్తిగలిగి అందరు గురువును వేడుకొని తమ అజ్ఞానమును క్షమించి తమను దయతో చూసి ఆ పుస్తక వివరము తెలుపమని కోరారు. అంతలో ఒక వృద్ధుడు అక్కడికొచ్చాడు మీరు ఏదో చింతాక్రాంతులై ఉన్నట్లుందే అని అడిగాడు. ఆ శిష్యులు వివరమంతా చెప్పి బాధపడ్డారు. అంతావింటే మీకు గురువుమీద ఉన్న భక్తికంటే మీ గురువుకు శిష్యుల మీదవున్న ప్రేమే ఎక్కువవున్నదే! సరే ప్రార్థించండి. ఎవరిలోనికో ఒకరిలోనికి వచ్చి పుస్తక వివరము చెప్పి పోతాడు అన్నాడు. ఏడు మంది శిష్యులు ఎంత ప్రార్థించినను గురువు రాలేదు. అపుడు ఆ ముసలివాడు సరే మీ గురువుకు మీ మీద ప్రేమ తగ్గిపోయినట్లుంది అందువలన రాలేదు. ఆ పుస్తకమిలా ఇవ్వండి నేను చూచి ఇస్తానన్నాడు. అలాగేనని ఆ శిష్యులు ఆ ఖాళీ పుస్తకమిచ్చారు. ఆ ఖాళీ పుస్తకములోని కాగితములను త్రిప్పిచూచి, ఇందులో మీ గురువుగారు వ్రాసి పెట్టిన జ్ఞానమంతా ఉన్నదే అన్నాడు. శిష్యులకు ఏమి అర్థము కాలేదు. ఖాళీ పుస్తకములో ఎక్కడ ఉన్నదయ్య జ్ఞానమన్నారు. దానికా ఆ ముసలివాడు నవ్వి "ఇది మీ కల్లకు ఖాళీపుస్తకమే నాకల్లకు జ్ఞానలిఖితము. మీ కల్లకు కూడ ఇందులోని జ్ఞానము కన్పించాలంటే దీని వివరము చెప్పెదను వినండి. ఇది ఒక రసాయనముచే వ్రాయబడినది అందువలన పేపరు మీద అక్షరములు కనిపించడము లేదు. ఈ కాగితములను నీటిలో తడిపితే అందులోని వ్రాతంతయు మెరుస్తు కనిపిస్తుందని చెప్పాడు. శిష్యులు అలాగే చేశారు. నీటితడిలో ఆ పుస్తకము వ్రాత అంతయు మెరుస్తూ కనిపించింది. పుస్తకము పేరు పెద్దగ "కలబంద నుండి అత్తపత్రికి" అనుట కనిపించింది. అపుడు ఆ ముసలివాడు నవ్వుచు వున్న పుస్తకములోని అక్షరములు తెలియలేని వారికి నేను చూపితే దానిని చూచే విధానము తెలిసినట్లు జీవితములో జ్ఞానము తెలియలేని వారికి ఇది జ్ఞానమని గురువు చూపితేనే మానవులకు అది ఏమో తెలిసేది. కావున ప్రతి ఒక్కరికి గురువు అవసరము. గురువు అవసరమని ఏడు మంది శిష్యులలాగ గురువును పెట్టుకోకూడదు. వారికంటే మించి గురువు ఎడల మంచి భావము కల్గియుండవలెను.

P P M P P

# తృప్తి - అసంతృప్తి

ఒక ఊరిలో కుక్క, పిల్లి రెండు స్నేహముగ ఉండెడివి. కుక్క ప్రతిదినము మాంసము మార్కెటుకు పోయి అక్కడ దొరికిన మాంసపు ముక్కలుతిని కడుపు నింపుకొనెడిది. పిల్లి ఇంటిలోనే ఉండి కనపడిన ఎలుకలను వేటాడి తినెడిది. ఒక దినము కుక్క పిల్లితో ఇలా అన్నది. "ప్రతిదినము ఎలుకలను నీవు వేటాడుచున్నావు. ఆమాటకొస్తే వేట నా స్వభావము. కాని నేను ఏవొక్కదినము కూడ వేటాడలేదు. మార్కెటులో ప్రక్కన పడిన మాంసపు ముక్కలు తిని వస్తున్నాను. నీవు మాత్రము మ్యావ్ మ్యావ్ అని అరుస్తు యాజమానులచేత పెరుగన్నము తింటున్నావు, సమయము దొరికినపుడు వేటాడుచున్నావు. నేను అరచిన పెట్టువారు లేరు. వేటాడను వీలులేదు, దొరికింది తిని ఊరకుండాలి. నేను భౌభౌ అని మొరిగిన నన్ను రాళ్లతో కొట్టువారుకలరు. అన్నము పెట్టువారులేరు. మనము మంచి స్నేహితులము కాబట్టి నీవు నాకు ఒక సహాయము చేసిపెట్టు. అది ఏమనగా! నీవు మార్కెటుకు పోయి మాంసము ముక్కలు తిను. నేను ఇంటిలోనే ఉండి ఎలుకలను వేటాడి తింటాను. అలాగైన వేటాడు అవకాశము కొన్ని రోజులు నాకు కలుగజేయి." అలా కుక్క పిల్లి మాట్లాడుకొని పనులు మార్చుకొన్నవి. ఆ దినమునుండి పిల్లి మార్కెటుకు పోయింది. కుక్క ఇంటిలోనే ఉండి పోయినది. మార్కెటుకు పోయిన పిల్లి తన స్వభావము ప్రకారము ప్రక్కన పొంచియుండి మాంసము ముక్క ప్రక్కకెగురుతునే ఎగిరి దాని మీదికి దుమికి నోట కరుచుకొంది. ప్రతి దినము కదలిక కనిపించకుండ అక్కడే ఉంటూ పడిన ముక్కను సమయము చూచి ఎవరికి తెలియకుండ కుక్క తినెడిది, కావున దానిని ఎవరు పట్టించుకోలేదు. ఆ దినము పిల్లి ఎగిరి దుమకడము వలన అక్కడున్న వారందరు గమనించి దానిని తన్ని తరిమేశారు.

ఇంటిలో కుక్క ఎలుకల కోసము పొంచియుండి ఎలుక కనిపిస్తూనే దాని మీదికి ఎగురబోయి దొంతికుండలను క్రిందికి త్రోసింది. క్రిందపడిన కుండలు పగిలిపోయాయి. ప్రతిదినము పిల్లి ఎలుకలను పట్టిన ఏ కుండను పగులకొట్టక అతి లాఘవముగ పట్టుకొనెడిది. కావున దానిని గురించి ఇంటిలోనివారు పట్టించుకొనెడివారు కాదు. ఆ దినము కుండలు పగిలిపోవడముతో కుక్కను తన్ని తరిమినారు. తన్నులు తిన్న కుక్క, పిల్లి ఒకచోట చేరి తాము తిన్న తన్నులను ఒకరికొకరు చెప్పుకొన్నవి. ఇక మీదట ఎవరి స్థానములో వారుండి, ఎవరిపని వారు చేసుకోవడము మంచిదనుకొన్నాయి. భూమి మీద ఎవరికేపనియున్నదో దానిని చేసుకొని దొరికిన లాభముతో తృప్తిపడడము మంచిది.

P P M P P

# యోగ క్షేమములు

ఒక ఊరిలో ఒక బ్రాహ్మణ కుటుంబముండెడిది. అందులో ఇద్దరు అన్నదమ్ములున్నారు. పెద్దవానిపేరు రామబ్రహ్మ, రెండవవాని పేరు విష్ణుబ్రహ్మ. వీరిద్దరు చిన్నప్పటినుండి అన్ని విద్యలలో ఆరితేరారు. బ్రాహ్మణులకు ముఖ్యమైన బ్రహ్మవిద్యలో కూడ ఇద్దరు ప్రావీణ్యత సంపాదించారు. అన్ని విద్యలు సమానముగ నేర్చినవారైనప్పటికి ఒక్క బ్రహ్మవిద్యలో కొంత అభిప్రాయభేదము కల్గియుండెడివారు. తండ్రి చనిపోయిన తర్వాత ఇద్దరు విడిపోయి వేరువేరు సంసారములను పెట్టుకొన్నారు. ఇద్దరు భగవద్గీతలో ప్రావీణ్యత పొందినవారే. భగవద్గీతలోని రాజవిద్యా రాజగుహ్య యోగమున 22వ శ్లోకమును "అనన్యాశ్చిన్త యన్తో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" నిత్యము పఠించెడివారు. పెద్దవాడైన రామబ్రహ్మ ఈ శ్లోకాన్ని పూర్తి విశ్వశించినవాడై

తమయొక్క యోగమును గాని క్షేమమునుగాని దేవుడే చూచుకొంటాడని నమ్మియుండెడివాడు. చిన్నవాడైన విష్ణుబ్రహ్మ అలాకాకుండ అన్యచింతలేకుండ దేవుని మీద విశ్వాసముంచి ఆరాధించిన వానిని యోగభ్రష్టుడు కాకుండ దేవుడే కాపాడునని నమ్మియుండెడివాడు. ఈ విధముగ ఇద్దరు ఈ శ్లోకము మీద భిన్న అభిప్రాయములు కల్గియుండిరి.

ఒకనాడు ఇద్దరు దైవదర్శనమునకు పోవలయునని తలచి పెద్దవాడు తిరుపతికి, చిన్నవాడు శ్రీశైలమునకు బయలుదేరి పోయారు. తిరుపతికి పోయిన పెద్దవాడు రామబ్రహ్మ కాలినడకన ఏడుకొండలు ఎక్కి దైవదర్శనమునకు పోవాలనుకొన్నాడు. ఆ విధముగ తిరుపతి నుండి తిరుమలకు పోవుచున్నపుడు కాలిదారి కొండప్రాంతము, అడవి అయిన దానివలన ఒక పాము రామబ్రహ్మను కాటువేసినది. దానితో రామబ్రహ్మము చాలా భయపడిపోయాడు. ఆ కాటుతో తాను చనిపోవడము ఖాయమనుకొన్నాడు. తిరుపతికి రాకుండ ఇంటివద్దనే యుండివుంటే మంచిగ ఉండేది. ఇక్కడికివచ్చి ప్రాణము మీదికి తెచ్చుకొన్నాను అనుకొన్నాడు. పాముకాటుతో భయపడిన రామబ్రహ్మము తన క్షేమమును కూడ దేవుడే చూచుకొంటాడు అని అనుకోకుండ తన క్షేమము తానే చూచుకోవాలనుకొన్నాడు. అంతలోనే నోటిలో నురగలు రాను మొదలు పెట్టాయి. దానితో మరింత భయపడిపోయి "యోగ క్షేమమ్ వహామ్యహమ్" అనుమాట పూర్తి అసత్యము. ఈ విషయములో తన తమ్ముడు చెప్పుమాటయే వాస్తవమనుకొన్నాడు. అంతలోనే అతని పరిస్థితిని చూచిన ఒక బాటసారి తనకు పాముకాటుకు వైద్యము తెలుసునని రామబ్రహ్మమునకు ధైర్యము చెప్పి ఏదో చెట్టు ఆకు పసరును అతనికి త్రాపాడు. అంతటితో పాము విషము తగ్గి నోటిలోని నురగలు తగ్గిపోయాయి. అరగంటకు తనలో పాము విషము పూర్తి తగ్గిపోయిందని తెలుసుకొన్న రామబ్రహ్మము దేవుడే తనను రక్షించాడని లేకపోతే చనిపోయి ఉండేవాడినని అనుకొన్నాడు. అంతటితో తనను నమ్మినవారి యోగక్షేమములు దేవుడు చూస్తాడు కావుననే ఎవరో సమయమునకు వచ్చి వైద్యము చేశారని "యోగ క్షేమమ్ వహామ్యహమ్" అనుమాట పూర్తి సత్యమనుకొన్నాడు. దారిలో పాముకాటుకు మందిచ్చిన వాడు పరిచయమయ్యాడు. వాడుకూడ తిరుమలకు వెంకటేశ్వరస్వామి దర్శనమునకు వచ్చువాడే కనుక ఇద్దరు కలసి కొండ ఎక్కిపోయారు. ఇద్దరు కలసి తిరుమలలో భోజనము చేశారు. ఇద్దరు కలసి మరుసటి దినము దైవదర్శనము కూడ చేసుకొన్నారు. రాత్రి కావడము వలన ఇద్దరు కలసి ఒకరూము అద్దెకు తీసుకొని పడుకొన్నారు. ఉదయము లేచిచూచేసరికి తన వెంటయుండిన వాడు దొంగయని, తన మూటను దొంగిలించాడని రామబ్రహ్మము తెలుసుకొన్నాడు. తనవద్ద ఒక్క పైసా కూడాలేదు. ఉన్న సొమ్మంతయు మూటలోనే ఉండినది. తిరుగు ప్రయాణమునకు కొంచెమైన డబ్బులేదు. ఎలా ఇల్లు చేరాలనుకొన్నాడు. తిరిగి భగవద్గీత శ్లోకములోని యోగక్షేమమను మాట జ్ఞప్తికివచ్చినది. ఈ మారు తనను క్షేమముగ ఊరు చేరిస్తే చాలని దేవున్ని ప్రార్థించు కొన్నాడు.

కాలినడకన ప్రయాణము చేసి తిరుపతి రైల్వేస్టేషన్ చేరుకొన్న రామబ్రహ్మము తానెలా ఊరు చేరాలని చింతించను మొదలు పెట్టాడు. చివరకు చేసేదిలేక టికెట్‌లేకుండ రైలెక్కాడు. ఎన్నడూ టికెట్‌లేని ప్రయాణము చేయని రామబ్రహ్మము మనస్సులో దేవుని ప్రార్థించుచునే ఉన్నాడు. అంతలో రైలు స్టేషన్ వదలి బయలుదేరినది. కొద్దిసేపటికి టికెట్ చెకింగ్‌కు టికెట్ కలెక్టర్ రానేవచ్చాడు. అందరిని టికెట్ అడుగుచు వచ్చి రామబ్రహ్మమును కూడ టికెట్ అడిగాడు. రామబ్రహ్మము వద్ద టికెట్‌లేదని తెలుసుకొన్న టికెట్ కలెక్టర్ రామబ్రహ్మము ఎంత చెప్పుకొనిన వినకుండ ప్రక్క స్టేషన్‌లో దించేశాడు. రామబ్రహ్మమునకు తినేదానికి తిండిలేదు, ప్రయాణించేదానికి డబ్బులేదు. దేవుడు ఆదుకోలేదు. తాను చేసేదిలేక ఒక్కొక్క ఊరు ప్రయాణిస్తు, ఆ ఊరిలో భిక్షాటన చేసి కడుపు నింపుకొనుచు దారిసాగిస్తు ఒక నెలరోజులకు సొంత ఊరును చేరుకొన్నాడు. ఈ మారు గీతలోని శ్లోకము యొక్క సారాంశము అసత్యమని దేవుడు తన క్షేమమును

చూడలేదని తలచాడు. ఈ విషయమును తనకంటే చిన్నవాడైన విష్ణుబ్రహ్మము చెప్పుచుండెడివాడని అతనితో ఈ విషయమును చర్చించుటకు పోయి కలిశాడు.

చిన్నవాడైన విష్ణుబ్రహ్మము కూడ శ్రీశైలయాత్రకు పోయివచ్చాడు. తాను మొదటినుండి దేవుడు ఎవని క్షేమము చూడడు అని వాదిస్తు యుండెడివాడు. కనుక శ్రీశైలయాత్రలో తనకు ఎన్ని కష్టములు కల్గిన అవన్నియు సహజముగ కలుగునవే అనుకొన్నాడు. కష్టాలకు దేవునికి ముడిపెట్టలేదు. తనయాత్రను ముగించుకొని ఇంటికి వచ్చిన విష్ణుబ్రహ్మతో అన్న రామబ్రహ్మము కలిసి తన అనుభవమంత తెలియజేశాడు. అన్యచింతలేకుండ నేను దేవున్ని ఆరాధిస్తున్నాను నా క్షేమమును దేవుడు చూడలేదు. అటువంటపుడు గీతలోని శ్లోకము వ్యర్థము కదా! వ్యర్థమైన, నిరూపణకు రాని శ్లోకమును దేవుడు గీతలో ఎందుకు చెప్పాడు? దేవుడు క్షేమమును చూడడు అనుచున్న మాటయే నిజమైనదిగ తోచుచున్నది నీవేమంటావు అని అడిగాడు. అందుకు విష్ణుబ్రహ్మ "క్షేమము కర్మరీత్య కల్గునను సూత్రము ప్రకారము దేవుడు ఎవరి క్షేమము చూడడని అనుకొనుచుంటిని, అందువలన ఆ శ్లోకము ఎడల నేను నీతో విభేదించు చుంటిని అంతతప్ప శ్లోకమును గురించి పూర్తి వివరము నాకు కూడ తెలియదు. దీని విషయమును ప్రక్క ఊరిలో గల గురువుగారి చెంతకు పోయి విచారించి వివరముగ తెలుసుకొందాము" అన్నాడు. ఇద్దరు కలసి ప్రక్క ఊరిలోగల గురువుగారి వద్దకు పోయి ఆయనతో మాట్లాడుటకు కాచుకొనియుండిరి. గురువుగారి దర్శనము దొరికినది. గురువుగారి చెంత వారి అనుభవములను అభిప్రాయములను వెలిబుచ్చిరి. "**యోగ క్షేమమ్ వహామ్యహమ్**" అర్థము తెలుపమని కోరిరి. అపుడు ఆ గురువు గారు ఇట్లన్నాడు.

గురువు :- యోగ క్షేమమంటే మీరేమనుకొన్నారు?

రామబ్రహ్మ :- మా యొక్క యోగము, మా యొక్క క్షేమము అని అనుకొన్నాము.

గురువు :- నన్ను ఎవరనుకొని నావద్దకు అడుగను వచ్చారు?

విష్ణుబ్రహ్మ :- గురువుగ నమ్మి మా సంశయములు తీర్చుకొనుటకు వచ్చాము.

గురువు :- అందరు అనుకొనునట్లు నన్ను మీరు గురువు అనుకొనిన నేను వాస్తవముగ గురువును కాను.

బోధలు చెప్పువారందరిని సహజముగ గురువులనుకొనుట పరిపాటైనది. కాని బోధలు చెప్పువారు మీరనుకొన్నట్లు గురువులు కారు. బోధలు చెప్పువారు కేవలము బోధకులే అగుదురు. గురువు ప్రపంచమున కంతటికి ఒక్కడేయుండును. ఆయనే దేవుడు, దేవుడు మాత్రము గురువు కాగలడు. మిగతావారంతయు గురువు చెప్పిన దానినే బోధించుచుందురు కావున వారందరు బోధకులే అగుదురు. భూమి మీద బోధకులు గురువులు కారు, గురువులు బోధకులు కారు. **ఈ విషయములో ఏ విధముగ పొరబడి బోధకుని గురువుగ లెక్కించు కొనుచుందురో ఆ విధముగనే యోగము క్షేమము అను విషయములో కూడ పొరబడినారు.** నన్ను మీరు గురువు అని అనుకొనిన నేనెట్లు గురువును కానో అలాగే మీరనుకొన్నట్లు యోగ క్షేమమను మాటలో మీ క్షేమమని లేదు. అన్యచింతలేకుండ దేవుని నమ్మిన వాని యోగము యొక్క క్షేమమును చూస్తానని దేవుడు చెప్పాడుగాని నీయొక్క క్షేమమును చూస్తానని చెప్పలేదు. యోగ క్షేమము అంటే యోగము యొక్క క్షేమమని మీరనుకోకుండ పోవడమువలన దేవుని మాట మీకు అసత్యముగ కనిపించియుండవచ్చును కాని దేవుని మాట ఎప్పటికి అసత్యముకాదు. అందువలన నీలో భక్తియుండిన నీ క్షేమమును దేవుడు చూడడు. నీ క్షేమమంతయు నీ కర్మను అనుసరించి యుండును.

నీ యోగము యొక్క క్షేమమంతయు నీ భక్తి శ్రద్ధలను బట్టియుండును. భగవద్గీతలో దేవుడు చెప్పిన శ్లోకము యొక్క అర్థమును ఇంతవరకు సరిగ ఎవరు చెప్పుకోనందున మీరు కూడ తప్పుగ అర్థము చేసుకొన్నారు. గురువు మొదట చెప్పును తర్వాత దానిని బోధకులు చెప్పవలసియున్నది. గురువు భగవద్గీతలో చెప్పిన శ్లోకమునకు బోధకులు సరియైన వివరము అందివ్వలేక పోయారు. సరియైన అర్థమివ్వనివాడు బోధకుడు కాలేడు. భూమిమీద ఎందరో గురువులుగ చలామణి అగుచున్నను వారు ఎవరు గురువులు కారు. అందులో కొంతమంది మాత్రమే బోధకులు కాగలరు మిగతావారందరు బోధకులు కూడ కాదు. నన్ను మీరు గురువు అనుకొనిన నేను కేవలము బోధకుడినే, గురువును మాత్రముకాను.

విష్ణుబ్రహ్మ :- గురువు బోధకుడు వేరువేరన్నట్లు యోగము క్షేమము వేరువేరుకాదా?

గురువు :- యోగము వేరు, క్షేమము వేరు. కానీ గీతలో యోగము క్షేమము అని వేరు వేరుగ చెప్పలేదు. యోగక్షేమమ్ అన్నాడు కావున యోగము యొక్క క్షేమము అని అర్థము చేసుకోవాలి.

రామబ్రహ్మ :- గురువును బోధకున్ని ఎలా గుర్తించాలి?

గురువు :- గురువు స్వయముగ చెప్పువాడు, బోధకుడు చెప్పబడిన దానినే బోధించువాడు. అందువలన సులభముగ గుర్తించవచ్చును.

విష్ణుబ్రహ్మ :- యోగము యొక్క క్షేమమును, నాయొక్క క్షేమమును ఎలా గుర్తించాలి.

గురువు :- యోగ భ్రష్టునివి కాకుండ యోగము అభివృద్ధి అగుచు పోవడమును యోగము యొక్క క్షేమమని, జీవుడవైన నీకు కష్టములు రాకుండ సుఖముగ గడచుతుపోతే నీయొక్క క్షేమమని తెలియవలెను.

రామబ్రహ్మ :- యోగ క్షేమము దేనిని బట్టియుంటుంది. అలాగే నా క్షేమము దేనిని బట్టియుంటుంది?

గురువు :- ముందే చెప్పానుగ శ్రద్ధా భక్తులను బట్టి యోగక్షేమము, కర్మను బట్టి నీ క్షేమము ఉండును.

విష్ణుబ్రహ్మ :- ఇప్పటి గురువులకు మేము గురువులము కాదు కేవలము బోధకులమని తెలియదా?

గురువు :- తెలియదు. తమని అందరు గురువులంటున్నారు. తాము గురువులమని తలపోయుచున్నారు. యోగక్షేమమును యోగమువేరని క్షేమమువేరని అనుకొన్నంతవరకు తాము కేవలము బోధకులము కూడ కాదని తెలియదు.

రామబ్రహ్మ :- దేవుని వాక్యమును వక్రముగ బోధించుట వలన వచ్చు ఫలితమేమి?

గురువు :- కనిపించని పాపఫలము చాలా వచ్చును. అందరిని వక్రమార్గమున పంపినవారగుదురు కావున అది దేవునికే వ్యతిరిక్తము చేసినట్లగును.

విష్ణుబ్రహ్మ :- నేను మొదటినుండి యోగము యొక్క క్షేమమని, మా అన్న రామబ్రహ్మము యోగము క్షేమము రెండని అనుకొనుచుంటిమి ఇపుడు మీ బోధవలన నాది సరియైన భావమని తెలిసినది. నేను మొదటినుండి అలా అనుకోవడము వలన నా శ్రీశైలయాత్రలో బస్సు ప్రమాదము జరిగిన దానికి దేవునికి ముడిపెట్టలేదు. అదంతయు నా కర్మ అనుకొన్నాను.

గురువు :- వాస్తవముగ ప్రమాదములుగాని, కష్టములుగాని కర్మవలననే వచ్చును. యోగమునకు ఎట్టి హాని ఏర్పడక

పోవడము మన భక్తి శ్రద్ధలమీద ఆధారపడియుండునని గీతలో ఇదే సారాంశము కలదని తెలిసి నడుచుకొనువాడు గీతను సరిగ అర్థము చేసుకొన్నవాడగును.

ఈ విధముగ వారి సంభాషణలు సాగిన పిమ్మట ఆ గురువు గారు గురువుకాదని బోధకుడని తెలిసినవారై, తమ యోగము యొక్క క్షేమమును గురువైన దేవుడే చూడగలడని, తమ యొక్క క్షేమము తమ కర్మ ఆధీనములో కలదని తెలిసినవారై తమ ఇంటికి బయలుదేరి వెళ్ళిరి.

P P M P P

# విచిత్ర కుటుంబము

మానవునికి భక్తి (విశ్వాసము) అనునది అవసరమే. అట్లని ఆ భక్తి మూఢభక్తి కాకూడదు. మానవునికి దేవుని వివరము తెలుసుకొను జ్ఞానము అవసరమే, అట్లని అది దేవతల జ్ఞానము కాకూడదు. మనిషికి నాస్తికవాదము ఉండవచ్చును, అది తనను గూర్చిన వాదమైయుండాలి. కాని అది దేవున్ని గురించి మొదలు కాకూడదు.

ప్రతి మనిషికి పెళ్లి అవసరమే, కాని ఆ పెళ్లిలోని కార్యములైన అక్షింతలు, తలంబరములు మొదలైన వాటికి అర్థము తెలియనిది కాకూడదు. ప్రతి మనిషి తానున్నది వాస్తవమే అయిన తనెవరో ఎక్కడున్నాడో వివరము తెలియనివాడు కాకూడదు. అలా ఉంటే ఏమవుతుందనుటకు ఒక కథను ఉదాహరణముగ తీసుకొందాము.

ఒక ఊరిలో ఐదుమంది అన్నదమ్ములున్న కుటుంబముండెడిది. వారి తండ్రి పూర్తి నాస్తికుడు. దేవుడు అనుమాట ఆయనకు సరిపోదు. అందువలన తనకు పుట్టిన ఐదుమంది కొడుకులకు దేవతల పేర్లు పెట్టకుండ వస్తువుల పేర్లు పెట్టాడు. ఒకటవ కొడుకు పేరు చెక్కెర (పంచదార), రెండవ కొడుకు పేరు పాలు, మూడవవానిపేరు ఉప్పు (లవణము), నాల్గవవానిపేరు వెన్న, ఐదవవానిపేరు సున్న అని నామకరణము చేశాడు. తండ్రి పేరేమో ఆదినారాయణ కృష్ణప్రసాద్ అని వారి పెద్దలు పెట్టియుండెడివారు. కాని ఆ పేరు దేవతలది అయిన దానివలన తనకు నచ్చలేదు. సంతకము చేయుటకు ఆ పేరును మాత్రము వాడుకొని మిగత సమయములలో ఆచారి అని పిలిపించుకొనెడి వాడు. ఆచారి అన్నది వారి కులము పేరు.

ఐదుమంది కొడుకులలో పెద్దవాడు మొదటివాడు అయిన పంచదార అనువాడు సాత్త్వికుడు, రెండవవాడైన పాలు రాజసుడు, మూడవవాడైన లవణము తామసుడు, నాల్గవవాడైన వెన్న హేతువాది, ఐదవవాడైన సున్న నాస్తికుడు. ఐదుమంది కొడుకులు ఐదు మార్గములలో ఉండేవారు కాగ, ఐదవవాడైన సున్నకు తండ్రికూడ తోడుగ ఉంటూ ఇద్దరు నాస్తికవాదమును బలపరచెడివారు. వీరిది మధ్యతరగతి కుటుంబము కావున పెద్దగ ఆర్థికస్థోమత లేకుండెడివారు. పెద్దవారైన ముగ్గురు కొడుకులు కోన అప్పయ్యస్వామికి నీకొండకొస్తామని మ్రొక్కుకున్నారు. వారిభక్తి తండ్రికిగాని చిన్నకొడుకైన సున్నకుగాని పూర్తినచ్చెడిదికాదు. ఎందుకనగా వారు నాస్తికులు, కావున దేవుడే లేడంటూవుంటే మీరు అప్పయ్యస్వామి అని ముగ్గురు బయలుదేరారే అని వారికి ముగ్గురు మీద కోపముండెడిది. అయిన వారిమాటను ముగ్గురు పట్టించుకొనేవారు కాదు. నాల్గవకొడుకైన హేతువాది వెన్న మాత్రము ఆ ముగ్గురి భక్తిని గురించి ప్రశ్నమీద ప్రశ్నవేసి విమర్శించేవాడు. ప్రశ్నించడమే తనవంతుగ పెట్టుకొన్నాడు. ఎవడైన జవాబు చెప్పుటకు పూనుకొంటే వాని

జవాబును వినెడివాడు కాదు. ఎవరు చెప్పిన ఏ జవాబు చెప్పిన అది సరికాదని కొట్టివేసెడివాడు. తనకు తెలిసినంత ఎవరికి తెలియదను ఉద్దేశ్యమును తనలో పెంచుకొని ఎవరిమాటను వినెడివాడు కాడు. తన ప్రశ్నకు జవాబు చెప్పెడి వాడుండినప్పటికి ఎదుటివానికి ఏమి తెలియదను భావముతో ఆ జవాబును పూర్తిగ వినెడివాడుకాడు. తానే పెద్ద సత్యాన్వేషినని మురిసి పోయేవాడు. ఆ ఇంటిలో నాస్తికవాదులైన తండ్రి చిన్నకుమారుడు ఇద్దరు దేవుడే లేడు, గుళ్లు గోపురములన్ని భ్రమ, కొందరు స్వార్థపరులు దేవుడు అన్న పదమును పుట్టించి ప్రచారము చేసెడివారని దేవున్ని ఎవరైన చూచారా? చూచియుంటే మాకు చూపమనండి అనెడివారు. ఇక పెద్దవారైన ముగ్గురు అన్నదమ్ములు దేవతల భక్తికల్గి ఒక్కొక్క కాలములో ఒక్కొక్క దేవునికి మ్రొక్కుకొనుచు డబ్బు ఖర్చుచేసి పూజలు చేసెడివారు. ఆ ముగ్గురిలో కూడ భక్తిలో కొంత భేదాభిప్రాయములు కల్గియుండెడివి.

చెక్కెర పాలు ఉప్పు అను ముగ్గురు అన్నదమ్ములు కోన అప్పయ్య స్వామికి మ్రొక్కుకొన్నారు. వారి మ్రొక్కు ప్రకారము అప్పయ్యస్వామికి జనవరి ఒకటవ తేదికి పోవలసిందే. కోన అప్పయ్యస్వామి దేవాలయము దాదాపు వెయ్యిమైళ్ల దూరములో గలదు. మూడవవాడైన ఉప్పు ఆ వెయ్యి మైళ్ల దూరము కాలినడకన పోవాలనుకొన్నాడు. రెండవవాడైన పాలు అప్పయ్యస్వామి కొండవరకు బస్సు ప్రయాణము చేసి కొండను మాత్రము కాలినడకన ఎక్కి పోవాలనుకొన్నాడు. పెద్దవాడైన చెక్కెర అప్పయ్యస్వామి కొండవరకు రైలులో ప్రయాణము చేసి అక్కడినుండి బస్సులో కొండపైకి పోయి దర్శనము చేసుకొని మ్రొక్కుబడి చెల్లించ వలెననుకొన్నాడు. ఈ విధముగ ముగ్గురు మూడు విధములుగ కొండకు ప్రయాణమయ్యారు. మూడవవాడు ఉప్పు కాలినడకన ప్రయాణము చేయుచు సాగిపోవుటకు నెలరోజుల ముందే డిశంబరు మొదటి దినమే బయలుదేరాడు. అలా నాలుగువందల మైళ్లు నడిచేటప్పటికి కాళ్లు వాచిపోయి నడువుటకే కష్టమైనది. కష్టమైనప్పటికి అలాగే నడుస్తు తన ప్రయాణమును సాగించాడు. రెండవవాడు పాలు కొండవరకు రైలులో పోయి పదిమైళ్లు కొండ ఎక్కుటకు చాలా ప్రయాసపడినాడు. పెద్దవాడైన చెక్కెర కొండమీదికి కూడ బస్సు ప్రయాణము చేసి ఏ కష్టములేకుండ కొండమీదికి చేరుకోగలిగాడు. జనవరి మొదటి తేదికి ముగ్గురు అప్పయ్య స్వామి కొండకు చేరుకొన్నారు. తిరుగు ప్రయాణములో అందరు కలసి వచ్చారు.

పెద్దవారు ముగ్గురు ఇంటికొస్తూనే నాల్గవవాడైన వెన్న వారితో వాదమునకు దిగినాడు. దేవుడనేవాడు లేనేలేడు. మనుషులు చేసుకొన్న మూఢకల్పనయే దేవుడు. మూఢ విశ్వాసములకు మూలమైన దేవుడున్నాడని డబ్బు ఖర్చుచేసి మీరు పోయిరావడము మంచిదికాదన్నాడు. నాల్గవ వాడైన వెన్న వాదనతో ఐదవవాడైన సున్న కూడ కలిసాడు. అంతలో వారి నాన్నకూడ వారి వాదనతో ఏకీభవించాడు. దీనితో ముగ్గురు దేవుడున్నాడని, ముగ్గురు దేవుడులేడని వాదించసాగారు. వారి వాదన ముదిరి ప్రక్కింటి వరకు ప్రాకినది. ప్రక్క ఇంటి యజమాని వారి వాదనను నిలపాలని చూచాడు. అయినప్పటికి వారు ఆగలేదు. దేవుడున్నాడని నిరూపించగలరా అని ముగ్గురు, లేడని నిరూపించగలరా అని ముగ్గురు వాదించసాగారు. వీరి వాదనకు మధ్యవర్తిగ ప్రక్కింటి యజమాని అయిన జలంధరుడను పెట్టుకొన్నారు. జలంధరుడు సామాన్యుడు కాడు వారికి సరియైన మధ్యవర్తియే దొరికాడు. జలంధరుడు వారి వాదన తీర్చుటకు వారితో ఒక నిబంధన ఏర్పరుచు కొన్నాడు. తన ప్రశ్నలకు ఇరువైపుల వారు సమాధానము చెప్పాలి, ఎవరి సమాధానములు సమంజసముగ శాస్త్రబద్ధముగ ఉండునో వారి వాదననే ఒప్పుకోవడము జరుగుతుంది. సమాధానము సరిగలేని వారి వాదన కొట్టి వేయబడుతుంది అని నిబంధన ఏర్పరచాడు. దానికి ఇరువైపులవారు ఒప్పుకొన్నారు. మా సమాధానము లన్నియు సమంజసము గనేయుండునని ఆస్తికత్రయము అనుకొన్నారు. మా సమాధానము శాస్త్రబద్ధముగయుండునని

మేమే నెగ్గగలమని నాస్తికత్రయము అనుకొన్నారు. మొదట ఆస్తికులైన చెక్కెర పాలు ఉప్పులను జలంధరుడు ప్రశ్నించను మొదలు పెట్టాడు.

జలంధర్ :- దైవభక్తిలో మీరు ముగ్గురు ఒకే విధముగ ఉన్నారా?

చెక్కెర :- ఉన్నాము.

జలంధర్ :- ఇంటి ప్రక్కనే ఉన్నాను కాబట్టి నాకు అన్ని తెలుసు, ఒకే విధముగ ఉంటే కోన అప్పయ్యస్వామికి ఒకరు కాలినడకన మరియొకరు రైలుప్రయాణము చేశారు కదా దీనినేమంటాము.

ఉప్పు :- వారికంటే నాకు భక్తి ఎక్కువవుంది కాబట్టి నేను కాలినడకన పోయాను. వారికంటే నేను కొంతమేలు.

చెక్కెర :- వాడు కాలినడకన పోయిన కానుక ఇచ్చింది నూరు రూపాయలే. నేను వెయ్యిరూపాయలను కానుకగ దేవునికి ఇచ్చాను. రెండవ తమ్ముడైన పాలు ఐదువందలు మాత్రమే కానుకగ హుండీలో వేశాడు. లెక్కప్రకారము నేను ఎక్కువవేసి దేవునికి దగ్గరవానిగ ఉన్నాను.

పాలు :- నేను కానుక వేసింది ఐదువందలే అయిన కోరిక ఏమి కోరలేదు. వెయ్యివేసిన చెక్కెర వ్యాపారములో లక్షలులాభము రావాలని కోరుకొన్నాడు. వందవేసిన ఉప్పు కూడ తనకు లాభము లక్షలలో ఉంటేనే వస్తానని మొక్కుకొని దేవునికి బరువును బాధ్యతను పెట్టారు. నేను ఏమి కోరలేదు, ఏ బరువు పెట్టలేదు కావున నేనే మేలుకాదా! దేవునికి పనిపెట్టిన వారిద్దరికంటే ఏమి అడగని నేను మేలు అన్నాడు.

ఇలా దేవుని మీద నమ్మకముండి ఆస్తికులనిపించుకొన్న చెక్కెర, పాలు, ఉప్పు ముగ్గురి వాదనలను విన్న జలంధరుడు వారినే ప్రశ్నించాడు.

జలంధర్ :- దేశములో ఎంతోమంది దేవతలుండగ కోన అప్పయ్య స్వామికే ఎందుకు మొక్కుకొన్నారు?

చెక్కెర :- అందరి దేవతలకంటే తొందరగ మొక్కుకొన్న మొక్కులు తీరుస్తాడని మొక్కుకొన్నాము.

జలంధర్ :- పాలును అడుగుచున్నాను. నీకు ఏ కోరిక లేదుకదా నీవెందుకు ఆ దేవున్ని మొక్కినావు?

పాలు :- మొక్కకుండిన ఆయనే నా బాగోగులు, నాక్షేమములు, నా రోగములు చూచుకొంటాడని మొక్కిన.

జలంధర్ :- వారు అడిగి పని చేయించుకొనుటకు మొక్కారు, నీవు అడగకనే పని చేయించుకొనుటకు మొక్కావు. ఎలాగైతేనేమి నీకు కూడ లోపల కోరిక ఉన్నట్లే కదా!

పాలు :- నేను వారిమాదిరి ఇంత అంత అని మొక్కలేదుకదా!

జలంధర్ :- ఒక్క లెక్కలో వారి కోరికకు లక్ష అనో, పది లక్షలనో పరిమితియున్నది. నీది పరిమితిలేని కోర్కెగ కనిపిస్తున్నది. ఎలాగైతేనేమి అందరికంటే మంచివానిగనో, కోర్కెలు తీర్చువానిగనో లెక్కించి అప్పయ్య స్వామినే ఎంచుకొన్నారు. అప్పయ్యస్వామికి తల్లితండ్రులున్నారా? వారు ఎవరు? వారు అప్పయ్యస్వామికంటే ముఖ్యులు కాదా?

చెక్కెర :- ఆయన పుట్టుకలోనే ఎంతో గొప్పతనమున్నది. అతను అందరివలె సామాణ్యముగ పుట్టలేదు.

పాలు :- తల్లితండ్రి ఇద్దరు ఆడవారే. ఒకరినొకరు వివాహమాడి దంపతులైనారు. వారు ఇద్దరు గొప్ప తపస్సు చేసి తమకు గొప్ప సంతానము కలుగవలెనని శ్రీ మహావిష్ణువును వేడుకొన్నారు. శ్రీ మహావిష్ణువు వరప్రసాదముతో పుట్టినవాడు అప్పయ్యస్వామి.

జలంధర్ :- ఇదేమి వింత ఇద్దరి ఆడవారికి సంతానమా! ఎంత విష్ణువు వరమైతేనేమి పురుషుడు లేకుండ ఆడవారికి సంతతి కల్గునా? నమ్మవచ్చునా?

పాలు :- ఇద్దరు ఆడవారైనందున శ్రీ విష్ణువే వీరికి సంతానము కల్గుటకు ఒకనెల ఒకరు మగవారుగ, ఒకరు ఆడవారుగ ఉండవలెనని వరమిచ్చాడు. దానిప్రకారము ఇద్దరు స్త్రీలలో నెలకొకరు పురుషునిగ మారిపోవుచుందురు. అందువలన వారికి సంతతికల్గి అప్పయ్యస్వామి పుట్టాడు.

జలంధర్ :- అప్పయ్యస్వామికి ఆ ఇద్దరి ఆడవారిలో తల్లి ఎవరు? తండ్రి ఎవరు?

ఉప్పు :- ఎలా చెప్పగలము. తల్లి పలానా అని, తండ్రి పలానా అని చెప్పుటకు వీలులేదు. నెలకొకరు తండ్రి నెలకొకరు తల్లికదా!

జలంధర్ :- ఆ ఇద్దరి ఆడవారి పేర్లలో అయిన తేడాగలదా? వారి పేర్లేమిటి?

చెక్కెర :- ఇంద్రమతి, చంద్రమతి. ఒక నెలలో ఇంద్రమతి ఇంద్రుడను పేరుతో పురుషునిగ చలామణికాగ, మరొక నెలలో చంద్రమతి చంద్రుడను పేరుతో పురుషునిగ చలామణి అగుచున్నది.

జలంధర్ :- పలానా తండ్రి అని, పలానా తల్లి అని తెలియని అప్పయ్యస్వామి మీకు గొప్ప దేవుడైనపుడు, అతను పుట్టుటకు వరమిచ్చిన విష్ణువు అప్పయ్యస్వామికంటే గొప్పకాదా?

చెక్కెర :- విష్ణువును పూజించువారు కూడ కొందరున్నారు. అట్లను కుంటే విష్ణువును మోహిని అవతారములో రాక్షసులనుండి కాపాడిన శివుడు కూడ గొప్పవాడే.

జలంధర్ :- అప్పయ్యస్వామికంటే విష్ణువు గొప్పంటిరి. విష్ణువుకంటే శివుడు గొప్పంటిరి. విష్ణువు శివుడుకంటే తక్కువవాడైన వారి వరముతో పుట్టిన అప్పయ్యస్వామిని కొలిచేదానికంటే ఆయనకంటే పెద్దవారైన విష్ణువునో శివుడునో కొలువవచ్చును కదా!

పాలు :- అట్లనుకొంటూ పోతే త్రిమూర్తులను పుట్టించిన ఆది పరాశక్తి అను దేవత గొప్పదగును. ఎవరి ఇష్టము వారిది, ఎవరికి ఇష్టమొచ్చిన దేవున్ని వారు పూజించుకోవచ్చును.

జలంధర్ :- పూజలు పునస్కారాలు మాటలతో చెప్పునవికావు. ప్రతి ఏటా కొన్ని కోట్ల రూపాయలు దేవతల పూజలకే ఖర్చుగుచున్నది. ఎంతోమంది తీర్థయాత్రలరూపములలో ఎన్నో కష్టములు అనుభవించు చున్నారు. ఎంతో సారాంశముండిన దేవున్ని ఎవరిష్టమొచ్చినట్లు వారు మ్రొక్కవచ్చని ఎందుకనుకోవాలి? అంగడిలో డబ్బులిచ్చినపుడు ఇచ్చే బియ్యము మంచివా కావా, ఇచ్చే సరుకులు మంచివా కావా అని చూస్తాము. లెక్కాచారము దగ్గర నూరుకు వెయ్యికి తేడా తెలియును. నూరు ఇచ్చి వెయ్యి అనుకోమంటే అలా అనుకోగలమా? వెయ్యికాదు నూరే ఇచ్చావంటాము. చివరకు వక్క (పోక) దగ్గర కూడ ఇది మంచివక్కనా గొంటువక్కనా అని చూడగలము. ఇచ్చినది రూపాయే అయిన అది కొద్దిగ చినిగినదైన ఈ రూపాయి బాగలేదు, మంచిది ఇమ్మంటాము. ఇన్నింటిలో లెక్క సరిగ చూచుకొను మనము దేవుని దగ్గరకొచ్చేటప్పటికి ఏ దేవుడైతే ఏమి, ఏదో ఒక దేవుడు మనకిష్టమొచ్చిన వాడని ఎందుకనుకోవాలి? అప్పయ్యస్వామికంటే విష్ణువు పెద్దయినపుడు విష్ణువును ఎందుకు పెద్దగ పెట్టుకోకూడదు. మన మనస్సును పెట్టి

పూజచేయు దేవుళ్లే చిన్న పెద్దవారైనపుడు వారిలో పెద్ద దేవున్ని ఎందుకు ఎంచుకోకూడదు. అప్పయ్యస్వామికంటే పెద్దవారు లేరా?

చెక్కెర :- క్రైస్తవులకు ఒక యెహోవా ఉన్నట్లు, ముస్లీమ్‌లకు ఒక అల్లా ఉన్నట్లు మనకు ఒక దేవుడు లేడు కదా! ముప్పయి మూడు కోట్లమంది దేవతలున్నారు. అందులో ఒకరిను మించి ఒకరున్నారు. ఏ దేవుడు గొప్పయని కొలవాలి?

జలంధర్ :- క్రైస్తవులకు దేవున్ని గురించి బోధించుటకు పరిశుద్ధ గ్రంథము బైబిలు కలదు. అలాగే ముస్లీమ్‌లకు అల్లాను గురించి బోధించుటకు పవిత్ర గ్రంథము ఖురాన్ కలదు. హిందువులకు దేవున్ని గురించి బోధించుటకు పలానా గ్రంథమున్నదని మీకు తెలుసునా?

పాలు :- ఎందుకు తెలియదు హిందువులకు ముఖ్యగ్రంథములు వేదములున్నవి కదా!

జలంధర్ :- అక్కడే మీరు పప్పులో కాలువేశారు. హిందువులకు వేదములకంటే ముఖ్యమైన గ్రంథము భగవద్గీత కలదు.

ఉప్పు :- హిందువులకు ముఖ్య గ్రంథములు వేదములని అందరికి తెలుసు, భగవద్గీత నిన్న లేక మొన్న ఐదువేల సంవత్సరముల పూర్వము వచ్చినది. వేదములు మొదటినుండి ఉన్నవి. ద్వాపరయుగము చివరిలో గీత వచ్చినది. దానికంటే ముందు యుగములైన కృతయుగము, త్రేతాయుగములో కూడ హిందుమతము కలదు. అప్పుడు కూడ వేదములు గలవు. వేదములు హిందువుల ప్రమాణగ్రంథములని అందరికి తెలియును.

జలందర్ :- హిందువులకు ఒక్క దేవుడున్నాడని బోధించినది వేదములు కాదు. వేదములు ముప్పయి మూడుకోట్ల దేవతలను గురించి వారి ఆరాధనలను గురించి బోధించాయి. ఇందూదేశములో పదహారు కోట్ల జనాభాయున్న పదునాల్గవ శతాబ్దములో కూడ పదహారు కోట్ల జనాభాకు ముప్పయి మూడు కోట్ల దేవతలను అంటగట్టాయి వేదములు. దీనిని చూచి హేతువాదులు ప్రశ్నించితే వారి వాదనకు జవాబు లేకుండ పోయినది. హేతువాదులకు కూడ శాస్త్రబద్ధముగ జవాబు చెప్పగలది ఒకే ఒక భగవద్గీత. భగవద్గీత ద్వాపరయుగమునుంచి కాదు, సృష్టి ఆదినుండియున్నది. వేదములకంటే ముందునుండియున్నది భగవద్గీత అను వివరము చాలామందికి తెలియదు. ముందు పుట్టిన చెవులకంటే వెనుక పుట్టిన కొమ్ములు పెద్దగ కనిపించినట్లు, ముందునుండియున్న భగవద్గీతకంటే వెనుకవచ్చిన వేదములు పెద్దగ కనిపిస్తున్నవి. అంత మాత్రమున ముందేది వెనుకేది అని యోచించక మాట్లాడితే ఎలా?

చెక్కెర : ఇక్కడ నాదొక ప్రశ్న, వేదములు అపౌరుషములని చెప్పబడినవి. అపౌరుషములనగా వాటిని ఏ పురుషుడుగాని వ్రాయలేదని అర్థము. భగవద్గీతనేమో పలానా కృష్ణుడు చెప్పాడని చెప్పుచున్నాము. మనుషుల చేత చెప్పబడిన గీతకంటే, ఏ మనిషి చెప్పని వేదములు గొప్పవి కాదా!

జలంధర్ : అపౌరుషములనగ పురుషుని గురించి చెప్పినవి కాదని అర్థము. వేదములను మనుషులు వ్రాశారు. వేదములను దేవుడు చెప్పలేదు. వేదములలో పురుషుడైన దేవున్ని గురించి లేదు. వేదములలో ప్రకృతి స్వరూపమైన (స్త్రీ స్వరూపమైన) దేవతలను గురించియున్నది. పురుషుడైన దేవున్ని గురించి అందులో లేదు, కావున వేదములు అపౌరుషములు అన్నారు. పురుషుడనగ దేవుడని, ప్రకృతియనగ మాయ అని తెలియవలెను. వేదములలో ప్రకృతి స్వరూపమైనదే గలదు కాని పురుష స్వరూపమును గూర్చిలేదు. గీత అలాకాదు. గీతను స్వయముగ దేవుడే సృష్టిఆదిలో

చెప్పాడు.  అదే విషయమునే ద్వాపరయుగములో కృష్ణుని చేత చెప్పబడినది.  వేదములకంటే ఎంతో గొప్పది భగవద్గీత, భగవద్గీతలో దేవుడైన పురుషుని గురించి చెప్పబడినది.  వేదములు మనుషులచేత చెప్పబడినవి.  గీతయే దేవుని చేత చెప్పబడినది.  గీతలోనే సర్వప్రశ్నలకు జవాబు కలదు.  నిజమైన హేతువాదము, నిజమైన ప్రతి వాదము గీతయేనని తెలుసుకొనుము.  హేతువాదమునకు నాంది భగవద్గీతయే, అలాగే జవాబు కూడ భగవద్గీతయే.  హేతువాదము ప్రతి వాదము రెండు గీతలోనే కలవు.  వేదములు హేతువాదమునకు నిలువజాలవు. **అసలైన దేవుడొక్కడున్నాడని తెలుపునది ఒకే ఒక భగవద్గీత** మాత్రమేనని హిందువులు తెలుసుకోలేక పోవడము ఎంతో విచారించదగిన విషయము.  అసలైన శాస్త్రము, అన్ని శాస్త్రములకంటే మించిన శాస్త్రము భగవద్గీత కాగ  దానిని వదలి  కట్టు కథలను నమ్మి  స్త్రీలకు పుట్టినవాడని, పురుషులకు పుట్టినవాడని అసలైన దేవున్ని వదలి అన్యదేవతలను పూజించడము సరియైన పద్ధతికాదు. మీలాంటివారు కలరని గీతలో కూడ ముందే చెప్పబడినది.  మీరు ముగ్గురు చేసినది గుణములతో కూడుకొన్న భక్తియేకాని గుణాతీతముకాదు.  అందులో ఉప్పు కాలినడకన పోవడము తామసభక్తి,, పాలుది రాజసభక్తి, చెక్కెరది సాత్త్వికభక్తి.  మీరు కష్టపడినప్పటికి అది అసలైన మార్గము కాదని, భక్తితో ఇతర దేవతలను ఆరాధించుట వలన అది శ్రద్ధతో కూడిన భక్తి అయిన  దారి తప్పిన విధానమే అగునని గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయములో 23వ శ్లోకములో ఈ విధముగ అన్నారు.

"యేప్యన్య దేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేపి మామేవ కౌంతేయ యజ్యంత్యవిధి పూర్వకమ్"

ఇతర దేవతలను శ్రద్ధతో ఆరాధించినప్పటికి  వారు నన్ను ఆరాధించినట్లే అగును  అయినప్పటికి వారు దారి తప్పిన ఆరాధన చేయుచున్నారు. అని గీతలో కూడ కలదు.

దీనిని బట్టి మీరు చేయు పూజలు దారి తప్పినవని  అవి దేవుని వరకు మిమ్ములను చేర్చవని తెలియుచున్నది. మీరు దేవుని వరకు చేరవలెనని పూజించక  కోర్కెలకొరకే పూజించారు కావున అది గుణములతో కూడుకొన్నదై, మీరు ఆరాధించిన విధానమునుబట్టి రాజస, తామస, సాత్త్వికమునకు సంబంధించినదై ఉన్నది.  గీతలో చెప్పినట్లు గుణరహితముకాలేదు.

ఎవరు ఎంత కోరిన ఆ కోర్కెలు నెరవేర్చబడుతాయనుకోవడము పొరపాటు.  ఎవరి కర్మ ఫలితము ప్రకారము వారికి జరుగును.  అట్లుకాక మ్రొక్కినవానికి ఇవ్వడము, మ్రొక్కనివానికి ఇవ్వకపోవడము అనేది దేవుని విధానములో లేనేలేదు.

ఇదంతయు చూస్తే దేవుడున్నాడను మాట శాస్త్రబద్ధము, వాస్తవము.  కాని మీరు నడచిన విధానము సరియైనది కాదు.  అందువలన మీ తమ్ముల్లకు మీ నాన్నకు మరీ విరుద్ధముగ కనిపించింది. వారి నాస్తికవాదమునకు సరియైన జవాబు లేకపోయినది.  నేను దేవుడున్నాడను మిమ్ములను సమర్థించినప్పటికి మీ భక్తిని, మీ భక్తి విధానమును సమర్థించను.  మనిషికి భక్తి అనునది అవసరమే, అట్లని అది మూఢభక్తి కాకూడదు.  మనిషికి దేవున్ని గురించి తెలుసుకొను జ్ఞానము అవసరమే, అట్లని అది దేవతల జ్ఞానము కాకూడదు.  సర్వమునకు సృష్టికర్తయైన దేవున్ని ఆరాధించడము మంచిదే కాని  దేవుని చేత సృష్టించబడిన దేవతలను ఆరాధించడము మంచిది కాదు.

చెక్కెర   : అయితే ఎవరిని. ఎవరిని ఆరాధించాలి? ఎవరు దేవుడు?

జలంధర్ : ఈ ప్రశ్నలు మీనుండి రావాలనే నేను కోరుకొంటున్నాను. దేవతలందరికి దేవుడైనవాడే నీకు దేవుడు. గీతా శాస్త్రములో ఏ దేవున్ని పరమాత్మ అన్నారో ఆ దేవున్నే ఆరాధించు, అపుడు నీవు సక్రమమైన విధానమును అనుసరించిన వానివైతావు.

పాలు : అందరి దేవుళ్ళకంటే పెద్దవాడు పరమాత్మ అంటున్నావు, సరే మేము ఒప్పుకొంటాము. మా నాన్న మా తమ్ముల్లు ఈ మాటను ఒప్పుకోరే, వారిమాటేమిటో నీవే అడుగు.

అంతటితో జలంధర్ ఆస్తికవాదులైన చెక్కెర, పాలు, ఉప్పుతో సంభాషణ చాలించి నాస్తికవాదులైన ఆచారి, వెన్న, సున్నతో మాట్లాడను మొదలుపెట్టాడు.

జలంధర్ : మీరు దేవుడు లేడని ఎలా అనగలుగుచున్నారు? దానికేమైన ఆధారము కలదా?

సున్న : దేవుడు అన్న పదమే కల్పితము. ఆస్తికవాదులు కల్పించుకొన్న దేవుడు నిజముగలేడు.

జలంధర్ : లేడు అనుట, కల్పితము అనుట ఒట్టి మాటయేకాని అది జవాబుకాదు. శాస్త్రబద్ధమైన ఆధారమేమైన మీవద్ద కలదా?

ఆచారి : శాస్త్రబద్ధమైన ఆధారము ఒకటే కలదు. అదేమనగా విశ్వమంత పదార్థముతో కూడుకొనియున్నది. పదార్థము శక్తిగా మారుచున్నది, శక్తి తిరిగి పదార్థముగ మారుచున్నది. ఇది సహజ సిద్ధముగ జరుగుచున్న ప్రపంచ మార్పు మధ్యలో దేవుడు ఎక్కడినుండి వచ్చాడు.

జలంధర్ : పదార్థము శక్తిగా, శక్తి పదార్థముగ మారుచున్నదని ఐదవ తరగతి చదువుకొన్న వానికి కూడ తెలుసు. దేవుడు లేడనుటకు ఈ మాటకు సంబంధమేమున్నది.

వెన్న : మా హేతువాదము ప్రకారము కదలని పదార్థము కదలెడు శక్తిగ తయారగుచున్నది. ఆ శక్తినే జీవము అంటున్నారు. అది జీవము కాదు అని మేము అంటున్నాము.

జలంధర్ : శక్తిని జీవము అంటున్నారు అది జీవము కాదు అని మీరంటున్నారు. సరే ఆ శక్తికి మరేదైన పేరు పెట్టవచ్చునా?

వెన్న : అలా పేరు పెట్టుటకు వీలలేదు.

జలంధర్ : అలాగైతే దానిని శక్తి అనియే మీరెందుకు పేరు పెట్టారు?

వెన్న : పదార్థమునుండి వచ్చే శక్తిని శక్తి అనక ఏమనాలి?

జలంధర్ : శక్తిని దేవుడని ఎందుకనకూడదు.

వెన్న : దేవుడైతే కాళ్ళు, చేతులు, శిరస్సు కలిగి రూపముకల్గి ఉంటాడు కదా! అలాంటి రూపములేదు కనుక శక్తిని దేవుడనుటకు వీలులేదు.

జలంధర్ : దేవునికి రూపముందని ఎవరు చెప్పారు?

సున్న : భూమి మీద ప్రజలందరు దేవుని రూపాన్ని పెట్టుకొనే కదా పూజిస్తూ ఉండేది. నాలుగు చేతులున్న వాడు విష్ణువు, నాలుగు తలలు కలవాడు బ్రహ్మ అంటుంటారు కదా!

జలంధర్ : విష్ణువు, బ్రహ్మ ఆకారము కల్గిన దేవుళ్ళు, మీ అన్నగారు ముగ్గురు అటువంటి వారిని పూజిస్తున్నారు కావున అది తప్పు మార్గమని, సరియైన మార్గము కాదని చెప్పాము. విష్ణువును, బ్రహ్మను దేవుడు కాదని గీతశాస్త్రము కూడ చెప్పుచున్నది.

గీతాశాస్త్రము ప్రకారము దేవునికి రూపములేదని ఉన్నది, కాని రూపమున్నవాడు దేవుడని ఎక్కడ చెప్పబడలేదు.

సున్న : వేదములలో ఉందికదా!

జలంధర్ : వేదములు శాస్త్రములుకావు. శాస్త్రములలో ఉంటే చెప్పు.

వెన్న : అయితే దేవుడెవరంటావు.

జలంధర్ : నీవు చెప్పుచున్న శక్తినే దేవుడంటున్నాము.

సున్న : శక్తిని జీవుడనగా విన్నాము, దేవుడని ఎవరు చెప్పలేదే.

జలంధర్ : దైవము శక్తి స్వరూపమని మేమంటున్నాము కాదని నీవన గలవా?

వెన్న : పదార్థము నుండి వచ్చినదే శక్తి. కావున దేవుడు పదార్థము నుండి పుట్టాడంటావా?

జలంధర్ : పదార్థమునుండి పుట్టినది శక్తి అయినపుడు పదార్థమునుండి శక్తి పుట్టిందనడములో తప్పులేదుకదా! శక్తిని దేవుడన్నపుడు పదార్థము నుండియే దేవుడు పుట్టాడనములో తప్పులేదుకదా!

వెన్న : అయితే పదార్థము 105 మూలకములుగ ఉన్నది. వాటిలో శక్తి 105 రకములుగ ఉండును అయితే దేవుడు 105 రకములుగ ఉంటాడా?

జలంధర్ : పదార్థములు 108 అని ఏనాడో సైన్సు అభివృద్ధి కాని కాలములోనే కృతయుగములోనే పూర్వీకులు చెప్పగలిగారు. అన్ని పదార్థములలో శక్తి విడివిడిగా ఉండినప్పటికి శక్తి అన్నది ఒక్కటేనని కూడ చెప్పారు.

సున్న : సైన్సు అభివృద్ధయిన తర్వాతే పదార్థము 105 మూలకములుగ ఉన్నదని తెలిసింది సైన్సు ప్రకారమే చెప్పగలిగారు. 108 అని ముందు చెప్పారనుట అసత్యము.

జలంధర్ : జపమాల కృతయుగములోనే నీకు తెలిసిన సైన్సు పుట్టకనే పుట్టింది. జపమాలలో 108 పూసలున్నాయి. 108 పూసలమాలలో చివర పెద్ద పూసకూడ ఉన్నది. 108 పూసలు 108 పదార్థములకు గుర్తని ఆనాడే తెలిపారు. అన్ని పూసలవలె ఒక్క పూస పెద్దగయుండడము అన్నిటిలోనున్న శక్తి ఒక్కటేనని తెలియబడటానికేనని చెప్పగలిగారు. ఈనాడు మీరు చెప్పు పదార్థమును పద విశ్లేషణ చేసి ఏనాడో దాని అర్థమును కూడ చెప్పగలిగారు. **పద+అర్థము = పదార్థము అని అన్నారు. పద అనగ భాగము అని, అర్థము అనగ సారాంశమైన శక్తి అని తెలిపారు.** పదార్థము అనగా ఒక భాగములో అనిగియున్న శక్తి అని చెప్పారు. ప్రతి పదార్థములోను దేవుడు అణువణువున వ్యాపించియున్నాడని కూడ చెప్పారు. మీరు పదమును చూడగల్గు చున్నారు కాని దానిలోని శక్తిని చూడలేకున్నారు. శక్తి ఎవరికి కనిపించునది కాదు శక్తి పదార్థములోని అంతర్భాగమేకాని వేరుకాదు. పదార్థములోని శక్తి పదార్థమునే కదలించుచున్నది. ఆ కదలికను మీరు జీవము అని అంటున్నారు. కాదు దేవుడు అని నేను అంటున్నాను. మీరేమంటారు?

సున్న : మీరు చెప్పునది సైన్సుకు దగ్గరగనే ఉన్నది. ఇలాగ ఎవరు చెప్పలేదు. దేవుడంటే గుడిలో ఉండేవాడే

అనుకొన్నాము. శక్తియే దేవుడైతే శక్తిని మేము కూడ ఒప్పుకొంటాము. దేవుడు వరకు సరిపోయింది. కాని పదార్థము యొక్క దశలను నిర్జీవము, జీవము అని, పదార్థము పదార్థముగ ఉన్నపుడు నిర్జీవము అని, పదార్థమునుండి శక్తి విడుదలైనపుడు జీవము అని అంటుంటాము. జీవమే ప్రాణము అని కొందరు అంటుంటారు. దీనిని గురించి చెప్పండి.

జలంధర్ : వాస్తవానికి పదార్థములో ఇమిడియున్నది శక్తి అదియే దేవుడు అని అన్నాము. పదార్థము పదార్థముగ ఉన్నపుడు నిర్జీవము అని, పదార్థమునుండి శక్తి విడుదలైనపుడు జీవము అని అనడము శుద్ధ తప్పు. పదార్థములో ఇమిడియున్నది దేవుడు లేక దైవశక్తి. దానిని జీవము అనకూడదు. జీవమును ప్రాణము అనుటకూడ శుద్ధతప్పు. ప్రాణము వేరు జీవము వేరు, ప్రాణము అనగ గాలి అని అర్థము. మన శరీరములలో ఐదుగాలులుగలవు. వాటినే పంచప్రాణములు అంటాము. జీవుడు మాత్రము ఒక్కడేగలడు. జీవుడు ప్రాణముకాదు కాని జీవుడు దేవునిలోని ఒక భాగము. జీవున్ని ఒప్పుకొన్నా దేవున్ని ఒప్పుకోవలసిందే, లేక దేవున్ని ఒప్పుకొన్న జీవున్ని ఒప్పుకోవలసిందే.

వెన్న : దేవుడు రెండు భాగములుగ ఎందుకున్నాడు?

జలంధర్ : రెండు భాగములు కాదు, మూడు భాగములుగ ఉన్నాడు. ఒక కార్యములో కర్త ఒకటి, కర్మ ఒకటి, క్రియ ఒకటి ఉన్నట్లు ఈ విశ్వము యొక్క కార్యములో దేవుడు మూడు భాగములుగ పరమాత్మ, ఆత్మ, జీవాత్మగ విభజింపబడియున్నాడు.

సున్న : కర్త, కర్మ, క్రియ అంటే ఏమిటి?

జలంధర్ : ఏదైన ఒక కార్యము జరుగుటకు ఒక కారణము కావలయును. దానినే హేతువు అంటున్నాము. చేయు వానిని క్రియ అంటున్నాము, చేయించువానిని కర్త అంటున్నాము. చేయుటకు కారణము ఏదైన ఉండవచ్చును చేయించువాడు, చేయువాడు తప్పక ఉండవలయును. విశ్వము పుట్టుట, పెరుగుట, అంత్యమగుట అనువాటిని సృష్టి, స్థితి, లయ అంటున్నాము. సృష్టి, స్థితి, లయ అను కార్యమును జరుపుటకు దేవుడొక్కడే మూడు భాగములుగ తయారైనాడు. చేయువాడు కర్త పరమాత్మ అనియు, హేతువు అయిన కర్మ ఆత్మ అనియు, చేయబడుచున్న క్రియను జీవాత్మ అనియు విభజించి చెప్పుకొనుచున్నాము. కర్త కర్మ క్రియ మూడు ఒక్కటే అలాగే పరమాత్మ, ఆత్మ, జీవాత్మ మూడు ఒక్కటే. ఆ ఒక్కటే దేవుడు.

వెన్న : నేను హేతువాదిని. హేతువు అంటే కారణము అని నాకు తెలుసు, కాని హేతువు అంటే కర్మని నేను ఎక్కడ వినలేదు. అది మా సూత్రములో లేదు.

జలంధర్ : హేతువు అంటే కారణము అని తెలిసినపుడు, కారణము అంటే కర్మ అని ఎందుకు తెలియదు. కర్మంటేనే కారణము అని ఇప్పుడైన అర్థము చేసుకో.

వెన్న : ఏ పనికైన కారణము కనిపించును. ఒకనిని మరొకడు కొట్టాడు అంటే మొదటివాడు రెండవ వానిని దూషించాడు కనుక అది కారణమైనది. ఇక్కడ కొట్టుట అను కార్యమునకు దూషణ అనునది కారణము అయినది. నీవు చెప్పు కర్మ ఏమి కనిపించలేదు కదా!

జలంధర్ : అట్లెందుకనుకోవాలి దూషణ అనునదియే కర్మ అని అదియే కారణమని ఎందుకనుకోకూడదు.

ఆచారి : కర్మ దూషణరూపములో కనిపిస్తున్నది. అయితే దేవుడు కనిపించినట్లేనా?

జలంధర్ : సర్వము దేవుడే అను సూత్రము ప్రకారము అర్థము చేసుకోగలిగితే ఎక్కడైన దేవుడున్నాడు. మనము అంత స్థితికి రాలేదు కనుకనే దేవుడు ఎక్కడ తెలియబడలేదు. దూషణ అను దానికి ఒక కారణముండును. కారణములేని దూషణ ఉండదు కదా! ఎందుకు దూషించావు అను కారణమునకు కారణము కూడ ఉండును. అట్లు కారణమును ఆరా తీసుకొంటుపోతే కనిపించని కారణము ఒకటున్నదని తెలియుచున్నది. ఆ కనిపించని కారణమునే కర్మ అంటున్నాము. కర్మ కార్యరూపమైనపుడు దీనికిది కారణమని తెలియును. ఉదాహరణకు ఒక సీడి ప్లేటులో బొమ్మ కనిపించక ఉండును. కనిపించని బొమ్మ సీడి నుండి అది ప్లే అయినపుడు ఎట్లు కనిపిస్తున్నదో అట్లే మనలోపలయున్న కర్మ కనిపించకయున్నది. కర్మ అమలు జరిగినపుడు కార్యము కనిపిస్తున్నది. కార్యమునకు మూలసూత్రము కర్మ అని అది జరిగిన తర్వాత తెలియుచున్నదని గ్రహించవలెను. జరగకముందు తెలియని కర్మ, జరిగిన తర్వాత తెలియును. అలాగే మనలోనున్న కర్మ తెలియకయుండి ఆడించుచున్నది. ఆడింపబడిన తర్వాత కనిపించని కర్మను గురించి తెలుసుకోగల్గితే కనిపించని ఆత్మను గూర్చి కూడ తెలియగలవు.

సున్న : ఆత్మను తెలుసుకొంటే దేవున్ని తెలుసుకొన్నట్లేనా?

జలంధర్ : ఆత్మ దేవుడు కాడు. ఆత్మ దేవునిలోని భాగమే. ఒక భాగమును తెలుసుకొన్నంతమాత్రమున దేవున్ని తెలుసుకొన్నట్లు కాదు.

వెన్న : దేవుడు కల్పితమైనట్లు ఆత్మ కూడ కల్పితమే అని మేమంటాము. మీరేమంటారు?

జలంధర్ : రామాయణము విన్న తర్వాత సీతకు రాముడేమి అవుతాడన్నట్లుంది నీ ప్రశ్న. నేనేమంటానంటే ఆధారములేని మాటలు ఎన్నైన ఏమైన మాట్లాడవచ్చును. అలాగే మీ హేతువాదులు శాస్త్రబద్ధము అనుకొని ఎన్నో శాస్త్రబద్ధము కాని మాటలు మాట్లాడుచున్నారు. ఆత్మ అంటే అనిగియున్నదని అర్థము. నీలో నాలో అందరిలో ఆత్మ అనిగి యున్నది. దాచిపెట్టుకొన్న దానిని చూడలేని వారు హేతువాదులు, చూచినవారు సహేతువాదులు అనగా శాస్త్రబద్ధమైన కారణము తెలిసినవారు. హేతువాదము సగము తెలిసినవారు ఆత్మలేదు అనుచున్నారు. హేతువాదము పూర్తి తెలిసినవారు శరీరములోని ఎన్నో పనులకు ఆత్మ కారణమని ఆత్మ ఉన్నదని ఒప్పుకొంటున్నారు.

వెన్న : అయితే పని చేయకుండ స్తబ్దతగయున్న వైరస్‌కు కూడ ఆత్మ ఉన్నదా?

జలంధర్ : కదలని పదార్థములో శక్తియున్నదని మీరే ఒప్పుకొంటున్నారు శక్తిలోని భాగమే ఆత్మ. అందువలన ఆత్మశక్తి అని పేరు కూడ కలదు. పదార్థము అణువులో కూడ శక్తి కలదు. అది అభౌతికములో అయితే ఆత్మశక్తిగ, భౌతికములో అయితే రసాయనికశక్తిగ తెలియుచున్నది. కావున పదార్థములో అనిగి అర్థము అని పేరుగాంచిన శక్తియే దైవము అనియు అదియే భాగించబడితే పరమాత్మ, ఆత్మ, జీవాత్మ అనియు తెలియ బడుచున్నది.

సున్న : పదార్థములను 105 మూలకములుగ నేటి శాస్త్రజ్ఞులు కనుగొన్నారు కదా పూర్వము పెద్దలు కనుగొన్న 108 మూలకముల పేర్లు ఎవరైన ప్రకటించారా?

జలంధర్ : ప్రకటించలేదు.

సున్న : అలాంటపుడు 108 మూల పదార్థములున్నాయని పూర్వమెలా చెప్పగలిగారు?

జలంధర్ : ఆనాటి లెక్క వేరు, ఈనాటి లెక్కవేరు. పూర్వము 108 సంఖ్యతోనే ఆత్మజ్ఞానమును చెప్పుచువచ్చారు. ఆ సంఖ్య నాలుగు భాగములుగ విభజించి 27 నక్షత్రములని చెప్పారు. అవి ఈనాటికి జ్యోతిష్యశాస్త్రములో కలవు. అదే 108 సంఖ్యను 12 భాగములుగ విభజించి వాటినే గుణములు అన్నారు. అవి ఈనాటికి కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యములు అను ఆరు శత్రుగుణములుగ దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమలు అను ఆరు మిత్ర గుణములుగ శరీరములో గలవు. 12 గుణములను తొమ్మిదితో హెచ్చించి 108 ఉప గుణములు మన శరీరములో ఉన్నాయన్నారు. ఈ సంఖ్య ఆధారముతో లెక్కించి 108 కోట్ల సంవత్సరములు ప్రపంచ ఆయుస్సు అని కూడ తెలిపారు. ఒక్కొక్క మూల పదార్థమునకు ఒక్కొక్క కోటి సంవత్సరములు ఆయుస్సు ప్రకారము ప్రపంచ ఆయుస్సు మొత్తము 108 కోట్ల సంవత్సరములని తెలిపారు.

సున్న : ప్రపంచములోని మూల పదార్థముల పేర్లు చెప్పగలరా?

జలంధర్ : 108 మూలకములలో ఇప్పటికి శాస్త్రజ్ఞులకు తెలిసినవి 105 మాత్రమే ఇంతవరకు శాస్త్రజ్ఞులకు తెలియని పదార్థములు విశ్వములో ఇంకనూ మూడు గలవు. తెలిసిన వాటిని మాత్రము చెప్పగలము.

వెన్న : మూడు మూలకములు ఎందుకు తెలియలేదు?

జలంధర్ : అది శాస్త్రజ్ఞులను అడుగవలసిన ప్రశ్న. కనుగొన్న వరకే ఉన్నాయనుకొన్నారు. జరగబోయే కాలములో ఎప్పుడైన విశ్వములోని ఆ మూడు మూలకములను కనుగొనవచ్చును.

సున్న : ఇప్పుడున్న 105 మూలకములను చెప్పగలరా?

జలంధర్ : వరుసగ

| | | |
|---|---|---|
| 1) హైడ్రోజన్ | 2) హీలియం | 3) లితియం |
| 4) బెరీలియం | 5) బోరాన్ | 6) కార్బన్ |
| 7) నైట్రోజన్ | 8) ఆక్సిజన్ | 9) ఫ్లోరిన్ |
| 10) నియాన్ | 11) సోడియం | 12) మెగ్నీషియమ్ |
| 13) అల్యూమినియం | 14) సిలికాన్ | 15) ఫాస్ఫరస్ |
| 16) సల్ఫర్ | 17) క్లోరిన్ | 18) ఆర్గాన్ |
| 19) పొటాషియం | 20) కాల్షియం | 21) టిటేనియం |
| 22) స్కాండియం | 23) వెనేడియం | 24) క్రోమియం |
| 25) మేంగనీస్ | 26) ఐరన్ (ఫెర్రమ్) | 27) కోబాల్ట్ |
| 28) నికెల్ | 29) కాపర్ | 30) జింకు |
| 31) గేలియం | 32) జెర్మేనియం | 33) ఆర్సేనియం |

| | | |
|---|---|---|
| 34) వేలీనియం | 35) బ్రోమీన్ | 36) క్రిఫ్టాన్ |
| 37) రుబీడియం | 38) స్ట్రాన్షియం | 39) ఇట్రియమ్ |
| 40) సిర్కోనియం | 41) నియోబియం | 42) మాలిబ్డినమ్ |
| 43) టెక్నీషియం | 44) రుథెనియం | 45) రోడియం |
| 46) పెల్లేడియం | 47) నిక్వర్ (వెండి) | 48) కాడ్మియం |
| 49) ఇండియం | 50) టిన్ | 51) ఆంటిమోని |
| 52) టెల్లూరియం | 53) అయోడిన్ | 54) క్సినాన్ |
| 55) సేజియమ్ | 56) బేరియం | 57) లాంథనమ్ |
| 58) సీరియం | 59) రీసోడియం | 60) నియోడియం |
| 61) నోమడిమయం | 62) సామిరియం | 63) ఈరోషియం |
| 64) కడోలినియం | 65) టెర్బియం | 66) డిస్ప్రొజియం |
| 67) హోలియమం | 68) ఎర్బియం | 69) తులియం |
| 70) ఇడ్లేర్బియం | 71) టుటిషియం | 72) హాషీనియం |
| 73) టెన్టలు | 74) అంగటస్ | 75) రేనీయం |
| 76) అరటియం | 77) ఇరిడియం | 78) ప్లాటినం |
| 79) గోల్డు | 80) మెర్క్యూరి | 81) తెలియం |
| 82) లెడ్ | 83) బిస్మత్ | 84) బెర్లిషియం |
| 85) ఆస్టాటిన్ | 86) రేడాన్ | 87) ప్రాన్సియం |
| 88) రేడియం | 89) ఆక్టీనియం | 90) తోలియ్ |
| 91) పొటాలిటినియం | 92) యురేనియం | 93) నెప్టోలియం |
| 94) పుటోనియం | 95) అమెరిషియం | 96) క్యూరియం |
| 97) బెర్గ్లోయం | 98) కాలిఫోర్నియం | 99) ఇన్స్టేనియం |
| 100) బోమియం | 101) ఎండలీనియం | 102) నోపిలియం. |
| 103) లార్సెనియం | 104) కుర్బాథోనియం | 105) హానియం |

మిగత మూడు మూలకములను ఇంతవరకు కనుగొని పేర్లు పెట్టలేదు. కనుగొననంత మాత్రమున మిగత మూడు లేవనుకోకూడదు. కొందరు శాస్త్రజ్ఞులు అరుదైన మూలక పదార్థములు ఇంకనూ కొన్ని కలవు అన్నారు, ఎన్ని అయినది ఖచ్చితముగ చెప్పినట్లు లేదు. ఏది ఏమైన మా లెక్క ప్రకారము 108 మూలకములు గలవు.

ఆచారి : మీరు ఎన్ని చెప్పిన మూలకములను గురించి ఒప్పుకోగలము. కాని దేవున్ని గురించి ఒప్పుకోము.

జలంధర్ : దేవున్ని గురించి ఒప్పుకోక పోయిన పరవాలేదు. కాని నీవు ఉన్నావని నిన్ను గురించి నీవు ఒప్పుకోగలవు కదా!

ఆచారి : నేను ఉన్నాను, నేను ఆచారిని అని ఒప్పుకోగలను.

జలంధర్ : ఆచారి అన్నది పుట్టిన తర్వాత కొద్ది రోజులకు పెట్టిన పేరు. పేరు పెట్టకముందు నీవు ఎవరివి? నీ గుర్తింపుకు పెట్టినది పేరు, పేరును ప్రక్కన పెడితే నీవు ఎవరో చెప్పగలవా?

ఆచారి : పేరు లేకపోతే నేను నేనే అయితాను.

జలంధర్ : ఆ నేను ఎవరు?

ఆచారి : నేను శరీరమును, శరీరమునే నేను అంటున్నాను.

జలంధర్ : శరీరము నీవు చనిపోయిన తర్వాత కూడ ఉన్నది. శరీరము వేరు నీవు వేరు. నీవులేని శరీరమును శవము అంటున్నాము. అపుడు శవము నేను ఆచారిని అనుటకు వీలులేదు. బ్రతికిన శరీరములో నీవు ఒక భాగమై ఉన్నావు. ఆ బ్రతికియున్న నీవు ఎవరు?

ఆచారి : ఇట్లడిగితే ఎవరని చెప్పాలి? ఏమని చెప్పాలి?

జలంధర్ : అడిగితే చెప్పలేనిది అజ్ఞానము అంటాము. ఏ ప్రశ్నకైన జవాబు చెప్పగలడమే జ్ఞానము. తెలియనితనమే అజ్ఞానము. నీకు తెలియని జ్ఞానము ఉన్నది కనుక నీవు జవాబు చెప్పలేక పోవుచున్నావు.

ఆచారి : ఈ ప్రశ్నలకు నీవు జవాబు చెప్పగలవా?

జలంధర్ : చెప్పగలను. నీవు అన్నవాడివే జీవాత్మవు. జీవాత్మవైన నీవు శరీరములోపల నివశిస్తున్నావు. జీవాత్మవైన నీకు ఆకారము, పరిమాణము గలదు. ఆకారము పరిమాణము గల నీకు జీవాత్మ అను పేరు కూడగలదు. పేరు, ఆకారము, పరిమాణము కల్గియున్న నీవు నిన్ను మరచిపోయి నేను నాస్తికుడను అనుకొంటున్నావు. నాస్తికుడవై నిన్ను నీవు తెలియలేకున్నావు. నీకు కష్టసుఖ అనుభూతులు కూడ కలవు. కష్టసుఖ అనుభవములను అనుభవిస్తున్న నీవు చింతించడము సంతోషించడము కూడ చేయుచున్నవు. ఇన్ని విషయములను తెలియక నేను ఆచారిననుకోవడము పొరపాటు కాదా!

ఆచారి : నేను కష్టసుఖ అనుభవములను అనుభవిస్తున్నాననడము నిజమే. అంతమాత్రమున నాకు ఆకారము, పరిమాణము, పేరు ఉన్నాయనడము ఇప్పటికి నమ్మలేకున్నాను.

జలంధర్ : నమ్మకము వదిలి చెప్పినవన్ని అనుభవమునకు తెచ్చుకో. అనుభవమునకు తెచ్చుకొనేదానికి జ్ఞానము అవసరము. జ్ఞానము తెలిసిన తర్వాత నీవే నిన్ను గురించి జవాబు చెప్పగల స్థోమతకు రాగలవు.

ఆచారి : అయితే నేనిపుడు ఏమి చేయాలి?

జలంధర్ : నేను నాస్తికుడను, దేవుని జ్ఞానమును వినకూడదు అనుట మానుకొని, దేవుడు లేదు అను హద్దును తుడచివేసుకొని, నాకు తెలియనిది ఎంతోకలదని, తెలియనిది తెలుసుకోవలెనను ఉద్దేశ్యము కలిగి తెలుసుకొనుటకు

ప్రయత్నించుము. అపుడు సర్వము అర్థము కాగలదు, అనుభవమునకు రాగలదు.  అపుడు నీవు ముందు ఎంత అజ్ఞానములో ఉంటివో ఎంత జ్ఞానములోనికి వచ్చావో నీకే అర్థము కాగలదు.

వెన్న : మా అన్నగారివలె దేవతా పూజ చేయవలసియుంటుందా?

జలంధర్ : దేవతా పూజ మంచిదికాదని ముందే మీ అన్నగారికి చెప్పాను గదా!

పంచదార : మేము ఇప్పటినుండి చిల్లర దేవుళ్లను వదలి అసలైన పరమాత్మ జ్ఞానము తెలుసుకొంటాము.

సున్న : మేము కూడ ఇప్పటినుండి జవాబులేని హేతువాదము, నాస్తికవాదము వదలి అసలైన జవాబు వాదమైన పరమాత్మ జ్ఞానమునే తెలుసుకొంటాము.

ఇలా ఇంటిలోని వారందరు జలంధర్ మాటలకు ఒక ఉద్దేశ్యములోనికి వచ్చి  ఇంతవరకు వారికున్న ఆస్తికవాదము, నాస్తికవాదము సరైనవికావని ఇప్పటినుండి అసలైన దైవమార్గమును శాస్త్రబద్ధముగ అనుసరించాలనుకొన్నారు.  ఆ కుటుంబములోని రెండు గుంపులుగనున్న ఆరుమంది ఒక్క గుంపుగ తయారై దైవ అన్వేషణలో పడినారు.  తమలోని సంశయములను తీర్చి దైవజ్ఞానమువైపు మరల్చినందుకు జలంధర్‌కు కృతజ్ఞతలు తెలుపుకొన్నారు.

P PMP P

# అయితే ఒకటి మేలు,  కాకపోతే రెండు మేలు

అనేక సంవత్సరముల పూర్వము శంఖుదత్త అనే ఒక యోగి అడవిలో నివశిస్తూవుండెను.  అతను యుక్తవయస్సులోనే అడవిలో చేరి పోవుట వలన ప్రపంచ విషయముల అవగాహన చాలా తక్కువగ యుండెను. అతనికి అడవిలో క్రూరజంతువులు సహితము మచ్చికగ ఉండుటవలన అతని కాలమంతయు ఏ విధ కష్టములు లేకుండ జరిగి పోవుచుండెను.  ఒకనాడు ఆ దేశము యొక్క రాజు వేటకై అడవికి వచ్చి పులిని తరుముచు వచ్చెను. పులి రాజు బారినుండి తప్పించు కొనుటకై పరుగిడుచు శంఖుదత్తుని వద్దకు వచ్చెను.  శంఖుదత్తుడు దానిని చూచి దానికి భయము తీరునట్లు దగ్గరచేర్చుకొని తలమీద నిమురుచుండెను.  పులి చిన్నతనము నుండి శంఖుదత్తుని వద్దనే పెరిగినది కావున అపాయస్థితిలో అది అక్కడికే చేరినది. కొంతసేపటికి తరుముచున్న రాజు కూడ అక్కడికి చేరాడు. పులి శంఖుదత్తునివద్ద ఉండుట చూచి ఆశ్చర్యపోయాడు.  పులి కూడ రాజును చూచి గాండ్రించింది.  పరిస్థితి గ్రహించిన శంఖుదత్తు పులిని ఓదార్చి రాజువైపు తిరిగి ఇలా అన్నాడు.

శంఖుదత్తుడు :- మీరెవరు?పులిని ఎందుకు చంపబూనినారు?

రాజు :- నాపేరు సువర్ణమహారాజు, నేను సువర్ణరాజ్యానికి రాజును.  వేటాడుట నా సరదా అందువలననే ఈ పులిని వేటాడపూనినాను.

శంఖుదత్తుడు :- నీవు రాజేకావచ్చు, రాజ్యానికి అధిపతివే కావచ్చు, అయినంతమాత్రమున జంతువులను వేటాడుట తగని పని, ఈ పులి  నీకేమి అపకారము చేసింది?

రాజు :- చెప్పానుగ వేట నా సరదాయని.

శంఖుదత్తుడు :- వేట అంటే జంతువులను హింసించి చంపడమా? దీనిని వేట అనరు హింస అంటారు. ఆత్మను హత్య చేయడమంటారు. దాని వలన నీకు భయంకర పాపమొస్తుంది.

రాజు :- ఏమిటి నా చర్యనే తప్పు పట్టడమా! క్రూర జంతువును చంపడము ఆత్మ హత్యయగునా! ఇంతకు నీవెవరు? నాకు నీతులు చెప్పుచున్నావు.

శంఖుదత్తుడు :- తప్పు సామాన్యునికైన రాజుకైన సమానమే. నీ వెంత రాజువైన ఏమాత్రము ఆత్మజ్ఞానము లేనివానివి. అందువలననే నేను జ్ఞానము చెప్పితే నీవు నీతులు అంటున్నావు. నీతికి జ్ఞానానికి తేడా కూడ తెలియని వానివి నీవు రాజ్యానికి రాజువా?

ఆ మాటలు విన్న రాజు ఒక్కసారి ఆశ్చర్యపోయాడు. ఏమాత్రము జంకు లేకుండ రాజునైన తననే మందలించి చెప్పినవాడు సామాన్యుడుకాదని గ్రహించి, ఆయనయందేదో గొప్పతనమున్నదని తెలిసినవాడై వినయముగ ఇలా అనెను.

రాజు :- తమరెవరో గొప్పవారుగనున్నారు. నాదేదైన తప్పువుంటే మన్నించమని కోరుచున్నాను. ఇంతకు మీరెవరు? మీరు ఇక్కడెందు కున్నారు. దయచేసి తెలుపండి.

శంఖుదత్తుడు :- నా పేరు శంఖుదత్తుడు. నాకు చిన్నతనములోనే తల్లి తండ్రులు చనిపోయారు. వేరెవరో నన్ను దత్తుకు తీసుకొని పెద్దవాడిని చేశారు. దత్తు కుమారుడినని శంఖుదత్తు అని పేరు పెట్టారు. నాకు యుక్తవయస్సు వస్తూనే నా తలలో అనేక ఊహలురాసాగాయి. ప్రపంచ విషయాలు సర్వసాధారణమని పరమాత్మ విషయములే అసాధారణమని గ్రహించిన నేను ప్రపంచ విషయముల మీద మక్కువ తగ్గించుకొని పరమాత్మ విషయముల అవగాహన కొరకు అడవి మధ్యకు వచ్చాను. అప్పటినుండి క్రూరజంతువులను సహితము ఆదరణగ చూస్తు అన్నిటిలోవున్న ఆత్మ ఎలా ఉన్నదని ఆత్మ విషయములనే పరిశోధిస్తున్నాను. మోక్షము పొందాలనుకొంటున్నాను.

రాజు :- మీరు కోరినట్లు మీ ఆశయము నెరవేరితే పరవాలేదు. ఒకవేళ మీరు మోక్షము పొందలేకపోతే మీ శ్రమంత నిరర్థకమే కదా! మీకేమి మేలు.

శంఖుదత్తుడు :- అయితే ఒకటి మేలు, కాకపోతే రెండుమేలు.

ఆ మాట విన్న రాజుగారికి ఏమి అర్థము కాలేదు. మోక్షమొస్తే ఒకటి మేలేమిటి, అది రాకపోతే రెండు మేలేమిటని అర్థము కాని స్థితిలో శంఖుదత్తునివైపు చూచాడు. రాజుగారికి తనమాట అర్థము కాలేదని గ్రహించిన శంఖుదత్తుడు నవ్వుచు ఇలా అన్నాడు. నీవెంత రాజువైన నీకర్థముగాని విషయములు చాలా ఉన్నాయి. ఇందాక పులిని చంపడము ఆత్మహత్య అన్నాను. అది ఆత్మ హత్య ఎలా అవుతుందని నీకు సంశయము వచ్చింది. అదియు అర్థము కాలేదు. నీవు ఒక దేవున్ని ఆరాధిస్తున్నావు. నీవు ఆరాధిస్తున్నది దేవున్ని కాదు దయ్యమును అని నేనంటే అసలుకు నీకేమి అర్థము కాదు. అరువది నాల్గు విద్యలు నేర్చిన నీకు ఇది ఏ విద్యయో కూడ అర్థము కాదు. ఇపుడు నీకేమి చెప్పిన అన్ని వింతగానే కనిపిస్తాయి. నేను చెప్పిన నీవు గ్రహించుకొను స్థితికి రావాలంటే నీ మెదడు కొంత పరిపక్వత చెందాలి. అలా పరిపక్వత కావాలంటే నీవు కొంత కాలము తెలియని వాటిని తెలుసుకోవాలను తపనలోవుండాలి. అపుడు శాస్త్రబద్ధమైన, హేతుబద్ధమైన విషయములను గ్రహించుకొను స్థితికి నీవు చేరుకోగలవు.

ఆ మాటలు విన్న సువర్ణ మహారాజు తనకెంతో తెలియనిది ఉన్నదని గ్రహించినవాడై సర్వము తెలియాలనుకొని శంఖుదత్తుని ఇలా అడిగాడు.

రాజు :- మీరు మహాపురుషులు. ఇక్కడ మీద్వార నాకు కొంత జ్ఞానోదయమైనది. నాకు ఎన్నో తెలియని విషయములు గలవు. అందువలన మిమ్ములను గురువుగ భావించి మీ ద్వార దైవజ్ఞానమును తెలుసుకోవాలనుకొన్నాను. నా మీద దయయుంచి నన్ను మీ శిష్యునిగ స్వీకరించమని ప్రార్థిస్తున్నాను.

శంఖుదత్తుడు :- నీ ఉద్దేశ్యము మంచిదే. నా శిష్యునిగ నిన్ను చేర్చుకోవడములో తప్పులేదు. నాకిష్టమొచ్చినప్పుడు నేనే నీ వద్దకు వస్తాను. అపుడు సంపూర్ణబోధ నీకు లభించగలదు. అంతవరకు ఇదే పట్టుదలతో ఉండుము. అయితే ఒకటి లాభము, కాకపోతే రెండు లాభము, ఇక ఇంటికి పొమ్ము అన్నాడు.

శంఖుదత్తుడు మాటల సందర్భములో ఒకమారు అయితే ఒకటి మేలు, కాకపోతే రెండు మేలు అన్నాడు. ఇపుడేమో అయితే ఒకటి లాభము, కాకపోతే రెండు లాభము అన్నాడు. అయితే ఒకటి, కాకపోతే రెండు అనడములోని అంతరార్థము ఇపుడు మనకుగాని అపుడు ఆ రాజుకుగాని అర్థముకాలేదు. శంఖుదత్త గురువుగారు తన ఇష్ట మొచ్చినపుడు తానే చెప్తానన్నాడుగ వేచి చూస్తాము.

కొంతకాలము గడచిన తర్వాత శంఖుదత్తుడు అడవి వదలి సువర్ణరాజ్యమువైపు బయలుదేరాడు. సువర్ణరాజ్యములో అన్ని మతముల వారు గలరు. మొదట ఒక పట్టణము చేరిన శంఖుదత్తునికి ఆ పట్టణములో ఒక క్రైస్తవ వ్యక్తి మరొక ముస్లిమ్ వ్యక్తితో తగాదా పడుచుండుట కనిపించినది. వారితగాదా ఏమిటని చూడగ వారిరువురు నామతము గొప్ప నా దేవుడు గొప్ప అని వాదించుచుండిరి. అక్కడున్న మిగతావారు అనేకమంది కోడి పందెమాట చూస్తున్నట్లు చూస్తుండిరేగాని వారెవరి వాదనను సమర్థించడము లేదు. అక్కడికి చేరిన శంఖుదత్తుడు వారి వాదన సారాంశమేమిటో చూడాలనుకొన్నాడు. ఎడతెరిపిలేని వారి వాదన చూచి వారితో ఇలా మాట్లాడజొచ్చాడు.

శంఖుదత్తుడు :- అయ్యా బాషాగారు నీ ముఖ్య ఉద్దేశ్యము తెల్పుము.

బాషా :- అల్లా తప్ప మిగతా దేవుడేలేడని నేనంటున్నాను. దానికి ఈయన యెహోవానుమించిన దేవుడులేడని అంటున్నాడు. మా పవిత్ర గ్రంథములో ఖురాన్‌నుమించిన బోధలుగాని, అల్లానుమించిన దేవుడుగాని లేడని చెప్పబడినది. దానిని తప్ప మేము వేరు దేవున్ని ఒప్పుకోము. ఈయన నన్ను ఒప్పించాలని చూస్తున్నాడు.

వెంటనే జాన్‌గారు ఇలా అన్నారు.

జాన్ :- మీది పవిత్రగ్రంథమైతే మాది పరిశుద్ధగ్రంథము. మా గ్రంథములో ప్రపంచము మొత్తమునకు యెహోవాయే దేవుడని చెప్పబడి వున్నది. మీ గ్రంథముకంటే మాగ్రంథము ముందే వ్రాయబడివున్నది. దీనికి మీరేమంటారు చెప్పండి అని శంఖుదత్తుని అడిగాడు.

శంఖుదత్తుడు నోరు విప్పకనే ప్రక్కనేవున్న హిందూవైశ్యుడు జోక్యము చేసుకొని మీ ఖురాన్‌కంటే, బైబిలుకంటే, మీ రెండు మతములకంటే ఎంతో ముందు మా హిందూమతము పుట్టింది. విష్ణువును మించిన దేవుడెవడులేడు. మీరు మా దేవుడు గొప్ప, మా గ్రంథము గొప్ప అనుకొనిన ఏమి ప్రయోజనము లేదు. అందరికంటే హిందూ మతము

అందులో విష్ణువు గొప్పవాడు. ఈ విషయమును ఎన్నో పురాణములు ఉద్భోదించాయి అన్నాడు. మూడు మతములవారు చెప్పిన మాటలను వినిన శంఖుదత్తుడు ఇలా అనసాగాడు.

శంఖుదత్తుడు :- మీరు ముగ్గురు మూడు రకముల దేవుళ్ళను ప్రస్తావించి మాదేవుడు గొప్ప, మాదేవుడు గొప్పని చెప్పడము జరిగింది. నిజానికి ఏ దేవుడు గొప్పో తెలుసుకోవలసిన అవశ్యకత ప్రజలందరికి ఉన్నది. అలా వివరము తెలియనపుడు ఆ తెలియని తనముచే వారు వారు అనుసరిస్తున్న మార్గములను బట్టి ఇతరుల మీద ఇతర మతముల మీద ద్వేషము పెంచుకోవడము జరుగుతుంది. దానివలన ఒక మతము వారు మరొక మతమును లేకుండ చేయాలనుకుంటారు. ఇతర మతముల వారంత వారి దేవునికే వ్యతిరేఖులని భావిస్తారు. తామే నిజమైన భక్తులమనుకొని తమ దేవునికి వ్యతిరేఖులైన వారిని లేకుండ చేయడమే నిజమైన భక్తి అనుకొనుట వలన మనుషులలో హింస చెలరేగుచున్నది. దేవుడంటే ఎవడని తెలియక, ఏ మతమునకు ఆ మతమువారు తమ దేవుడే గొప్పనుకోవడము వలన, ఇతర మతముల వారిని దేవుని వ్యతిరేఖులుగ లెక్కించుకోవడము వలన, మతమౌఢ్యము పెరిగి పోవుచున్నది. ఎవరిది నిజమైన భక్తియో ఎవరు నిజమైన దేవుడో తెలియాలంటె ముందు నేను చెప్పు ఒక విషయమును ఆలోచించి చూడండి. తర్వాత ఎవరి దేవుడు నిజమైనవాడో మీరందరు ఒప్పు కోవచ్చును. ఇంతవరకు ఎందరో స్వామీజీలకు గురువులకు మత పెద్దలకు తెలియని విషయము ఒక షరతు మీద తెలుసుకొందాము. ఆ షరతు మీకు ఒప్పుదలయైతేనే నేను విషయము చెప్పెదను. మీకు ఒప్పుదలకాకపోతే ఏమి చెప్పక వదలి వేస్తాను.

శంఖుదత్తుని ఆ మాటలు విన్న మూడు మతములవారు ఏమిటా షరతని అడిగారు.

శంఖుదత్తుడు :- తాము అనుసరిస్తున్న మతముకంటే వేరు విధానము లేక మతము సరియైనదని తెలిసినపుడు మరియు తాము విశ్వసిస్తున్న దేవునికంటే వేరు విధానములో ఉన్న దేవుడు అత్యున్నతుడని తెలిసినపుడు ఏదైతే సత్యమో ఆ సత్యాన్నే అనుసరించి తాము తలచిన మార్గమును అనగా తాము వాదిస్తున్న మార్గమును వదలి సత్యమార్గమును గూర్చి వాదిస్తామని మీరు ఒప్పుకొంటే నేను చెప్పగలను. మూడు మార్గములలో ఏ మార్గము సరియైనదైన మిగతవారు దానినే అనుసరించవలెను. ఒకవేళ అన్నిటికంటె మించిన పద్ధతి వేరొకటుండిన దానిని గూర్చి యోచించి సత్యము తెలుసుకొని ఆ మార్గమునే అనుసరిస్తాము అని ఒప్పుకుంటె నేను మాట్లాడగలను. ఒకవేళ నా మాటలలో సత్యము లేకపోతే ఎవరి మతమును వారు అనుసరించవచ్చును.

శంఖుదత్తుని మాటలు వినిన ముగ్గురు నాదే సరియైన మార్గము కావున మిగతావారు ఈ నిబంధన ప్రకారము నా మతమునే అనుసరించవలసి వచ్చును. కావున ఇతని షరతుకు ఒప్పుకొని విందామని అనుకొన్నారు. ఈ విధముగ వారివారి నమ్మికల ప్రకారము నా మతమే గొప్పదవుతుందని వారివారి మదిలో వారు అనుకొని శంఖుదత్తుని షరతుకు అందరు ఒప్పుకొన్నారు. అపుడు శంఖుదత్తుడు ఈ విధముగ చెప్పను మొదలుపెట్టెను.

శంఖుదత్తుడు :- కళింగ అను ఒక దేశములో నలుడు అనునతడు మంచి పేరు ప్రఖ్యాతులు గడించియుండెను. ఆ దేశములో శిల్పకళలో అతనినిమించిన వారెవరు లేరు. అంత గొప్ప విద్యగల అతనికి ఒక శిష్యుడు గలడు. ఆ శిష్యునికి నలుడే ఆర్యుడని పేరు పెట్టాడు. ఆర్యునికి తన శిల్పకళను నేర్పెను. ఆర్యుడు తన గురువంతటి వాడు కాకపోయిన శిల్పకళలో కొంత ప్రత్యేకత కల్గియుండెను. శిష్యుని పనిలో కొంత తృప్తి కల్గిన నలుడు ఉన్నదంత శిష్యునికి అప్పజెప్పి ఒక రోజు చెప్పకుండ త్రిలింగ దేశానికి పోయాడు. పోవునపుడు మొదటినుండి తన అనుచరునిగ

వున్న వ్యక్తిని కూడ పిలుచుకొనిపోయెను. త్రిలింగ దేశమున నలుడు తన పేరుకు మరొక అక్షరమును చేర్చి మనలుడు అను పేరుతో చలామణి అవసాగెను. అక్కడ కూడ తన శిల్పకళ నైపుణ్యముచే పలువురిచే మెప్పుపొందెను. కళింగ దేశములోవలె త్రిలింగ దేశములో కూడ ఒక శిష్యుని తయారు చేసి తన విద్యను దారపోశాడు. ఇక్కడ కూడ శిష్యునికి తానే పేరు పెట్టాడు. కళింగ దేశములో తన శిష్యునికి ఆర్యుడని పేరు పెట్టిన మనలుడు ఇక్కడ త్రిలింగ దేశములో ఆ పేరుకు ఒక అక్షరమును చేర్చి అనార్యుడు అని పేరు పెట్టాడు. ఇక్కడ విశేషమేమిటంటే కళింగ దేశములో ఉన్న మొదటి శిష్యునికి గురువుగారు త్రిలింగ దేశమునకు పోయిన విషయముగాని, అక్కడ పేరు మార్పిడితో వున్న విషయముగాని, అక్కడ మరొక శిష్యుడున్న విషయముగాని తెలియదు. ఆ శిల్పకళ గురువు అక్కడ కూడ కొంత కాలముండి ముందు మాదిరే అచట కూడ చెప్పకుండ తన అనుచరునితో మరొక దేశమైన అనంతలింగ అను దేశమునకు పోయి అక్కడ కూడ పేరు మార్పిడితో మెలగసాగెను. కళింగదేశములో నలుడైనవాడు త్రిలింగ దేశములో మనలుడని తర్వాత అనంతలింగమను మూడవ దేశములో అమనలుడని పేరుతో ఉండెను. అనంతలింగ దేశములో కూడ శిల్పకళలో తనకు సాటి ఎవరు లేరని నిరూపించి అచట కూడ ఒక శిష్యుని తన విద్యలో తయారు చేసెను. అక్కడి శిష్యునికి కూడ తానే పేరు పెట్టెను. త్రిలింగ దేశములో అనార్యుడని శిష్యునికి పేరు పెట్టినవాడు అనంత లింగదేశములో కూడ ఒక అక్షరమును పెంచి అమనార్యుడు అని పేరు పెట్టాడు.

ఈ విధముగ శిల్పకళానైపుణ్యి మూడు దేశములలో నివశించి, మూడు దేశములలో మూడు పేర్లతో చలామణియై, ముగ్గురు వేరు వేరు పేర్లు కల్గిన శిష్యులను తయారు చేశాడు. విశేషమేమిటంటే తన పేరు మారిన ఊరు మారిన శిష్యుని మారిన అనుచరుడు మాత్రము ఒక్కడే ఉండెను. ఆ అనుచరునికి తన యజమాని కళింగ, త్రిలింగ, అనంత లింగ దేశములలో ఉన్నది తెలుసు. అలాగే నలుడు, మనలుడు, అమనలుడు అను పేర్లతో వుండినది కూడ తెలుసు. మూడు దేశములలో మూడు పేర్లలో ఉన్న తన యజమానికి ఆర్యుడు, అనార్యుడు, అమనార్యుడు అను పేర్లుగల శిష్యులున్నది కూడ తెలుసు. ఆ శిల్పకళా నైపుణ్యి అనుచరునికి తెలిసినట్లు ఆయన శిష్యులకు గురువుగారి విషయము తెలియదు.

అనంతలింగ దేశములో అమనలుడని పేరుతో ఉండిన శిల్పి ఆ దేశమును కూడ వదలి వేరొక దేశమునకు పోయి అక్కడ తనువును చాలించెను. శిల్పి మరణము ఆయన అనుచరునికి తప్ప మిగత శిష్యులకు కూడ తెలియదు. శిల్పి పోయిన ఆయన శిష్యులు శిల్పకళతో గురువుగారి పేరు చెప్పుచు గురువుగారినే ఆరాధిస్తు కాలము గడుపు చుండిరి. ఒక దినము కళింగ, త్రిలింగ, అనంతలింగ దేశములలోని శిష్యులు ముగ్గురు ఒకచోట కలిశారు. ఆర్యుడు, అనార్యుడు, అమనార్యుడను పేర్లు కలిగిన వీరు తాము ఒకే గురువు శిష్యులమని తెలియదు. వారి మధ్య శిల్పకళను గురించిన వాదోపవాదములు బయలు దేరినవి. వారు నా గురువు మించిన వాడులేడు నా విద్యను మించినది లేదని వాదించను మొదలు పెట్టారు. వాస్తవానికి ముగ్గురు శిష్యులు ఒకే గురువుకు చెందినవారని వారికి తెలియకపోవడము వలన, నిజముగ వారి గురువు శిల్పకళలో నైపుణ్యము కలవాడు కావున మా గురువే గొప్ప అని ఎవరంతకు వారు వాదించుచుండిరి. నా గురువును మించిన గురువే లేడని కళింగదేశపు ఆర్యుడు చెప్పగ, అదే విధముగ త్రిలింగ దేశము యొక్క అనార్యుడు కూడ అందరి గురువులకన్న నాగురువు గొప్పవాడని చెప్పెను. అనంతలింగ దేశముయొక్క అమనార్యుడు కూడ నా గురువు అమనలుడు మించినవాడు దేశములోనే లేడని చెప్పెను. ముగ్గురు మాట్లాడునది వాస్తవమే అయినప్పటికి ముగ్గురి గురువు ఒక్కడేనను వివరము ఎవరికి తెలియకపోయినది. వారి వాదన అంతటితో ఆగక తీవ్రతరము

దాల్చినది. ఈ ముగ్గురి వాదనలో నా ఒక్కనిదే సరియైనదని మిగత ఇద్దరిది సరియైనవాదన కాదని ఎవరంతకు వాల్లు అనుకోవడము వలన ముగ్గురు తమతమ వాదనే సత్యమనుకొనుచుండిరి. **"ఇపుడు ఎవరి గురువు గొప్పవాడని, ఎవరి వాదన సరియైనదని మీరనగలరు."** అని శంఖుదత్తు అడిగిన మాటలు క్రైస్తవుడైన జాన్, ముస్లీమ్ అయిన బాషా, హిందూవైశ్యుడు విని ఇలా అనగలిగారు.

**జాన్** : ముగ్గురి గురువు ఒక్కడే కదా.

**బాషా** : ముగ్గురి గురువు పెద్దవాడే.

**వైశ్యుడు :** ఇక్కడ పలానావాని గురువు ప్రత్యేకము అనేదానికి లేదు. వారనుకున్నట్లు ముగ్గురి వాదన సరియైనదే. వారి వారి గురువు వేరు వేరు కాదు కావున ముగ్గురి గురువు గొప్పవాడే అనవచ్చును.

శంఖుదత్తు : మనకు ముగ్గురి గురువు ఒక్కడేనన్న విషయము తెలుసు, వారికి తెలియదు కదా! ఒకరి గురువు గొప్పవాడైతే మరియొకరి గురువు తక్కువవాడేనని కదా వారి వాదన. ముగ్గురు మా అందరి గురువు ఒక్కడేనని ఒప్పుకొన్నపుడు కదా సమస్య లేకుండ పోవునది. వారిని ఒప్పించుటకు ఏదైన మార్గము కలదా?

జాన్ : ఆ గురువే వచ్చి నేను మీ ముగ్గురికి గురువునని చెప్పాలి.

శంఖుదత్తు : గురువు చనిపోయాడు, లేడు. అతను వచ్చి చెప్పుట అసాధ్యము.

బాషా : ఇక్కడొక మార్గము కలదు. గురువు బ్రతికియున్నపుడు ఉండిన గురువు అనుచరుడు ఒకడున్నాడు కదా! ఆయన చనిపోలేదు కదా!

వైశ్యుడు : అవును గురువుగారి అనుచరుడు కళింగ, త్రిలింగ, అనంత లింగ దేశములను చూచాడు, అలాగే ఆయా దేశములలో శిష్యులైన ఆర్యుడు, అనార్యుడు, అమనార్యుడు అను వారిని చూచాడు. మరియు మూడు దేశములలో గురువుగారు నలుడు, మనలుడు, అమనలుడు అను పేర్లతోయుండినది చూచాడు. అన్ని తెలిసిన గురువుగారి అనుచరుడు వచ్చి చెప్పితే ఆ సమస్య తెగిపోతుంది.

శంఖుదత్తుడు : ఎలాగ అన్ని తెలిసిన గురువుగారి అనుచరుడు చెప్పితే వారి సమస్య తెగిపోతుందో అలాగే మూడవవాడైన ఒక వ్యక్తి చెప్పితే మీ సమస్య తెగిపోతుంది.

బాషా : అటువంటి వ్యక్తి ఎవరైన ఉన్నాడా?

జాన్ : అదంటే గురువుగారి విషయము ఇది దేవుని విషయము కదా!

వైశ్యుడు : అక్కడైతే మూడు దేశములను, మూడు శిష్యుల పేర్లను, మూడు గురువుల పేర్లను తెలిసిన వ్యక్తి కాబట్టి చెప్పాడు. ఇక్కడ కూడ మూడు మతముల దేశములను, మూడు మతముల పేర్లను, మూడు మత దేవుల్లను తెలిసిన జ్ఞాని కావాలి కదా!

శంఖుదత్తుడు : మూడు దేశములను, మూడు మతములను, మూడు దేవుళ్ళను తెలిసిన జ్ఞానిని త్రిజ్ఞాని అంటాము. అటువంటి త్రిజ్ఞాని ఈ దేశములో మనకు సమీపములోనే కలడు. ఆయన తన త్రిజ్ఞానము చేత మీ సంశయమునకు జవాబు చెప్పగలడు. అక్కడికి పోతే మీ సమస్య తెగిపోతుంది.

వారి వాదము తీవ్రతరమైనది కావున దానికి పరిష్కారము తెలుసుకోవలెనను పట్టుదలతో శంఖుదత్తుని వెంట ముగ్గురు బయలు దేరివెళ్ళారు. అక్కడికి సమీపములోనే ఒక చిట్టడవి. అందులో ఒకే ఒక మర్రి వృక్షము ఎత్తుగ పెరిగి ఊడలు దిగి విశాలముగ వ్యాపించి యున్నది. అక్కడ చాలాకాలమునుండి ఒక వ్యక్తి ఆ చెట్టు క్రిందనే ఉన్నాడని అందరు అనుకొనెడివారు. ఈ నలుగురు మర్రిచెట్టుక్రింద యున్న వ్యక్తి దగ్గరకు పోయారు. అక్కడ పోయి చూస్తే అక్కడున్న మనిషిలో ఏ ప్రత్యేకత కనిపించలేదు. ఈయనా ఇంత పెద్ద సమస్యకు జవాబు చెప్పునది. ఈయనకు త్రిజ్ఞానము తెలియునా అనుకొన్నారు జాన్, బాషా, వైశ్యుడు. శంఖుదత్తుడు అక్కడున్న వ్యక్తికి నమస్కరించి వీరి సమస్య ఇది. దీనికి మీరే తగిన సమాధానము ఇవ్వగలరని అడిగాడు అందులకాయోగి చిరునవ్వు నవ్వి కూర్చొనమని సైగ చేశాడు. ఏమిటి మీ సమస్య అన్నట్లు వారి వైపు చూచాడు.

శంఖుదత్తుడు : వీరికి త్రిజ్ఞానము అంటే ఏమిటో మొదట చెప్పాలి స్వామిగారు.

యోగి : సర్వ దేశములను, సర్వ కాలములను, సర్వ వ్యక్తులను తెలిసిన వారిని త్రిజ్ఞాని అంటారు.

శంఖుదత్తుడు : ప్రస్తుత కాలములో జగతిలో త్రిజ్ఞాని మీరొక్కరేగలరని తెలుసుకొన్న నేను వీరి సంశయము తీర్చుటకు తమ చెంతకు తీసుక వచ్చాను.

యోగి : మీ సమస్య మీరు చెప్పకనే తెలియుచున్నది. నేను ఒక మాట అడుగుచున్నాను. మీకు మనుషులకు దేవుడెవరో కావాలా? మతమునకు దేవుడెవరో కావాలా?

అంతవరకు అమాయకుడనుకున్న యోగిని ఆ మాటతో ఏదో గొప్పతనమున్న వ్యక్తిగ మిగత ముగ్గురు లెక్కించుకొన్నారు.

శంఖుదత్తుడు : స్వామిగారు! వీరు ముగ్గురు మూడు మతములకు చెందిన వారు. మా మతము దేవుడు గొప్ప అని ఒకరు అంటే మిగతవారు కాదు మా మతము దేవుడు గొప్ప అంటున్నారు. వీరి మతములకు దేవుడెవరైనది తెలుపవలెను.

యోగి : మతములో ఉన్నది మనుషులే కావున మనుషులకు దేవుడు ఎవరో తెలిసితే మతమునకు కూడ తెలియును.

మతము వేరైనంతమాత్రమున మనుషులు వేరుకాదు కదా! మనుషులందరు ఒక్కటే దేవుడందరికి ఒక్కడే. మీరు శంఖుదత్తుడు చెప్పగ వినిన కథలోలాగ హిందూమతమును **భారతదేశములో, ఇజ్రాయిల్ దేశములో క్రైస్తవమతమును, అరబ్‌దేశములో ఇస్లామ్‌మతమును తయారు చేసినవాడు ఒక్కడే.** ఒక్కడే నలుడు, మనలుడు, అమనలుడులాగ మూడు దేశములలో ముగ్గురి శిష్యులను తయారు చేసినట్లు, ఒక్క దేవుడే మూడు దేశములలో మూడు మతములను తయారు చేశాడు. ముగ్గురికి ఒక్కడే గురువని ఆర్యుడు, మనార్యుడు, అమనార్యునికి తెలియనట్లు మూడు మతములవారికి ఒక్కడే దేవుడని తెలియని దానివలన వాళ్ళు మా గురువువేరు, మా గురువువేరు అన్నట్లు మీరు మా దేవుడువేరు మా దేవుడువేరు అంటున్నారు. కథ పూర్తి తెలిసిన తర్వాత గురువువేరని ఎలా చెప్పుటకు వీలులేదో పూర్తి జ్ఞానము తెలిసిన తర్వాత దేవుడు వేరని చెప్పలేరు.

బాషా : కథలో గురువుగారి అనుచరుడు మూడు దేశములలో గురువుతో పాటు ఉన్నాడు కావున ఆయన ఆధారముతో అందరి గురువు ఒక్కడేనని తెలిసినది. ఇక్కడ మూడు దేశములలోని, మూడు మతములకు దేవుడు ఒక్కడేనని ఎవరు చూచారు?

యోగి : నేను చూచాను.

జాన్ : నీవు మా మాదిరి మనిషివే కదా మూడు కాలములోని దేవున్ని ఎలా చూడగలిగావు?

యోగి : అదే నాలోని ప్రత్యేకత. మీకులేనిది నాకున్నది అది ఒక్కటే. మీరు ఎవరైన మూడవవారే, నేను రెండవవాడిని. రెండవ వానికి తెలియనివి ఏమిలేవు.

వైశ్యుడు : మేము మూడవవారమంటే ఏమిటో, నీవు రెండవ వానివంటే ఏమిటో మాకు ఏమి అర్థముకాలేదు. ఇక మొదటివాడెవడో?

యోగి : ఈ విషయము అర్థమైవుంటే ఈ తగాదా మీకు వచ్చియుండెది కాదు. మూడవవారంటే ఒక నిమిషము ముందు ఏమి జరుగుతుందో తెలియనివారు. రెండవవాడంటే సర్వకాలములను, సర్వావస్థలను, సర్వులను తెలియువాడు. ఇక మొదటివాడంటే తెలియనివానికి తెలిసినవానికి అతీతునిగ ఉండును. అతనే దేవుడు.

బాషా : మొదటివాడంటే దేవుడా!

వైశ్యుడు : అయితే అన్ని తెలిసిన రెండవ వానిని ఏమనాలి?

యోగి : అన్ని కాలములలోను అందరిలో ఉన్నవానిని ఆత్మ అనాలి. ఆత్మ అందరిలో అనిగియున్నది కావున దానికి అన్ని తెలుసు. అందరిలో అనిగియున్న ఆత్మకంటే వేరుగ అతీతుడుగనున్నవాడు దేవుడు కనుక దేవున్ని పరమాత్మ అంటున్నాము. భవిష్యత్తు ఏమి తెలియనివాడైన మూడవవాడు కేవలము జీవించువాడే కనుక జీవుడు లేక జీవాత్మ అంటున్నాము.

బాషా : మా అల్లా ఎవరో మీకు తెలుసుకదా! ఆయన అందరికంటే పెద్ద అని కూడ తెలుసును కదా!

యోగి : అల్లా అందరికంటే పెద్దవాడని నాకు తెలుసును, నీకు కూడ తెలుసు. అట్లే అల్లాయె వేరు మతములో వేరు పేరుతోయున్నాడని కూడ నాకు తెలుసు, అది నీకు తెలియదు. అందువలన క్రైస్తవ మతములోని యెహోవాను నీవు దేవుడు కాదంటున్నావు. నీవలెనే జాన్‌గారు ఇస్లామ్‌లోని అల్లాను దేవుడు కాదంటున్నాడు. ఇది మూడవ వారైన మనుషులంతా అను మాటలే. ప్రపంచములో ఒక్క దేవుడు తప్ప ఇతరులెవరు లేరని తెలిసినపుడు అల్లాను యెహోవాను ఇద్దరు ఒక్కటేనని తెలియును. ప్రపంచమును మనుషులను పుట్టించినది ఒక్క దేవుడే, ప్రపంచమునకు అధిపతి ఒక్కడే. ఆయనను ఇస్లామ్ అల్లా అని, క్రైస్తవులు యెహోవా అని పిలుస్తున్నారు. ఒక్క హిందూమతములో భగవద్గీతకంటే ముఖ్యముగ వేదములను, పరమాత్మకంటే ముఖ్యముగ విష్ణువు మొదలగు దేవతలను చెప్పుకొనుచున్నారు. **ఏది ఏమైన, ఎవరు ఎట్లనుకొనిన ప్రపంచమునకు దేవుడు ఒక్కడే. అతడే అల్లా, యెహోవా, పరమాత్మ అని మూడు మతములలో పిలువబడుచున్నాడు.**

బాషా : అయితే మా వాదన వృథాయే కదా!

యోగి : వృథావాదనయే. మీవాదన ఒక్క ఏనుగు, ముగ్గురు అంధులు ఉన్నట్లున్నది. చూపులేని గ్రుడ్డివానిని అంధుడు అంటాము. ముగ్గురు అంధులు ఒక్కచోట చేరి ఒక ఏనుగును పట్టుకొని వారికి కనిపించని కారణమున ఒకే ఏనుగును మూడు విధముల వర్ణించారు. ఒకడు ఏనుగు కాలును పట్టుకొని ఇది స్తంభము అన్నాడు. మరియొకడు ఏనుగు చెవును పట్టుకొని ఇది చేట అన్నాడు. మూడవవాడు ఏనుగు తోకను పట్టుకొని ఇది త్రాడు అన్నాడు. వారికి

విడి విడిగ తోచినవి ఒకే ఏనుగులోని భాగములని తెలియదు. కళ్లున్న వాడు అక్కడికి వచ్చి ఇది ఏనుగు అని చెప్పితే అయితే ఏనుగు స్థంబములాగున్నదని ఒకడు, చేటలాగున్నదని మరొకడు, త్రాడులాగున్నదని మూడవవాడు అనసాగారు. కళ్ళున్న నాల్గవవాడు మీరు అనుకొంటున్న స్థంబము, చేట, త్రాడు అను మూడు ఒకే ఏనుగుకున్నాయి. ఏనుగు కాలు స్థంబములాగ, చెవు చేటలాగ, తోక తాడులాగ ఉన్నదని వివరించి చెప్పితే అప్పటికి తమవాదన సరియైనది కాదని, వారు పట్టుకొన్నది మూటిని కాదు ఒకే ఏనుగునని తెలుసుకొన్నారు. అలాగే అంధుల వాదనలాగ మీరు ఒకే దేవున్ని పట్టుకొని మూడు విధములుగ చెప్పుచున్నారు. మీరు చెప్పుచున్నది అసలైన దేవున్ని గురించే అయితే తెలియని అజ్ఞానముచేత వేరు వేరుగ చెప్పుచున్నారు.

జాన్ : అయ్యా! మీరు చెప్పునట్లు ప్రపంచమునకంత ఒకే దేవుడని మాకు తెలుసు అయినప్పటికి కొంత అజ్ఞానముచేత వేరు దేవుడున్నాడంటే ఆయనే నేననుకొన్న దేవుడని తెలుసుకోలేక పొరపడినాము. మీరు చెప్పడముతో ఉన్నది ఒకే దేవుడేయని, ఆయనే అన్ని మతములకు పెద్దయని తెలిసినది.

వైశ్యుడు : ఇస్లామ్, క్రైస్తవ మతములోనైన అల్లా అనియో, యెహోవా అనియో ఒకే దేవున్ని నమ్ముకున్నారు. ఆ విధముగనైన పరమాత్మను నమ్మక అనేక చిల్లర దేవుళ్ళను పెట్టుకొన్న హిందూమతములోని మనుషులే అన్ని మతముల వారికంటే ఎక్కువ అజ్ఞానులుగ ఉన్నారు. మీ మాటలతో మా అజ్ఞానము పోయినది. ఇకనైన భగవద్గీతను పరమాత్మను విశ్వసిస్తాము.

ఈ విధముగ అంతటితో వారి వాదన సమసిపోగా మూడు మతముల వారు ఒకే దేవుని ఉనికిని తెలుసుకొని మా మతములో దేవుడు గొప్పనిన పరవాలేదని, ఇతర మతముల దేవుడు తక్కువ అని అనకూడదని తెలుసుకొని అక్కడినుండి విరమించి ఎవరి దారిన వారు పోయిరి. శంఖుదత్తు యోగియొద్ద సెలవు తీసుకొని సువర్ణ రాజ్యమునకు బయలుదేరి పోయెను. సువర్ణరాజ్యము సుసంపన్నదేశమైయుండెను. ప్రతి కుటుంబము కష్టములు లేక సుఖముగ బ్రతుకుచుండెను. ఇదంతయు రాజుగారి చలవే అని ప్రజలు అనుకొనుచుండిరి. సువర్ణ రాజు కూడ తన రాజ్యము సుభిక్షమైయున్నదని అదంతయు తన సామత్యమే అనుకొనెడివాడు. అటువంటి పరిస్థితిలో శంఖుదత్తు సువర్ణ రాజుదగ్గరకు పోయాడు. సువర్ణరాజు శంఖుదత్తుని చూచి ఎంతో సంతోషించినవాడై సాదరముగ అభిమానించెను.

సువర్ణమహరాజు : మీరు మా రాజ్యమునకు విచ్చేయడము మాకు సంతోషమును కల్గించినది. మా రాజ్యము మరింత సుబిక్షము కాగలదు.

శంఖుదత్తుడు : మీ పేరుకు తగినట్లుగనే మీ రాజ్యము సుబిక్షముగ ఉన్నది. అలాగే మీ రాజ్యములోని ప్రజలకు సుజ్ఞానముండవలెనని కోరుచున్నాను. వారికి జ్ఞానము కావలెనంటే ముందు నీకు జ్ఞానము ఉండవలెను కదా!

సువర్ణ రాజు : అవును స్వామి. "యాధా రాజా తధా ప్రజా" అన్నట్లు రాజు ఎట్లుంటే ప్రజలు అట్లుండగలరు. నాకు ఆత్మజ్ఞానము లేదు కావున నా ప్రజలకు దానియందు పరిచయము తక్కువ. అందువలన నా ప్రజలు సుభిక్షులే కాని సుజ్ఞానులు కాదు.

శంఖుదత్తుడు : ఆ విషయము నేను కూడ గ్రహించాను. ప్రజల బాధ్యత యంతయు ప్రభువు మీద ఉండును. ప్రజలకు ప్రభువైన నీవు ప్రజల కొరకు ఏమి చేయదలచావు?

సువర్ణరాజు : మీ ద్వార ఆత్మజ్ఞానము తెలుసుకొని దానిని నా ప్రజలకు తెలుపుదును. దానివలన నా ప్రజలు సుజ్ఞానులు కాగలరు.

శంఖుదత్తుడు : నీది సరియైన యోచనయే. నీవు అడవిలో నాతో కలిసి నపుడు **అయితే ఒకటి మేలు, కాకపోతే రెండు మేలు** అన్నాను. దానిని గురించి తర్వాత చెప్పెదనన్నాను.

సువర్ణరాజు : అవును స్వామి.

శంఖుదత్తుడు : నాకు మోక్షము వస్తే ఒకటి మేలు రాకపోతే రెండు మేలు అన్నాను. నాకు మోక్షము రావాలని ఆత్మజ్ఞానమును తెలుసుకొన్నాను. ప్రతి మనిషి ఆత్మజ్ఞానమును తెలిసినపుడే మోక్షము పొందగలడు.

సువర్ణరాజు : ఆత్మ అంటే ఏమిటి స్వామి?

శంఖుదత్తుడు : ఒక పదార్థములో అనిగియున్నశక్తిని పరమాత్మ అంటాము. సజీవ శరీరములో అనిగియున్న శక్తిని ఆత్మ అంటాము. ఆత్మలో అనిగియున్న చైతన్యమును జీవాత్మ అంటాము. ఆత్మలు మూడు విధములు ఒకటి పరమాత్మ, రెండు ఆత్మ, మూడు జీవాత్మ.

సువర్ణరాజు : పదార్థములో ఉన్నది పరమాత్మ. శరీరములో ఉన్నది ఆత్మ అని అర్థమైనది. ఆత్మకంటు ఒక శరీరము అవసరము అలాగే ఆత్మలోపలయున్న జీవాత్మ కూడ శరీరమును ఆశ్రయించియున్నదని అర్థమైనది. పదార్థముగాని, శరీరముగాని లేనిచోట ఏ ఆత్మలు లేవని అర్థమైనది.

శంఖుదత్తుడు : పదార్థము లేనిచోట ఏ ఆత్మలేదనుట పొరపాటగును. పదార్థములేని శూన్యములో కూడ పరమాత్మకలదు. పరమాత్మ పదార్థములోనే కాక బయలులో కూడ అనిగియున్నది. అలాగే ఆత్మ స్థూలశరీరములోనేకాక స్థూలముకాని కంటికి కనిపించని సూక్ష్మ శరీరములో కూడ అనిగియున్నది. ఆత్మ సూక్ష్మములో ఉంటే ఆత్మలోనున్న జీవాత్మ కూడ సూక్ష్మములో ఉండగలదు.

సువర్ణరాజు : ఏ పదార్థములేని చోట పరమాత్మ, అలాగే శరీరములేని చోట ఆత్మ జీవాత్మలు ఉండగలవు. పదార్థము ఉన్నచోట, లేనిచోట పరమాత్మ కలదని తెలియవచ్చును. ఆత్మ జీవాత్మలు శరీరములేనిచోట కలవనుటలో విచిత్రముగనున్నది. శరీరములేనిచోట బయలు అని అర్థమగుచున్నది. ఆ బయలులో పరమాత్మ కదా ఉండునది.

శంఖుదత్తుడు : కనిపించనంతమాత్రమున అంత బయలనుకోకూడదు. బయలు అంతా ఒకటే అయిన శరీరములు రెండు రకములు ఒకటి కనిపించెడి స్థూలశరీరము, రెండవది కనిపించని సూక్ష్మశరీరము. స్థూలశరీరములు ప్రపంచములో కనిపిస్తుయున్నవి. అలాగే సూక్ష్మ శరీరములు ప్రపంచములో కనిపించక అనేక చోట్ల గలవు. కనిపించని స్థలమంతయు బయలనియే కాదు. ఆ బయలులో సూక్ష్మశరీరములు కూడ కలవు. కంటికి కనిపించు స్థూలప్రపంచమే కాక కంటికి కనిపించని సూక్ష్మప్రపంచము కూడ చాలా కలదు. అందువలన ఈ ప్రపంచమును కంటికి కనిపించు ప్రపంచము, కంటికి కనిపించని ప్రపంచము అని రెండు రకములుగ విభజించవచ్చును. కనిపించు ప్రపంచమునే ఇపుడు మనము చూస్తున్నాము. కనిపించని ప్రపంచము కూడ దాదాపు దీనితో సమానముగ ఉన్నదని కూడ తెలియవలెను.

సువర్ణరాజు : కంటికి కనిపించని ప్రపంచముందనుట ఆశ్చర్యవిషయమే. అయిన మీరు చెప్పుట వలన కొంత

అర్థమైనది. మూడు రకముల ఆత్మలు కలవని అందులో పదార్థములో పరమాత్మ స్థూల సూక్ష్మ శరీరములలో ఆత్మ జీవాత్మలు గలవని అర్థమైనది.

శంఖుదత్తుడు : నీవు అర్థము చేసుకోవలసినది ఇంకాయున్నది. కేవలము పదార్థములోనే కాక పదార్థములేని బయలులోను పరమాత్మ వ్యాపించి యున్నది. ఆత్మ జీవాత్మలుగల శరీరములో కూడ పరమాత్మ ఆవహించియున్నది. పరమాత్మలేని చోటంటూ ఏదియులేదు. జీవాత్మ, ఆత్మలలో కూడ పరమాత్మ వ్యాపించియున్నది. దీనినిబట్టి **అంతయు వ్యాపించినది పరమాత్మ అనియు, శరీరములలోపల శరీరమంత వ్యాపించినది ఆత్మ అనియు, శరీరమంతకాక శరీరములో ఒక్కచోట మాత్రము రవ్వంతై అనిగియున్నది జీవాత్మ అనియు తెలియవలెను.** ఇప్పటికి మూడు ఆత్మల వివరము అవి వ్యాపించిన స్థలము అర్థమైందనుకొంటాను.

సువర్ణరాజు : అయితే ఇపుడు మన శరీరములో మూడు ఆత్మలు కలవని అర్థమైనది.

శంఖుదత్తుడు : నీ శరీరములో గల మూడు ఆత్మలయందు జీవాత్మవే నీవు. జీవాత్మవైన నీవు ఈ ప్రపంచములో సువర్ణరాజుగ పేరుకల్గి వ్యవహరించుచున్నావు.

సువర్ణరాజు : మూడు ఆత్మలలో జీవాత్మను నేననుట ఇదే మొదటిసారిగ వింటున్నాను. నేను జీవాత్మనైతే ఆత్మ ఎవరు? పరమాత్మ ఎవరు?

శంఖుదత్తుడు : పరమాత్మయే ప్రపంచమునకంతటికి దేవుడు. ఇకపోతే ఆత్మ విషయమే ఎవరికి తెలియదు. శరీరములో అన్ని పనులు చేయునది జీవాత్మవైన నీవు కాదు. ఎవరికి అర్థము కాకుండ, ఎవరికి తెలియకుండ అన్ని పనులు చేయునది శరీరములో అంతటయున్న ఆత్మయే. ఆత్మ అన్ని పనులు చేయుచుండగ జీవాత్మ తానే అన్ని పనులు చేయునట్లు భ్రమించుచున్నది. అందువలన ప్రతి మనిషికి ఆత్మజ్ఞానము అవసరము అన్నారు పెద్దలు. మొదట ఆత్మను తెలియగలిగితే దానిలోపల ఉన్న జీవాత్మ అయిన తనను తెలుసుకోవచ్చును. ఆత్మ జీవాత్మను తెలుసుకొన్న తర్వాత దేవుడైన పరమాత్మను తెలియుటకు వీలుకల్గును. పరమాత్మను తెలియుటకు మొదట ఆత్మ జీవాత్మలను గురించి తెలియవలెను.

సువర్ణరాజు : ఒక్క శరీరములో ఒక్క జీవాత్మయుంటుంది. అలాగే ఒక్క ఆత్మ ఒక్క పరమాత్మ ఉంటుందా? పది శరీరములలో పది జీవాత్మలుంటాయి కదా! అలాగే పది ఆత్మలు, పది పరమాత్మలుంటాయా?

శంఖుదత్తుడు : ఇది చాలా మంచి ప్రశ్న. దీని జవాబు ప్రతి ఒక్కరికి అవసరమే. ఒక శరీరములో ఒక జీవాత్మయుండుట వాస్తవమే అలాగే ఒక శరీరములో ఒక ఆత్మయుండుట కూడ సత్యమే. పది శరీరములలో పది జీవాత్మలు, పది ఆత్మలు గలవు కాని పది శరీరములలోను పరమాత్మ మాత్రము అఖండముగ ఒకటిగానేయున్నది. అందువలన ఎన్ని శరీరములుంటే అన్ని జీవాత్మలు ఆత్మలుండవచ్చును కాని పరమాత్మ మాత్రము ఒక్కడేనని తెలియవలెను. **అఖండమై అంతట ఏకరూపముగ యున్నది పరమాత్మ. ఖండ ఖండములుగ ఉన్నది ఆత్మ. భిన్న భిన్నముగ వేరు వేరుగనున్నవి జీవాత్మలు.** ఎన్ని జీవాత్మలుండునో అన్ని ఆత్మలుండును. భిన్న శరీరములో ఆత్మలుండిన అన్ని ఆత్మలు ఒకే సూత్రమునకు సంబంధించియున్నవి. అందువలన ఆత్మ స్వరూపములు ఎన్ని ఉండిన అన్నిటిని కలిపి ఆత్మ అంటున్నాము. జీవాత్మలు అనేక రక కర్మలతో కూడుకొన్నవి కావున అన్నిటిని వేరు వేరుగ చెప్పుచున్నాము.

సువర్ణరాజు : జీవాత్మకు ఆకారమున్నదా?

శంఖుదత్తు : జీవాత్మకు జీవాత్మ అని పేరు గలదు, ఆకారము గలదు. అలాగే ఆత్మకు ఆత్మ అని పేరుగలదు, ఆకారము గలదు. పరమాత్మకు పేరులేదు, ఆకారము లేదు. జీవాత్మ ఆత్మలు ఖండ ఖండములుగ ఉన్నవి కావున వాటికి పేరు ఆకారముగలదు. అఖండమైన పరమాత్మకు పేరుగాని, ఆకారముగాని లేవు.

సువర్ణరాజు : ఆకారమున్న జీవాత్మను ఆత్మను చూడవచ్చును కదా!

శంఖుదత్తుడు : ఆకారమున్నంత మాత్రమున వీటిని చూచుటకు వీలుపడదు. బాహ్యకన్నుకు బాహ్యదృష్టికి ఆత్మ గోచరించదు. ఆత్మ గోచరించనిది అందులోని జీవాత్మ కూడ కనిపించదు. ఆత్మను ఒక్క జ్ఞానదృష్టి ద్వార చూడవచ్చును. ఆత్మను జ్ఞాననేత్రము ద్వార చూడగల్గిన వాడు అదే విధముగనే ఆత్మలోపలనున్న జీవాత్మను చూడవచ్చును. ఆత్మ ఇంద్రియాతీతమైనను జ్ఞానమునకు అతీతమైనది కాదు.

సువర్ణరాజు : జ్ఞానదృష్టితో పరమాత్మ విశ్వరూపమును అర్జునుడు చూచినట్లు వినికిడి ఉన్నది. కాదంటారా?

శంఖుదత్తుడు : వాస్తవమే. అది అర్జునునికి కల్గిన జ్ఞానదృష్టికాదు. స్వయముగ పరమాత్మయే ఇచ్చిన జ్ఞానదృష్టి వలన ఆయన చూడగల్గినాడు. అది దేవుని ఆజ్ఞ ప్రకారము కనిపించిన దృశ్యము. అది ఒక్క అర్జునునికి మాత్రమే కల్గినది. దాని తర్వాతగాని దానికంటే ముందుగాని ఎవరికి పరమాత్మ దర్శనము కలుగలేదు. పరమాత్మ మానవుని జ్ఞానదృష్టికి కూడ కనిపించువాడు కాదు. అర్జునునిలాగ చూడవలెనంటే అది పరమాత్మ ఇచ్చు జ్ఞానదృష్టితో మాత్రము సాధ్యము. అటువంటి అవకాశము అర్జునునికి తప్ప ఎవరికి రాలేదు, రాబోదు.

సువర్ణరాజు : స్వామి! మనుషులలో స్త్రీ అనియు, పురుషుడనియు వేరువేరు శరీరములు కలవుకదా! అలాగే స్త్రీ ఆత్మని, పురుష ఆత్మని వేరువేరుగ ఉండునా?

శంఖుదత్తుడు : అలా ఉండుటకు వీలులేదు. శరీరములున్నట్లు స్త్రీ పురుష ఆత్మలుగాని, జీవాత్మలుగాని ఉండవు. శరీరములు ఏవైన ఆత్మల విధానము ఒకటిగానే ఉండును. ఇంకను వివరముగ చెప్పుకొంటే ఆత్మలు పురుష సంబంధమైనవని, శరీరములు స్త్రీ సంబంధమైనవని పెద్దలు విభజించారు. పంచభూతములైన ప్రకృతియంతయు స్త్రీ స్వరూపమని, ప్రకృతి మినహ మిగిలియున్న మూడు ఆత్మలు పురుష స్వరూపమని కూడ చెప్పారు.

సువర్ణరాజు : ఆత్మలు మూడు ఉండగ ఇటు పరమాత్మను వదలి అటు జీవాత్మను వదలి మధ్యలో ఆత్మను పట్టుకొని ఆత్మజ్ఞానము అన్నారు. పరమాత్మ జ్ఞానమని, జీవాత్మ జ్ఞానమని ఎక్కడ అనలేదు ఎందుకు?

శంఖుదత్తు : మానవుడు ముఖ్యముగ తెలుసుకోవలసినది మధ్యలోని ఆత్మజ్ఞానమునే. ఆత్మజ్ఞానము తెలియనిది ఆత్మలోపలగల జీవాత్మ జ్ఞానము తెలియదు. అలాగే ఆత్మజ్ఞానము తెలియనిది ఆత్మకంటే పెద్దదైన పరమాత్మ జ్ఞానము అర్థముకాదు. అందువలన ముందు మూడు ఆత్మల మధ్యలోని ఆత్మనే తెలియమన్నారు. ఈ విధానమును తెలుపుటకే ఈశ్వరలింగము మీద మూడు విభూతిరేఖలలో మధ్యదానికే బొట్టును ఉంచారు. మూడు విభూతిరేఖలు పరమాత్మ, ఆత్మ, జీవాత్మలని వాటి మధ్యలోని రేఖకు దీనినే మొదట తెలియవలెనని కుంకుమబొట్టునుంచారు.

సువర్ణరాజు : ఆత్మలకు రంగు ఏమైన ఉన్నదా?

శంఖుదత్తుడు : ఆత్మలకు రంగులేదు. అయినప్పటికి వాటిని తెల్లని రంగుతో విభూతి రేఖలుగ తీర్చిదిద్దారు. పరమాత్మలో ఆత్మ, ఆత్మలో జీవాత్మ ఇమిడియున్నవి కావున విభూతిరేఖలలో పైన రేఖ పరమాత్మ అనియు మధ్యలోనిది ఆత్మనియు, క్రిందిది జీవాత్మని తెలియవలెను.

సువర్ణరాజు : మోక్షము అనగానేమి?

శంఖుదత్తుడు : మోక్షము అనగా విడుదల అని అర్థము. జీవుడు కర్మలను బంధములనుండి విడుదల పొందడమే మోక్షము.

సువర్ణరాజు : మోక్షము పొందుటకు ఆత్మజ్ఞానము తప్పనిసరి అవసరమే కదా?

శంఖుదత్తుడు : అవును మోక్షము పొందు ప్రయత్నము కొరకు ఆత్మజ్ఞానము తప్పనిసరి అని అర్థము.

సువర్ణరాజు : మీరు మోక్షము పొందుటకు ప్రయత్నము చేస్తు ఆత్మజ్ఞానము పొందినారు. అటువంటి పరిస్థితిలో మోక్షము పొందితే ఒకటి మేలు పొందక పోతే రెండు మేలు అన్నారు. పొందితే ఒకటి లాభము ఏమిటి? పొందకపోతే రెండు లాభము ఏమిటి?

శంఖుదత్తుడు : ఈ విషయము చెప్పుటకే నీకు కొంత ఆత్మజ్ఞానము చెప్పవలసి వచ్చినది. ఇపుడు జవాబు చెప్పిన అర్థము చేసుకోగలవు. ఆత్మజ్ఞానము తెలియకముందు మోక్షము రాకపోతే ఎక్కువ లాభము, వస్తే తక్కువ లాభము అన్నట్లు అర్థమవుతుంది. నేను మోక్షము వస్తే పరమాత్మ అనునది ఒక్కటే తెలియును అను భావముతో ఆ రోజు అన్నాను. ఆత్మజ్ఞానము తెలియుట వలన మోక్షము రాకపోయినప్పటికి ఆత్మ జీవాత్మ రెండు తెలియును కావున రెండు తెలియునను భావముతో రెండు మేలు అన్నాను. ఆత్మజ్ఞానముతో రెండు ఆత్మలు తెలిసిన తర్వాత మూడవ ఆత్మ తెలియును మోక్షము పొందకుండ మూడవ ఆత్మ తెలిసితే మూడు లాభమనేవాడిని. మోక్షము పొందినవాడు ఇహములో ఉండడు కనుక వానికి అన్నియు ఒకే ఆత్మ అవును కనుక మోక్షము పొందినవానికి ఒకటిమేలు అనవలసివచ్చినది. ఇహములోని ఆత్మజ్ఞాని రెండు ఆత్మలను తెలిసినవాడు కనుక వానికి మోక్షము పొందకపోతే రెండు మేలు అనవలసివచ్చినది. ఒకటి అంటే పరమాత్మ అని, రెండు అంటే ఆత్మ జీవాత్మ అని తెలియవలెను. అయితే ఒకటి లాభము కాకపోతే రెండు లాభము అనుమాట కూడ ఈ అర్థముతో కూడుకొన్నదే అయివున్నది. ఆనాటి నామాట ఈ రోజు అర్థమైనదనుకొంటాను. ఈ మాట ఆత్మజ్ఞానము తెలిసినవారికే అర్థమగును. ప్రపంచజ్ఞానములో అయితే అనగా పని జరిగితే తక్కువ లాభము, జరుగక పోతే ఎక్కువ లాభము అన్నట్లుండును. ఆత్మజ్ఞానరీత్య అయితే అనగా పని జరిగితే ఎక్కువ లాభము, జరుగకపోతే తక్కువ లాభము అన్నట్లుండును. ఒకే వాక్యము ప్రపంచరీత్య ఒక భావము, ఆత్మజ్ఞానరీత్య ఒక భావము కలుగజేయును. మొదట విన్నపుడు ఒక భావముతో అర్థమైన వాక్యము నీకు ఇపుడు వేరు విధముగ అర్థమై యుంటుంది. ఇదే జ్ఞానము యొక్క ప్రత్యేకత.

సువర్ణరాజు : వాస్తవమే స్వామి. మొదట మీరు చెప్పిన రోజు నాకు మోక్షము రాకపోతే ఎక్కువ మేలవుతుందేమో అని అనికొనియుంటిని. ఆనాటి నా ప్రపంచ జ్ఞానము అలా అనిపింపచేసినది. వాస్తవముగ జ్ఞానరీత్య ఎంతో జ్ఞానముకల్గిన వాక్యము ఈ దినము అర్థమైనది.

శంఖుదత్తుడు : ఈ వాక్యము యొక్క వివరము చెప్పుటకే నేను ఇంతదూరము వచ్చి నీకు ఆత్మజ్ఞానము చెప్పవలసి

వచ్చినది. ఆ రోజు అడవిలో నీకు ఈ వాక్యము అర్థముకాదు తర్వాత నేను వచ్చి చెప్పెదనని చెప్పియుంటిని. ఇక నేను వచ్చిన పని అయిపోయినది. నేను పోయి వచ్చెదను. నీకు ఇంకా ఆత్మజ్ఞానము అవసరము వస్తే అడవికి వచ్చి తెలుసుకో.

ఈ విధముగ శంఖదత్తుడు సువర్ణరాజుకు జ్ఞానము తెలిపి అక్కడ నుండి బయలుదేరి అడవి మధ్యలోనికి పోయి మోక్షసాధన చేయుచుండెను. సువర్ణ మహారాజు తన రాజ్యమును తన కుమారునికి అప్పజెప్పి తాను కూడ మోక్షసాధనకై శంఖుదత్తుని చెంతకు చేరి జీవించసాగెను.

P P M P P

# బేతాళుని కథ

అనగనగ ఒక తండ్రి. ఆ తండ్రికి 16 మంది కొడుకులు చాలామంది అనుకొనుటకు వారంత ఒకే భార్యకు పుట్టినవారు కాదు. మొదట భార్య ఒకతే ఉండేది. చివరికి నలుగురయ్యారు. నాలుగు రకాల భార్యలకు నాలుగు రకాల కొడుకులు. ఒక్కొక్కరికి నలుగురు చొప్పున పుట్టారు. ఎలాగైతేనేమి మొత్తము పదహారు మంది కొడుకులు పుట్టారు. మొదటి భార్య పెద్దలచేత పెళ్ళి చేయబడి వచ్చినదైతే, మిగతా భార్యలలాకాదనుకోండి. ముందే ఇంకొకరికి పెళ్ళి చేయబడి వేరొకరికి భార్యలై ఆ మొగుళ్ళనుండి వారికి తృప్తిలేక, ఆ మొగుళ్ళు నచ్చక వారినుండి విడిపోయి మొగుళ్ళు లేక కొంతకాలము తిరిగి చివరకు ఇతని వద్దకు వచ్చి చేరారు. ఎలాగైతేనేమి చివరికి నాలుగు కులాలవారు నలుగురు భార్యలైనారు. భార్యకు నలుగురు చొప్పున పదహారు మంది కొడుకులు అయినారు.

కొడుకులందరికి యుక్తవయస్సు వచ్చినది. యుక్తవయస్సు వచ్చిన వెంటనే వారి తండ్రి అందరికి సమానముగా ఆస్థి పంచిపెట్టాడు. చిన్నవారికి కొంత ఎక్కువ పెద్దవారికి కొంత తక్కువ కాకుండుటనట్లు అందరికి సమానముగా పంచాడు. ఆ తండ్రి పంచి ఇచ్చిన ఆస్థితో అందరు సంతృప్తిపడినారు. ఎలాంటి అసంతృప్తిలేదు. ఎందుకనగ ఏ తండ్రిగాని ఏ కొడుకులకు పంచని విలువైన ఆస్థిని ఆ తండ్రి ఆ కొడుకులకు పంచాడు. పంచిన ఆస్థి మామూలు భూములే కాకుండా విలువ కట్టలేనటువంటి వజ్రవైదూర్యములు, రత్నములతో కూడుకొన్న బంగారు ఆభరణాలు. ఆ కొడుకులే నాదగ్గర ఎవరి వద్దలేని రత్నాలు వజ్రాలున్నాయని చెప్పుకొన్నారు. తండ్రి కూడ కొడుకులను అప్యాయతగ పెంచి ఎవరికి తక్కువ లేకుండ మా నాన్న గొప్పవాడన్నట్లు చేశాడు.

ఒక దినము ఆ తండ్రికి ఒక వ్యాధి వచ్చింది. ఆ జబ్బు పెరుగుతూ పోయింది. ఆ వ్యాధి వలన ఆ తండ్రి బ్రతకడని చివరికి చావు తప్పదని కొడుకులకు తెలిసింది. ఆ వ్యాధి వలన అతనొక్కడే చస్తే పరవాలేదు. ఆ వ్యాధి మాకెక్కడ అంటుకొంటుందోనని భయపడినారు. తండ్రికదా అనిగాని, అతని ఆస్థి పంచుకొన్నాము కదా అనిగాని, ఒంటరివాన్ని చేసిపోతే ఎలా అనిగాని యోచించని కొడుకులు ఎవరి దారిని వారు చూచుకొన్నారు. మొదటి భార్య కొడుకులలో ఇద్దరు మాత్రము ఎలాగైతే అలాకాని అని తండ్రివద్దనేయుండగ మిగత 14 మంది తండ్రికి దూరమైపోయారు. తండ్రిని వదలి పోవుట తప్పేకదా! అని ఇతరులంటారని వారి తప్పు బయటపడకుండా మేము మంచి వారము మా నాన్నే చెడ్డవాడని, అతనే తరిమివేశాడని, కొందరు కొడుకులు చెప్పితే మరి కొందరేమో మానాన్నది చెడుప్రవర్తనని

మమ్ములను భేదముగా చూస్తున్నాడని, ఆస్థి సరిగా పంచలేదని, నా భార్యకు మానాన్నకు సరిపోవడము లేదని, పిల్లనిచ్చిన మామను మానాన్న సరిగ చూడలేదని, మామామకు కోపంవచ్చిందని ఇలా అన్ని కొంటెసాకులు ప్రచారము చేశారు. తండ్రివద్దనే మిగిలిపోయిన ఇద్దరిని మిగత 14 మందికి ఎక్కడైన బజారులో కనిపించినప్పటికి మాట్లాడించెడి వారుకాదు. మాట్లాడిస్తే వారినాన్న పీడ ఎక్కడ కరుచుకొంటుందొనని ముఖము తప్పించెడివారు. తండ్రి కథ వదిలేసి కనపడినవారు సోదరులని కూడ అనుకొకుండా చూచిచూడనట్లు తప్పించుకు తిరిగెడివారు. ఒకవేళ ఆ ఇద్దరు సోదరులు వారే కల్పించుకొని ఎక్కడైన మాట్లాడినప్పటికి నాన్న బాగున్నాడా అనికూడ అడిగెడు వారుగారు.

ఆ 14 మంది కొడుకులలో కొంతమంది అతను మా తండ్రికాదని కూడ చెప్పుకొన్నారు. మా అమ్మకు మొదటి మొగుడే మా నాన్నని కూడ చెప్పుకొన్నారు. పుట్టించుకొని ఆస్థి ఇచ్చిన వానిని తండ్రి కాదని వరుసకు నాన్నయిన వానిని తండ్రి అని చెప్పుకోవడము ఆశ్చర్యమే కదా! ఈ విధముగ బయటికి పోయిన కొడుకులుండగ తండ్రివద్ద నిలిచి పోయిన కొడుకులు చివరికి మనకు తప్పినదికాదని తమకు చేతనైన సేవ చేస్తూ ఉండెడివారు.

వదలిపోయిన 14 మంది రకరకములుగ బ్రతుకు సాగెంచెడివారు. వారి అమ్మగారు నాలుగు కులాలవారన్నాము గాని వారి కులాల పేర్లు చెప్పలేదుకదూ! ఇప్పుడు చెప్పుకుందాము. పెద్దల సాంప్రదాయము మేరకు చేసిన పెండ్లి వలన వచ్చిన భార్య భర్త కులమే. మిగతా ముగ్గురిలో ఒకరు బలిజకులానికి చెందినామె. ఒకరేమో నేసెకులము, మరొకరు మంగళకులానికి చెందినది. మంగళామెకు పుట్టిన వాడొకడు తండ్రి ఇచ్చిన ఆస్థిని పెట్టుబడిగ పెట్టి దానితోనే వ్యాపారం చేస్తూ తాను కూడ తండ్రి అంతట ఆస్థిని సంపాదించవలెనని, తండ్రి అంతటివాడు కావాలని ప్రయత్నించెడివాడు. నేసె ఆమెకు పుట్టినవాడు తండ్రి ఇచ్చిన ఆస్థిని వడ్డీకి ఇచ్చి ఉన్న ఆస్థిని రెట్టింపు చేసుకొవాలని, తండ్రికంటే మించి పోవాలని చూసెడివాడు. ఎలాగైతే అందరు అన్ని రకాలుగా బ్రతుకుచు తండ్రిని గూర్చి ఏమాత్రము పట్టించుకొలేదు.

ఇక తండ్రి విషయానికొస్తే తనకెంత వ్యాధి వచ్చిన తననేమి చేయలేదని, తాను చేయవలసిన పనులు మిగిలియున్నాయని అవి పూర్తి చేసే వరకు తనకు చావులేదని ఆ విషయము తెలియని నా కొడుకులు అనవసరముగ భయపడి కొంటె సాకులతో బయటికి పోయారని, పోయిన వారి గురించి నాకేమి చింతలేదని, పోయిన వారే భార్యవలన ఒకరు, మామ వలన ఒకరు, కొడుకుల వలన ఒకరు రకరకములుగ బాధపడుచున్నారని, నాకలాంటి సమస్యలు లేవని నిజంగా వారికంటే నేనే సుఖంగా ఉన్నానని చెప్పెడివాడు. తండ్రి రోషము పట్టుదల గలవాడు కావున కొడుకుల గురించి యోచించడము గాని, వారిని చూడాలనుకోవడము గాని జరుగలేదు. పోయిన వారికి ముఖము కూడ చూపకుండ తన నివాసము వారికి తెలియకుండ చేశాడు.

కొంతకాలమిలా జరిగిపోగా ఆ 14 మంది కొడుకులలో ఒకనికి కొత్త రకమైన రోగం వచ్చింది. ఆ రోగానికి ఏ డాక్టర్లవద్దగాని మందులేదు. ఆ రోగ నివారణోపాయం తనతండ్రికి ఒక్కనికే తెలుసు. అపుడు వానికి తండ్రి మతికి వచ్చాడు. తండ్రిని గురించి ఆరాతీస్తే అతని అడ్రస్సే దొరకలేదు. తండ్రేమో ఉండిన కనిపించనివాడాయె. తండ్రి వద్దనే మిగిలియున్న సోదరులు కనిపించినపుడు తండ్రిని గురించి అడిగితే మీరు పితృద్రోహులని తిట్టి తండ్రి విషయము చెప్పకపోయిరి. ఇలాగే మిగత కొడుకులకు కూడ రకరకముల సమస్యలెదురైనవి. కొందరికి రోగాలు, కొందరికి తమవద్దనున్న ఆస్థికూడ పోవడము, కొందరికి కుటుంబ సమస్యలు, ఒకనికి మామ సమస్య, ఒకనికి అత్త సమస్య ఇలా అనేక రకములుగా వారు పీడింపబడుచున్నారు.

తండ్రిని వదలి వచ్చి సుఖంగా ఉండాలనుకొన్నవారికె తండ్రి వద్దనున్న సుఖము బయట కనిపించలేదు. పైగా బాధలే ఎక్కువైనాయి. తమ సమస్యలు తీర్చువాడు చివరకు తండ్రి ఒక్కడేనని కొందరు గ్రహించారు. తమ తండ్రికి వచ్చిన రోగము ఆయననేమి చేయలేదని. తమకు వచ్చిన రోగమే తమను పీడిస్తున్నదని కొందరు తెలుసుకొన్నారు. చివరకు తండ్రిని వెదకసాగారు. అయినప్పటికి ఆయన కనిపించలేదు. ఇది ఒక బేతాళుని కథ. ఇందులో విక్రమార్కుని భేతాళుడు ప్రశ్నిస్తాడు. అవి 1) విడిపోయిన కొడుకులకు తండ్రి కనిపించుట సరియైన పనియేనా? 2) తన వద్ద నిలిచిన కొడుకులకు తనను విడిచి పారిపోయిన కొడుకులకు ఆ తండ్రి ఆస్థిలో భేదముంటుందా? 3) ఆయన కనిపించక పోతే చివరికి వారి పరిస్థితి ఏమవుతుంది? వీటికి సమాధానము విక్రమార్కుడు నోరు విప్పలేదు. నోరు విప్పితే భేతాళుడు పోతాడు. తెలిసి విప్పకపోతే విక్రమార్కుని తల పగులుతుంది. కావున విక్రమార్కుడు నోరు విప్పకుండ అర్థముకాని శబ్దముతో జవాబు చెప్పాడు. కావున భేతాలుడు విక్రమార్కుని వదలి పోలేకపోయాడు. విక్రమార్కుని తల పగలలేదు. ఆ జవాబేమో ఊహించి వివరించి చెప్పండి.

P P M P P

# ఆత్మబంధువు - శరీరబంధువు

ప్రతి మానవునకు భూమి మీద శరీరబంధువులు తప్పక ఉంటారు. వారు తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్క చెల్లెండ్లు, కొడుకు కోడళ్లు, కూతురు అల్లుల్లు, మనువళ్ళు మనువరాల్లు ఎవరైన శరీర బంధువులనే చెప్పవచ్చును. శరీరమునకు సంబంధించిన వారందరిని వీరు నావారు అనుకోవడము మన తలలోని ఒక గుణప్రభావము. ఆ గుణము పేరు మోహగుణము. **'నా'** అని ఎక్కడయితే భావము కల్పించు చున్నదో అక్కడ మోహగుణ ప్రభావమనే తెలియాలి. శరీర బంధువులు అందరికి ఉండినప్పటికి ఆత్మబంధువులనువారు అందరికి ఉండరు.

ఆత్మబంధువులనువారు శరీర బంధుత్వానికి సంబంధించిన వారు కారు. శరీరము లోపల ఉన్న ఆత్మకు సంబంధించినవారని తెలియాలి. శరీర బంధువులు వీడు కొడుకు, వీడు వాడు అని చెప్పుచు వానికది చేయాలి, వీనికి ఇది చేయాలనియే చెప్పుచుందురు. కాని ఆత్మబంధువులు ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అను మూడు బంధుత్వాలనే తెలుపుచు, నీవు జీవాత్మవు, ఆత్మ పరమాత్మల గూర్చి చేయవలసినదియని తెలుపుచుందురు. శరీరబంధువులు ప్రపంచ ధనమును గూర్చియే మాట్లాడుదురు. ఆత్మబంధువులు జ్ఞానధనమును గూర్చి మాట్లాడుదురు. శరీరబంధువులు గుణముల వ్యతిరేఖతల వలన హింసించగలరు. ఆత్మబంధువులు జ్ఞాన ఐక్యత వలన ఒకరికొకరు సహకరించుకోగలరు. ఇట్లు శరీరబంధువులకు ఆత్మబంధువులకు ఎన్నో తేడాలు గలవు. అయితే శరీరబంధువులు వీరని తెలుసును కదా ఆత్మ బంధువులెవరని తెలియవలెననగా!

ఆత్మజ్ఞానమును బోధించు గురువు ముఖ్యమైన ఆత్మబంధువు. ఆత్మబంధువైన గురువు ఏ కొందరికో అరుదుగ ఉండును. శరీర బంధువులవలె ఆత్మబంధువును కూడ ప్రతి ఒక్కరు పెట్టుకోవచ్చుకదా అను ప్రశ్నవస్తే అలా సాధ్యపడదనియే చెప్పవచ్చును. ఎందుకనగా! శరీరబంధువును విడిపోకుండ మన తలలోని గుణములే చేయుచున్నవి అట్లు ఆత్మబంధువును గురువును విడిపోకుండ చేయునది ఏది మనలో లేదు. పైగా శరీరబంధువులైన వారిని వీడిపోకుండ

చేయు గుణములే ఆత్మబంధువైన గురువును విడిపోవునట్లు అహర్నిశలు అనేక ప్రయత్నములు చేయుచుండును. కావున ఆత్మబంధువును అందరు నిలుపుకోలేరు.

ఆత్మబంధువును నిలుపుకోవాలంటే గట్టి శ్రద్ధ ఉండవలయును. తీక్షణమైన శ్రద్ధ ఉన్నవారికి గురువు ఆత్మబంధువుగ ఉండగలడు. ఎటువంటి శ్రద్ధ ఉండవలయునంటే ఒక మహత్తర గ్రంథమందు ఒక గురువిలా చెప్పాడు. **"ఆత్మజ్ఞానము ఎడల నీ చేయి నిన్ను అభ్యంతర పరచిన దానిని నరికి వేయుము. నీవు రెండు చేతులు కలిగి నరకమున ఆరని అగ్నిలో బడుటకంటే అంగహీనుడవై మోక్షములో ప్రవేశించుట మేలు. నీ పాదము నిన్ను అభ్యంతర పరచిన ఎడల దానిని నరికి వేయుము. రెండు పాదములుకల్గి నరకములో పడవేయుటకంటే కుంటివాడవై దైవసన్నిధి చేరుట మేలు. నీ కన్ను నిన్ను అభ్యంతర పరచిన ఎడల దానిని తీసిపారవేయుము. రెండు కన్నులు కలిగి బ్రతుకుటకంటే ఒంటి కన్ను గలవాడవై దేవుని రాజ్యములో ప్రవేశించుట మేలు"** ఒక ఉన్నతమైన గురువు చెప్పిన మాటలివి. అంతటి శ్రద్ధ ఉండవలయునని జ్ఞానమార్గములో శరీరమునకు అతుక్కొని ఉన్న అవయవములకు కూడ విలువ ఇవ్వవద్దని ఆయన తెలుపగ శరీరమునకు అతుక్కోక ప్రక్కన ఉన్న శరీరబంధువులకు ప్రత్యేకముగ చెప్పనవసరము లేదు. ఉన్న పద్ధతి ఇది అయితే చాలా మంది శిష్యుల పద్ధతి ఎలా ఉన్నదనగా! ఒక కథను వివరించుకొని చూద్దాము.

పూర్వకాలము ఒక శిష్యుడు తన గురువు ఎడల సర్వజ్ఞానమును తెలుసుకొన్నాడట. ఆ శిష్యుడు చివరిలో గురుదక్షిణ ఏమివ్వాలని గురువునడుగగ మీ ఇంట ఒక పూట విందుభోజనము పెట్టమని గురువు కోరాడట. ఆ మాట గురువుగారంటూనే శిష్యునికి కొంత భయమేసింది. ఎందుకనగ ఇంటిలోని తన భార్య గురువుగారికి విందు భోజనము కాదు కదా మామూలు భోజనమైన పెట్టుతుందో లేదోనని. గురువుగారు గురుదక్షిణగా అడిగిన దానిని తీర్చకపోతే ఎలాగ అందువలన సరేనని ఒప్పుకొన్న శిష్యుడు ఎప్పుడు వస్తారు స్వామి అన్ని ఏర్పాట్లు చేసుకొనే దానికి అని అడుగగ రేపు వచ్చే అమావాస్య దినమున వస్తానని గురువు చెప్పాడు. ఇది మొదటి శిష్యునికి చెప్పినది. గురువుగారికి మొత్తము ఏడుమంది శిష్యులు కదా! ఇక రెండవ శిష్యునికి రెండవ దినమున దగ్గరకు పిలచి శిష్యా నావద్ద నేర్చవలసిన జ్ఞానమంతయు ముగిసినది కావున నీవు నాకు గురుదక్షిణ ఇచ్చుకోవలసి ఉండుననగా అలాగా స్వామి అని ఏమి సమర్పించుకోవలయునని అడిగెను. గురువుగారు మొదటి శిష్యునికి చెప్పినట్లే రెండవ శిష్యునికి కూడ మీ ఇంట ఒక పూట భోజనము పెట్టవలెనని అడిగెను. ఆ మాటవిన్న రెండవ శిష్యుడు సంతోషపడి ఇంత జ్ఞానము చెప్పిన గురువుకు ఇంటిలో అన్నము పెట్టుట పెద్దపని కాదు అనుకొని ఎప్పుడు వస్తారు స్వామి అని అడుగగ అమావాస్య దినము రాత్రికని అతనికి కూడ గురువు చెప్పి పంపెను.

ఇక మూడవ శిష్యుని కూడ మూడవ దినము పిలిచి గురుదక్షిణ అడిగెను. గురుదక్షిణ ఏమివ్వవలెనని శిష్యుడడుగగ నీకున్న 150 ఎకరములలో అమావాస్య తరువాత ఒక ఎకరము మంచి పొలమిమ్మని అడిగెను. అట్లే నాల్గవ వానిని మరుసటి దినము పిలిచి నాకొక శత్రువున్నాడు అతనిని నీవు ఈ అమావాస్య తర్వాత రెండు మూడు దినములలో కొట్టి రావలయును అదియే నాకు గురుదక్షిణ అని చెప్పెను. ఇక ఐదవ వానిని కూడ తర్వాత దినము పిలిచి నాయన నీవు గురుదక్షిణ ఇవ్వవలసి ఉన్నదని అడుగగ ఆ శిష్యుడు సరేనని ఒప్పుకొని గురుదక్షిణ ఏమిటని అడిగెను. నీవు అమావాస్య తర్వాత నుండి ఒక సంవత్సరము ఇచ్చటనే పనులు చేయుచు ఉండవలయునని గురువు కోరెను. సరేనని అతను తలూపెను. మిగిలిన ఇద్దరిలో ఆరవ వానిని పిలిచి గురుదక్షిణ విషయము అడిగెను. అతను సరే మీరేది చెప్పితే అదే విధముగ సమర్పించుకొందుననెను. అపుడు నీకు ప్రియమైన వారెవరో తెలుపమని గురువడుగగ

నాభార్య, నాకొడుకు, నాబంధువులని అతను సమాధానము చెప్పెను. రేపు అమావాస్య తర్వాత నీ ఇంటికి వస్తాను. అపుడు నీకు ప్రియమైన వారిని నాకు చూపుము. అదే నీవిచ్చు గురుదక్షిణని చెప్పెను.

ఇక మిగిలిన ఏడవ శిష్యుని పిలచి దక్షిణ విషయమై నేనొక మందును కనుగొనవలసి ఉన్నది. దాని పరిశోధనకు నీ శరీరములోని రక్తముకావాలి అదియు అమావాస్య పోయిన విదియనాడు అవసరమనెను. ఆ శిష్యుడు ఆస్పత్రిలో ఎందరో రక్తదానము చేయుచుందురు. దానికంటే తక్కువ ఈ కార్యముకాదు కావున తప్పక ఇస్తానని మాట ఇచ్చెను.

ఇలా ఏడుమంది శిష్యులు గురువుగారు కోరినట్లు తమ తమ దక్షిణలు గురువుగారికి తప్పక సమర్పించ వలెననుకొనుచుండిరి. ఇంకా అమావాస్య 15 దినములు ఉన్నది కదా! మొదటి శిష్యుడు గురువుగారికి ఇచ్చిన మాట ప్రకారము ఇంటిలో విందుభోజనము తయారు చేయుటకు ఇప్పటినుండియే మొదలు పెట్టవలసివున్నది. ఎందుకనగ అతని భార్యకు జ్ఞానమంటే ఏమిటో తెలియదు. పైగా ఇంటిలో సొమ్ము పైసా పోకూడదను భావము గలది. భర్త ఇష్టము కాక అంత తన ఇష్టప్రకారమే జరుగవలెననెడిది. భర్తవైపు బంధువులెవరొచ్చిన మంచి నీళ్లు కూడ ఇచ్చినది కాదు. శిష్యునకు ఇదొక పరీక్షలాగైనది. పదిహేను రోజుల ముందునుంచి భార్యను సినిమాలకు పిలుచుకపోయి ఇష్టమొచ్చిన చీరలన్ని కొనిచ్చి కొద్దిగ మంచిగ మాట్లాడునట్లు చేసుకొన్నాడు. భార్య నెమ్మదిగ మాట్లాడు సమయములో తన లోపలనున్న విందుభోజనము మాట చిన్నగ చెప్పాడు. భార్య ఆ మాట వింటూనే తోక తొక్కిన పాము మాదిరి లేచి అడ్డము వచ్చిన వారందరికి వండి పెట్టే దానికి నేనేమి పనిమనిషిని కాదు అని మొదలు పెట్టింది. అయినా బుజ్జగించి ఇదే చివరి కోరికని చెప్పి లేకపోతే నా మర్యాద పోతుందని, ఏమేమో చెప్పి చివరకు విందుభోజనము పెట్టునట్లు ఒప్పించుకొన్నాడు. ఇన్ని రోజుల గురువుగారు చెప్పిన జ్ఞానముకంటే ఇపుడు నేను శ్రమపడిందే ఎక్కువనుకున్నాడు.

అమావాస్య దినము రానే వచ్చినది. మొదటి శిష్యుడు ఉదయమే తన భార్యకు మరొకమారు చెప్పి గురువుగారి వద్దకు వచ్చి గురువుగారిని భోజనమునకు పిలుచుకొని మధ్యాహ్నము 12 గంటలకు ఇంటికి పోయెను. పాపమాతని భార్య ఏమియు చేయలేదు. గురువుగారిని మంచము మీద కూర్చోబెట్టి భార్యకు ఏమి చెప్పుకొనెనో ఏమో ఆమె వంట చేయను మొదలు పెట్టినది. పాపము గురువుగారు విందు భోజనము కదాయని ఉదయము కూడ ఏమి తినిరాలేదు. వేళకు కాస్త అన్నమైన పెట్టుతారని ఎంత ఎదురు చూచిన ఫలితము లేదు. వీరు లేదుపో అనేవరకు అట్లే కూర్చోవాలనుకొన్న గురువుగారికి సాయంకాలము 4 గంటలకు మామూలు భోజనమే ఆ ఇల్లాలు పెట్టినది. ఈయన గురుదక్షిణ ఇచ్చిన పోయె ఇవ్వక పోయిన పోయె నన్ను ఆకలితో కూర్చోబెట్టిరే అనుకొని దొరికిందిచాలని తిని బయటికొచ్చాడు గురువు. గురువుతో పాటు భోంచేసి బయటికొచ్చిన శిష్యుని చూచి నీవు రేపు పౌర్ణమి దినము నావద్దకురమ్మని చెప్పి బయలుదేరి వచ్చెను.

రెండవ శిష్యుడు రాత్రిభోజనము కొరకు సాయంకాలము ఐదుగంటలకే గురువు గారితో కలిసినాడు. మొదటి అనుభవమును చూచిన గురువుగారు రెండవ శిష్యుడు రాత్రిభోజనమునకు పిలుస్తున్నను నేను రానని చెప్పెను. అయినప్పటికి ఆ శిష్యుడు తప్పక రావలయునని పట్టుపట్టెను. నాకోసము అన్నము చేసారా అని గురువుగారు ముందుగనే అడిగితే మీకోసమే చేసామని తప్పక రావలయునని అతను గట్టిగ ఉన్నందువలన ఇతను ఇంకా పెళ్లికాని వాడులే ఇంట్లో భార్య ఉండదు కదా పరవాలేదులే అని గురువనుకొని శిష్యునితో బయలుదేరి పోయెను. ఇంటికి పోయిన వెంటనే గురువుగారికి అన్నము పెట్టమని శిష్యుడు తల్లిని కోరెను. ఆ మాట విన్న వెంటనే అతని అమ్మగారు

బిగ్రుగ అతని వైపు చూస్తు నీకు సాయంకాలమే ఏమి చెప్పాను అని గద్దించింది. ఆమె అలా చూడడములోనే నేను వద్దు అని చెప్పితే నీవెందుకు పిలుచుక వచ్చావన్నట్లు గురువు అర్థము చేసుకొన్నాడు. సాయంకాలమే ఏమి చెప్పాననడములో గురువుగారి నమ్మకము ధృడమైపోయినది. శిష్యుడు ఏమి మాట్లాడక లోపలికి పోయాడు. గురువుగారు ఎంతో స్థోమతపరుడై కూడ తనకు అన్ని ఉండి కూడ అలా అనిపించుకోవడము అవమానము కాదా. అయినప్పటికి గురువుగారు ఓర్చుకొని నేను ఏమి మాట్లాడిన లేక అచటి నుండి వచ్చిన శిష్యుడు బాధపడునని కక్కలేక మ్రింగలేక ఒక రాయిలాగ కూర్చొన్నాడు. కొద్దిసేపటికి శిష్యుని పిలిచి ఆకలిగ లేదని అల్పాహారముతో సరిచేసుకొని బయటపడ్డాడు. శిష్యుని చూచి నీవు పౌర్ణమి దినము నావద్దకు రమ్మని చెప్పి బయలుదేరివచ్చెను.

మొదటి శిష్యుని భార్య ఏమి మాట్లాడకుండ సాయంకాలము 4 గంటలకు అన్నము పెట్టి పంపితే రెండవ శిష్యుని ఇంటిలో ఘాటైన మాటలు కూడ తినవలసి వచ్చిందేననుకొన్నాడు గురువుగారు. ఇక మూడవ శిష్యుని ఇంటికి పోకుండ తన ఎకరము భూమి గురించి అడగాలనుకొన్నాడు. మూడవ వానిని పిలచి నేనడిగిన గురుదక్షిణ ఎకరము భూమి ఇస్తావా అని అడిగాడు. గురువు అడిగినపుడు ఇవ్వాలని నిశ్చయించుకొనిన శిష్యుడు 15 దినములు గడచిపోయింది కదా మొదటి నిశ్చయము తనలో లేక పోయినది. తన ఇంటిలోని వారు వద్దంటున్నారని కావలసివస్తే పదివేలు డబ్బు ఇవ్వమని చెప్పారని చెప్పాడు. గురువుగారు నవ్వుకొని నేను డబ్బు అడుగలేదు పొలము కదా అడిగినదని తిరిగి అడిగాడు. ఆ మాటకు శిష్యుడు వివరముగ పొలము ఎకరము 50 వేలు చేస్తుంది. అంత విలువైన భూమి వద్దంటున్నారు 10 వేలు ఇవ్వమంటున్నారు అన్నాడు శిష్యుడు. ఆ మాట విన్న గురువు సరే ఆ పదివేలు తీసుకొని పౌర్ణమి దినము నావద్దకు రమ్మన్నాడు.

నాల్గవ శిష్యుడు అసలు కనిపించలేదు. అతనిని పున్నమి దినము తనవద్దకు రమ్మని చెప్పమని గురువు ఇతరులతో చెప్పి పంపెను. ఇక ఐదవ వానిని పిలిచి అమావాస్య పోయింది కదా నీవు ఇచటనే ఉండమని గురువు తెలుపగ ఆ శిష్యుడు స్వామి గారికి నమస్కరించి మా ఇంటిని, మా అన్న తమ్ములను, తల్లిదండ్రులను, భార్య పిల్లలను విడచి ఇక్కడ ఉండలేనని ఖచ్చితముగ చెప్పి ఇదితప్ప ఇక ఏదైన చెప్పండి చేస్తాననెను. ఆ మాటకు గురువుగారు నవ్వి రేపు పున్నమి దినమున నావద్దకు రా అపుడు చెప్పుదునని చెప్పి పంపివేసెను.

ఇక ఆరవ శిష్యుడు రాలేదు కావున గురువుగారే అతని ఇంటికి పోయి మంచములో పడుకొనివున్న శిష్యుని చూచి పలకరించాడు. ఏమయ్యా నీ ప్రియమైన భార్య, నీ కుమారుడు, నీ బంధువులు ఎక్కడ వారిని చూచి పోవాలని వచ్చా అన్నాడు. అందులకు ఆ శిష్యుడు కళ్లవెంట నీరుకార్చుచూ నీవు అడిగిన గురుదక్షిణ ఇపుడు ఇవ్వలేను. వారిని చూపలేను తర్వాత కొద్ది రోజులకు చూపగలనన్నాడు. ఇపుడేమి ఎందుకు చూపలేవని గురువు అడిగాడు. అందులకా శిష్యుడు మొన్ననే మేమొక జ్ఞానవిషయమును గురించి వాదులాడుకొన్నాము. నా కొడుకు నా వాదనకు కోపపడి నాకాలు విరగకొట్టినాడు. అందువలన మంచములో పడిపోయాను కొద్దిగ బాగైన తర్వాత వారిని చూపగలను వారు ఇపుడు ఇక్కడలేరని చెప్పాడు. నీవు నీకాలు బాగుచేసుకొని పున్నమి దినమునకు నా వద్దకు రాగలవా అని గురువు అడిగితే సరే అలాగే రాగలనని శిష్యుడు చెప్పాడు.

ఏడవ శిష్యుని వద్దకు వచ్చి నా అవసర పరిశోధనకు నేను కావాలన్నది ఇస్తావా అన్నాడు. శిష్యుడు సరేనని ఒప్పుకొన్నాడు. గురువుకు ఆశ్చర్యమేసింది వీడేమి నా భార్య వద్దంటుందని, మా అమ్మ వద్దంటుందని చెప్పలేదే

అనుకొని తిరిగి ఇలా అన్నాడు. నాకు కావలసింది కేవలము రక్తమే కాదు శరీర భాగములోని ఒక చేయి నరికివ్వాలి అక్కడి నుండి స్రవించిన రక్తము కావాలి పూర్తి చేయి తెగిన రక్తమే నా పరిశోధనకు అవసరమన్నాడు. ఆ మాట విన్న శిష్యుడు మరీ సంతోషపడి భూమి మీద పుట్టినందుకు ఏమి ప్రయోజనము అనుకొన్న నాకు మీరు గురుదక్షిణగ నా శరీర భాగములోని రక్తము అడగడము చాలా సంతోషము. బ్రహ్మవిద్యను బోధించిన గురువుకు ఉపయోగపడుటకంటే ఈ ప్రపంచములో నాకేదిమిన్న కాదనెను. అపుడు గురువు మీవారెవరు ఏమి అనరా అని అడిగెను నా శరీరము నా ఇష్టము. నావారు మీరే కాని ఈ శరీరమునకు సంబంధించిన వారు నావారు కారు అని శిష్యుడుత్తర మిచ్చెను. ఆ మాటలు విన్న గురువు అయితే రేపు వచ్చే పున్నమి దినమున నీవు నా వద్దకు రమ్మని చెప్పి పోయెను.

ఇలా అందరిని పున్నమి దినమున రమ్మని చెప్పిన గురువు ఆ దినమున అందరి కోసము ఆశ్రమములోనే ఉండెను. ఏడుమంది శిష్యులు అక్కడికి చేరారు. అందరిని చూచి మొదటి శిష్యునితో ఇలా అన్నాడు. "ఏమయ్యా ఊరకనేగాక గురుదక్షిణగ నీ ఇంటికి విందుభోజనానికి వస్తానని చెప్పితే సాయంకాలము 4 గంటలదాక అన్నము పెట్టరా! మా ఆశ్రమములో నీకెపుడైన అంత ఆలస్యముగ అన్నము పెట్టి ఉంటిమా" అని అడిగాడు. ఆ మాటకు శిష్యుడు తటపటాయిస్తు ఇందులో నా తప్పేమి లేదు స్వామి నా భార్యకు ఏమి తెలియదు ఒట్టి అమాయకురాలు ఏమి చెప్పిన అర్థము కాదు. అందువలన ఆలస్యముగ చేసింది అన్నాడు. ఆ మాట విన్న స్వామి తలూపి "ఆమెకు అర్థము కాకపోతే మీరు తెలియచెప్పాలి అన్నాడు. నచ్చజెప్పిన దానివలననే ఆలస్యముగనైన చేసింది లేకపోతే అసలు చేసేదే కాదు. పైకి అలాగుంటుంది కాని లోపల చాలా మంచి మనసు. అందువలన నేను ఏమి అనలేక పోయానని శిష్యుడన్నాడు. అపుడు గురువు నవ్వి చూడు నాయన దాదాపు 2000 సంవత్సరముల పూర్వమొక పేరు పొందిన గురువు ఇలా అన్నాడు. **"ఎవడైనను నా వద్దకు వచ్చి తన తల్లిని తండ్రిని భార్యను పిల్లలను అన్నదమ్ములను అక్కచెల్లెండ్లను తన ప్రాణమును సహా ద్వేషింపకుంటే వాడు నా శిష్యుడు కానేరడు"** అన్నాడు. ఆ గురువు వాక్యానుసారము నేను గురువునే కాబట్టి అదే అనుచరణ అనుసరించాలి. నీవు నా వద్దకు వచ్చి తప్పు చేసిన భార్యను ద్వేషింపక సమర్థించి మాట్లాడావు కావున నీవు నాకు శిష్యుడవు కానేరవు.

ఇలా మొదటి శిష్యుని తేల్చివేసిన గురువు రెండవ శిష్యుని చూచి "ఏమయ్యా నీ ఇంటికి పిలుచుక పోయి మీతల్లిగారు సభ్యతగ మాట్లాడక పోతే నీవు మౌనముగ ఉంటావా వచ్చిన వ్యక్తి ముందర అలా నిన్ను కోపముగ చూడడము గద్దించి మాట్లాడడము వచ్చిన వ్యక్తికి చిన్నతనము కాదా!' ఏమిటి సమాధానమని అడిగెను. అందులకా శిష్యుడు మాతల్లిగారు మీ విషయమై కోపగించుకోలేదు నేను బజారులో సరుకులు తేలేదని అలా ప్రవర్తించిందనెను. ఆ మాట విన్న గురువు "వచ్చిన వ్యక్తి గొప్పవాడను భావము ఏమాత్రముండిన ఈయన ఏమనుకుంటాడేమోనని కొంతైన యోచన ఉండెడిది. అలాంటి గొప్ప భావము ఏమాత్రము లేదు" కావున వారలా ప్రవర్తించారు. అలాంటి ప్రవర్తన నిన్ను దండించునదైన మాముందర ప్రవర్తించడము మా విలువకు ఏమాత్రము మర్యాద ఇవ్వకపోవడము, మీకెలాగున్న మాకు పూర్తి చిన్నతనము. నాకు జరిగిన చిన్నతనమును గురించి నీవు చింతించక పోవడము శిష్యుని లక్షణము కాదు" అన్నాడు. అపుడు శిష్యుడిలా అన్నాడు "లేదు స్వామి! నాకు కూడ స్వామి ఏమైన అనుకొన్నాడేమోనని మావారిని దండించాలను కొన్నాను. కాని గురువుగారి విషయమై తల్లిదండ్రులతో తగాదాపడితే బాగుండదనుకొన్నాను". ఆ మాటకు గురువుగారు నవ్వి "నా విషయమై తగాదా పడకపోతే ఆత్మబంధువైన నాకంటే శరీరబంధువులైన మీవారే ఎక్కువన్న భావము బయటపడగలదు. నాకోసము మీ ఇంటిలోని వారితో తగాదాపడినప్పటికి పరవాలేదు. ఈ

విషయమై రెండువేల సంవత్సరముల క్రితమొక గొప్ప గురువిలా అన్నాడు. **"నేను భూమి మీద సమాధానము కలుగజేయ వచ్చితినని మీరనుకొను చున్నారా! కాదు భేదమునే కలుగజేయవచ్చితినని మీతో చెప్పుచున్నాను. ఇప్పటినుండి ఒక ఇంటిలో ఐదుగురు వేరుపడి ఇద్దరికి విరోధముగ ముగ్గురు, ముగ్గరికి విరోధముగ ఇద్దరు ఉందురు. తండ్రి కుమారునికి కుమారుడు తండ్రికి, తల్లి కుమార్తెకు కుమార్తె తల్లికి, అత్త కోడలికి, కోడలు అత్తకు విరోధులుగ ఉందురు".** ఆనాటి గురువు వాక్యానుసారము జ్ఞానమార్గమును అనుసరించు వారికిలా భేదములు కలుగుట తథ్యము. అలా జ్ఞానవిషయమై తగాదా పడనివారు జ్ఞానమార్గములో లేనట్లే. ఈ జ్ఞానపద్ధతి నీకు ఇబ్బంది కలుగజేస్తున్నది. కావున నేటినుండి ప్రాణము లేని చిత్రములకు మ్రొక్కుకుంటూ మంచిచెడ్డ చెప్పని బొమ్మలకు పూజచేసుకో! వాటి వలన ఏ ఇబ్బంది ఉండదు అని రెండవ శిష్యుని మందలించిన గురువు మూడవ శిష్యునితో మాట్లాడడము మొదలు పెట్టాడు.

నీకున్న 150 ఎకరములలో ఒక ఎకరము గురుదక్షిణ అడిగితే మావాల్లు వద్దన్నారు కావలసివస్తే పదివేలు ఇస్తానంటావా! నీ ఎకరము పొలము తీసుకొని నేనేమి చేస్తానయ్యా నీకు జ్ఞానధనము మీద ఆశ లేదు. ప్రపంచ ధనము మీదనే నీకు ఆశ ఉందని దాని ముందర గురువు జ్ఞానము ఏమి కనిపించదని తెలుపుటకే నిన్నలా అడిగాను. నీకున్న ఆస్థియందు ఉన్న ఆకాంక్ష వలన నీకు మోక్షము దూరము కాగలదు. ఈ విషయమై రెండువేల సంవత్సరములనాడు ఒక గురువు ఇలా అన్నాడు. **"తమ ఆస్థియందు నమ్మకముంచువారు దేవుని రాజ్యములో ప్రవేశించుట ఎంతో దుర్లభము! ధనవంతుడు దేవుని రాజ్యములో ప్రవేశించుటకంటే ఒంటె సూది బెజ్జములో దూరుట సులభము"** కావున జ్ఞానము తెలుసుకొన్నప్పటికి నీ మమకారము జ్ఞానముమీదకంటే ఎకరమాస్థి మీదనే ఎక్కువ ఉన్నది. కాని ఒక్కటి జ్ఞప్తికి పెట్టుకో దైవజ్ఞానమునకు ఉపయోగపడని ఆస్థిగాని, ధనముగాని నిష్ప్రయోజనమని తెలుసుకో.

ఇక నాల్గవ శిష్యుని చూచి నా శత్రువుమీద దాడి చేయమని నీకు చెప్పితే సరేనని ఒప్పుకొని తర్వాత చిన్నగ జారుకొంటావేమయ్య పైగా గురువుగారికి కోపము ఎక్కువ అతని తగాదాలలోనికి పోతే మనకు మర్యాద ఉండదని గురువుగారు ఎంత జ్ఞానము చెప్పిన మనము కొన్ని పనులు ఆలోచించి చేయాలని ఇతరులతో అంటావా. గురుసేవలలో మూడవ సేవ అయిన భావసేవలో గురువును తల్లిగ, తండ్రిగ అన్నదమ్ములుగ భావించుకోవాలని తెలుపలేదా! ఆ భావము నీలో ఉన్నదా! నీ అన్న మీదకో నీ తండ్రిమీదకో ధ్వజమెత్తినవారి మీదకు నీవు కొట్లాటకు పోకుందువా. జ్ఞానము నేర్చుకొన్నంతవరకు గురువుతో అవసరమనుకొను నీలాంటి శిష్యులు నాకవసరము లేదు. ఇలాంటి వారిని గూర్చి రెండు వేల సంవత్సరములనాడు ఒక గొప్ప గురువు ఇలా అన్నాడు. **"కొంత కాలము వారు నిలతురుగాని జ్ఞాననిమిత్తము శ్రమయైనను హింస అయినను కలుగగానే అభ్యంతరపడుదురు".** ఆనాడు చెప్పిన ఆయన మాటలు తూచ తప్పకుండునట్లు నీవు తేలావు. జ్ఞాన నిమిత్తము కల్గు శ్రమగాని, హింసగాని, సంతోషముగ ఎదుర్కొను వారికే దైవ సాన్నిధ్యము లభ్యమవునని తెలుసుకో.

అట్లే ఐదవ శిష్యుని చూచి నిన్ను నావద్ద సంవత్సరకాలము ఉండమంటే మావారిని మా ఇంటిని వదలి ఉండలేనంటావేమయ్యా. రేపు అందరిని వదలి మరుజన్మకు పోవలసివస్తే అపుడు ఇలాగే చెప్పగలవా? గురువు ఆదేశించినపుడు దేనినైన వదలవలసి ఉండవలయును. జ్ఞానము కొరకు, దైవము కొరకు దేనినైన విడువగల త్యాగముండినపుడు దైవసాన్నిధ్యమును సులభముగ చేరగలవు. ఈ విషయమును గురించి పూర్వము రెండువేల సంవత్సరములనాడు ప్రకృతినే శాసించగలిగిన గురువు ఇలా అన్నాడు. **"మోక్షము నిమిత్తము ఇంటినైనను భార్యనైనను**

**అన్నదమ్ములనైనను తల్లితండ్రులనైనను పిల్లలనైనను విడిచిపెట్టినవాడు ఇహమునందు చాలా రెట్లును పరమునందు నిత్య జీవనమును పొందునని మీతో నిశ్చయముగ చెప్పుచున్నాను"** చూచావా మహాత్ములు చెప్పిన వాక్యము. నీవు జ్ఞానమును తెలిసికూడ దానికి తక్కువ విలువ ఇచ్చావు.

కాలునొప్పి ఉన్నను మిగుల శ్రమమీద వచ్చిన ఆరవ శిష్యుని చూచి చిన్నగ నవ్వి నీకిష్టమైనవారు భార్య కొడుకన్నావే, నేను లేనిది వారుండలేరు అన్నావే, నీ వారికి నీ మీద అంతప్రేమ ఉందా. ఇలా కాలు విరగ్గొట్టి మూలకునూకడము ప్రేమంటావా! నీ కొడుకు కాలు విరగ్గొట్టితే నీ భార్య వారించలేకపోయిందే. నీ మీద ప్రేమ ఉన్నదైతే కొడుకును దూషించలేక పోయిందే. చూడవచ్చిన బంధువులు నీ మీద ప్రేమ ఉన్నవారైతే ఇది న్యాయము ఇది అన్యాయమని నీ కొడుకును నిలదీయలేదే, పైగా వారు మానాన్న ఈ తప్పుపని చేసి ఉంటే కొట్టామని లేని తప్పును అంటగట్టితే నీవు ఎటువంటివాడవని యోచించక ఆ తప్పు చేసింటే ఈ కొట్టు కొట్టారులే అనుకొని చూచిపోతారా. ఇటువంటి వారా నీకు ప్రియమైనవారు. ఇంత జరిగినప్పటికి వారిని ఏవగించుకోలేక పోయావు కావున వారికి నీమీద కాదు. నీకు వారి మీదనే ఎక్కువ మమకార ముందని చెప్పవచ్చును జ్ఞానమార్గమునకు ఇటువంటి మమకారము పూర్తి వ్యతిరేఖము. ఈ విషయము గ్రహించిన బుద్ధుడు యవ్వన భార్యను, శిశుదశ కుమారుని వదలి అడవికి పోయాడు. లేకపోతే నీ మాదిరే బుద్ధున్ని కూడ కాలు విరగ్గొట్టి ఇంటిలో కూర్చోబెట్టేవారు. ఇప్పటికైన వారు నీకు శత్రువులని తెలుసుకో, జ్ఞానమార్గములో ప్రవేశించు, ప్రతివానికి వాని ఇంటిలోనే శత్రువులు ఉంటారని గ్రహించు, అటువంటి వారు నీకు వ్యతిరేఖముగ ఉంటారుగాని ప్రేమగలవారు కాదని గ్రహించు. దీని విషయమై రెండువేల సంవత్సరముల నాటి ఒక గొప్ప గురువు తన శిష్యులతో ఇలా అన్నాడు. **"తల్లిదండ్రుల చేతను సహోదరుల చేతను బంధువుల చేతను మీరు నేరస్తులుగ అప్పగింపబడుదురు. వారు మీలో కొందరిని చంపింతురు".** చూచారా ఆనాటి అవతార పురుషుడు ఎలా తన శిష్యులను హెచ్చరించాడో కాని ఈనాడు మాలాంటి గురువులు శిష్యులను ఏమి దండించలేక వారు వక్రమార్గములో పోవుచున్నను చూస్తూ ఉండవలసి వచ్చినది. దండిస్తే వినే జ్ఞానము కూడ వినరని గురువుల భావము నేను అలాకాక నా శిష్యులను బాగుపరచాలని నిన్ను దండించుచున్నాను నిన్ను బాధపెట్టు వారు నీకు అభిమానులు కారు శత్రువులు. వారిని ఇంకను ఆత్మీయులుగ తలచి తర్వాత చూపగలనని నాకు చెప్పిన నీకు సిగ్గులేదు. నిన్ను దుష్ప్రచారము చేసిన వాని ముఖము కూడ నీవు చూడకూడదు అని దండించిన ఆ గురువు ప్రక్కకు తిరిగి ఏడవ శిష్యుని చూచి ఇలా అన్నాడు.

నేను ఏ వైద్యము కోసము మందు తయారుచేయలేదు. అయినప్పటికి అటువంటి సాకు చెప్పి నాకు శరీర అవయవము దాని రక్తము కావాలన్నాను. ఏమాత్రము జంకక అటులనే ఇస్తానని ఒప్పుకొన్నాడు ఇతడు, చివరకు ఇచ్చుటకు కూడ సిద్ధపడినాడు అయిన నాకు అవసరము లేదు. ఇదంతయు మిమ్ములను పరీక్షించుట కొరకు చేసినదని తెలియండి. నేను మీకు ఎంతో జ్ఞానము తెలిపాను. అదంతయు విన్న మీరు నన్ను ఎంతగానో పొగిడారు. మీ భావము మాటలలోనా, చేతల్లోనా అని పరీక్షించాను. ఒక్కని దగ్గర తప్ప మిగత ఆరుమందివద్ద మాటలలోనే ఉన్నది. నేను బ్రహ్మవిద్య నేర్పిన గురువును, నేను మీకు ఆత్మబంధువును మీతల్లితండ్రులకు మీరు బింధుపుత్రులైతే నాకు మీరు నాదపుత్రులు, శరీర బంధువులకంటే ఆత్మబంధువు ఎంతో మేలుచేయువాడు. అయినప్పటికి మీరు అది గ్రహించక శరీరబంధువుకే ఎక్కువ విలువిచ్చారు. గత చరిత్రలో ఆత్మబంధువుకే ఎక్కువ విలువ ఉండెడిది. కేవలము ప్రపంచ విద్య నేర్పిన ద్రోణునికి శత్రువైన ఒక రాజును కట్టి తెమ్మంటే గురుదక్షిణగా అర్జునుడు తెచ్చిచ్చాడు. ఏకలవ్యుడు

తన చేతి వ్రేలిని గురుదక్షిణగ నరికి ఇచ్చాడు. ఇక దైవమార్గము కోసము ప్రహ్లాదుడు వారి తండ్రినే ఎదిరించాడు. మశ్చీంద్రుడు తన భార్యను వదలినాడు. బుద్ధుడు కుమారున్ని, తల్లిదండ్రులను, భార్యను వదలిపోయినాడు. తుకారామ్ తన వ్యాపారాన్ని, ఇంటిని, ఆస్తిని వదలుకొన్నాడు. ఎందరో మహాపురుషులు ఇది మార్గమని సూచించారు. అయినప్పటికి మీరు మొదటివలె నుండి మీమీ శరీర బంధువుల మీదనే మమకారము పెంచుకొని ఆత్మబంధువును గుర్తించలేక పోయారు. మీరు పురుషులై కూడ ప్రతి దానికి అస్వతంత్రులుగ చెప్పుకొనుచు ఇంటిలోని వారికి భయపడునట్లు చెప్పుచు వచ్చారు. మీరు మగవారై, సంపాదించి కొందరిని పోషించు స్థోమత ఉండి, జ్ఞానవిషయముల ఎడల ఇతరులకు భయపడడము మీలోని అజ్ఞానానికి నిదర్శనము. మీకంటే స్త్రీ అయిన మీరాబాయి ఏ స్వతంత్రము లేనిది, ఆడదై స్వతంత్రములేనిదై చిన్న వయస్సు గలదై కూడ దైవమార్గము ఎడల ఎట్లు ధైర్యముగ నడచుకొన్నదో చెప్పెదను వినండి. ఆమె చరిత్రను చూచి మీరు జ్ఞానము తెచ్చుకోండి.

శ్రీకృష్ణ భక్తురాలైన మీరా నిత్యము అతని భక్తికీర్తనలు పాడుకొనుటకు కూడ స్వతంత్రములేనిదై పడుకొనే సమయములో కృష్ణగానము చేసెడిది. అయినప్పటికి భర్తకు, మరిదికి, ఇంటిలోని అత్తకు, ఆడబిడ్డకు సరిపోయెడిది కాదు. ఆ రోజులలో మీరా కృష్ణ దేవాలయమునకు పోవుచుండెడిది. రాజపుత్రిక కనుక ఆమెకు "సితార" చక్కగా వాయించుటకు వచ్చును. ఆమె భక్తులతో చేరి అప్పుడప్పుడు భజనలొనర్చెడిది. ఇంకేమున్నది ఆడబిడ్డయిన ఉదాదేవి ఎన్నో ప్రచారములు లేవదీసినది. భక్తులను పేర వంచకులైన వారితో ఆమె సంబంధములు పెట్టుకొనుచున్నదని భోజునకు నూరిపోసెను. ఆతడు కొంత సాత్త్వికుడు. భార్యయందు ప్రేమాదరములు గలవాడు. మొదట ఉపేక్షనే వహించెను. కాని దినదినము తల్లియు, సోదరియు చెవినిల్లు కట్టుకొని పోరుచుండిరి. కృతక సాక్ష్యములు గల్పించిరి. భర్తయు మీరా ప్రవర్తనను శంఖించు పరిస్థితికి వచ్చినాడు. ఒక దినము ఉదాదేవియు అతనుడును కృష్ణాలయమునకు వచ్చినారు. ఆలయ ద్వారములు బంధింపబడియున్నవి. లోపల మీరా ఒక్కతియే విగ్రహము ఎదుట కూర్చుండి భజనయొనర్చుచుండెను. ఆమె ఆవేశముతో నడుమ నడుమ "గిరిధరుని"తో మాటలాడుచుండినది. ఆమె అతనిని వింత వింత ప్రశ్నలడుగుచుండెను. ఏదో పురుషకంఠము ఆ ప్రశ్నలకు బదులొసగుచుండెను. ఉదాదేవియు భోజుడును వాకిండ్లకు చెవులాన్చు కొని వినుచున్నారు. భోజుని అనుమానము ధృడపడెను. అతడు వాకిండ్లు త్రోసుకొని లోపలికొచ్చెను. ఇంత వరకు వినపడిన పురుషకంఠమేదీ? అని అతడాలయమునంతయు గాలించెను. ఒక మగపురుగు లేదు. అతడు నిస్థబ్దుడై భార్య ఎదుట నిలచెను. ఆమె భోజుని అభిప్రాయమును గ్రహించినది. ప్రక్కనే ఉదాదేవి ఉన్నది. మీరా కృష్ణ ప్రతిమను చూపి నాతో ఇంతవరకును మాటలాడుచున్న మగవాడీతడే. వానిని చేతనైన చంపమని ఏడ్చుచు పలికెను. ఆ ఏడ్పులోనే ఆమె మూర్ఛపోయినది. భోజుని మనస్సు నీరైనది. ఉదాదేవి పశ్చాత్తాప పడినది. కాని ఆ సద్భావము క్షణికము. ఆమె వదినెను ముద్దాడపోయినది. ఆమెకు తాత్కాలికముగ వదినపై ప్రీత్యాదరములేర్పడెను. వానిని తెలుపు చేష్టా విశేషమే చుంబనము. కాని భోజుడామెనడ్డెను. పవిత్ర ప్రవర్తనవతియైన తన భార్యను శంఖించునందులకై ఒకింత అసంతృప్తి కలిగినది. కాని అదియు క్షణికమే. అనేకాలోచనలు అతని మనస్సున పారాడజొచ్చినవి. అతడింటికి పోయెను. మీరా భజన ముగించి గదిలో ప్రవేశించినది. భర్త మరల ఆవేశితుడయ్యెను. అతడు ఖడ్గమును పట్టుకొని ఆమె గదిలో ప్రవేశించినాడు. మీరా అలసి నిద్రించుచున్నది. ఆ ముఖమును చూచినంతనే అతనికేదో మనస్సు మారినది. అతడు నిర్మళముగా వెనక్కువచ్చెను. ఆనాటి నుండి తన బార్యకు పిచ్చి ఎక్కినదని అతని నమ్మిక. ఆమె మనస్సునకు కష్టములు కల్గించు కొన్ని విశేషములు జరిగి ఉండెను. ఆమె తండ్రి గతించినాడు. ఆ రాజ్యమున విప్లవము రేగినది. కడకు రాజ్యమే మిగులక పోయెను. మీరాబాయి మనస్సున ఇవి అల్పపదార్థములు. భర్త ఆమె

మానసికస్థితిలో లేదు కనుక ఈ సన్నివేశములతో ఆమెకు మానసికారోగ్యము చెడిపోయెనని తలంచెను. మీరాకు పిచ్చిపట్టినదను భర్త వాక్యమును లోకము నమ్మలేదు. వారి చూపు దోషైకదర్శి. కడకాతడు ఆమెకు అంతఃపుర సమీపమందే ఒక కృష్ణాలయమును కట్టించి ఇచ్చెను. ఆమె ఆ గుడిలో భజన కీర్తనాదులు చేసెడిది. ఆమె పదరచనలు తానే సాగింప మొదలుపెట్టెను. ఆవేశముతో అవి హృదయము నుండి వచ్చెడివి. ఆ పద మాధుర్యము కృష్ణపరమాత్మనే వలపింప చేయుచుండెను. సంగీతమున గొప్ప ప్రవేశము కలది అగుటచే వింత వింత రాగములలో ఆమె పదములను సృష్టించెను. రాను రాను ఆమె కీర్తి దేశములోనే ఎక్కువయ్యెను. ఆ కీర్తి "తాన్‌సేన్" చెవిలో కూడ పడినది. అప్పుడాతడు సంగీత సామ్రాజ్యమునకు చక్రవర్తి. అక్బరు సార్వభౌముడు కూడ స్వయముగ ఆమె సంగీతమును వినాలని ఆకాంక్షించెను. కాని ఆమెను దర్శించుట ఎట్లు? చిత్తూరు రాజులు వారికి ఆగర్భ శత్రువులు. అయినా అక్బరు మహా సాహసోపేతులు కనుక వారొక ఉపాయము ఆలోచించిరి. ఆమె భజన చేయునప్పుడెందరో సాధువులు మీరాతో చేరి పాడుచుండిరి. వారు భిక్షువులు దేహాభిమానవర్జితులు అట్టి వారితో ఆమె మాట్లాడెడిది. అక్బరు చక్రవర్తి ఆమె దర్శనమునకై భిక్షుక వేషము ధరించెను. 'తాన్‌సేన్' కూడ ఒక బిక్షగాడైనాడు ఆ రసపాంథులిర్వురును గాన భిక్షకై ఆమెచెంతకు అరుదెంచిరి మీరా సౌందర్యము జగన్మోహకము. ఆమె కృష్ణ పరమాత్మ ఎదుట లీలార్థమవనికి దిగివచ్చిన రాధాదేవివలె పాడుచుండెను. ఆ కంఠమున కృష్ణ వేణుగాన మాధుర్యములున్నవి. ఆ భజన సాగుచున్నంత సేపును తాన్‌సేన్, అక్బరులు రససముద్రములోనున్నారు. భజన ముగిసిన తర్వాత అక్బరుచక్రవర్తి ఆమె పాదములు స్పృశించి నమస్కారము చేసినాడు. అక్బరు మహామనస్వి భారతదేశ చరిత్రలో విచిత్రమైన చక్రవర్తి. అతడు ఆమెకొక రతనాల హారము నొసగెను. దానిని ఆమె గ్రహింపలేదు, నాకెందుకన్నది, కృష్ణ పరమాత్మునకు సమర్పింపమని అతడు వినయ పూర్వకముగననెను. ఆమె ఆ హారమును రాధాకృష్ణుల పాదముల చెంత వేసినది. కాషాయాంబార ధారియైన భిక్షకునికడనేమి? రతనాల హారమేమి? ఈ కథ ఆ ఊరిలోనల్లుకొన్నది. వచ్చినవాడు అక్బరుచక్రవర్తి అను విషయము బయటికి పొక్కినది. ఇది భోజునకు మరణవేధనైనది. ఆనాడు హిందూ ముస్లిముల మధ్యనున్న ద్వేష మింతింత కాదు. అక్బరు చక్రవర్తి పాదములు స్పృశించుటతో ఆమె శరీరమంతయు కళంకితమై పోయినదని భర్త తలంచెను. ఆమెను అతడు ఎందుకో వధింపలేదు. భర్త మీరాను బయటకు తరిమివేసినాడు. ఇకనేమున్నది ఆమె వీధులపడినది. ఇతరుల పాలికైనచో అది మహాకష్టము. ఆమె పాలికిటిది పరమ సంతోషము. ఉన్న కొంత బంధము కూడ ఊడిపోయినది. మీరా వీధులలో బాహాటముగ కృష్ణ సంకీర్తనము కావింపజొచ్చెను. రసముగ్ధ హృదయమున ఆడుటకారంభించెను ఆమె గీతములచే ఆకర్షితులై వందలకొలది భక్తులామె వెంటపడుచుండిరి. అతి ప్రయాస ప్రయాణములతో మీరా బృందావనమును చేరినది. ఆ బృందావనములోని ప్రతి స్థలమును కృష్ణపాద తాకిడిచే పవిత్రమైనది. కృష్ణ విరహితయైన రాధవలె ఆ చోటులలో పిచ్చి దానివలె తిరుగుచున్నది. భజనయే ఆమె సాధనము, కన్నీరే పూజ, ఆత్మార్పణమే నైవేద్యము ఆ మహావ్యక్తికి దేవతలే నమస్కరించుచుండిరి. అప్పుడు బృందావనిలో ఒక రసవర్తన సంఘటనము జరిగినది. అప్పుడక్కడ 'రూపగోస్వామి' అను భక్తుడు ఉండెను. ఇతడు వల్లభ సాంప్రదాయమునకు చెందిన పీఠాధిపతి. 'వల్లభాచార్యుడు' మన కృష్ణదేవరాయల సమకాలికుడు ఆంధ్రుడు మహాపండితుడు. ప్రేమ ప్రధానమైన గోపికాభక్తిని అతడు ఎక్కువ ప్రచారము చేసెను. ఉత్తర హిందూస్థానమున అతనికెందరో కవులు శిష్యులైరి. హిందీ సాహిత్యరంగమున కృష్ణభక్తికి ప్రాధాన్యము వచ్చుటకు ఇతడే మూలకారణము అనవచ్చును. రూపగోస్వామి అను అతనికి స్త్రీలన్నచో భయము వారిని చూచినచో వారి సౌందర్యముచే నాకృష్టమై తన మనస్సు పతితమగునేమోయని అతడు వారిదర్శనమునే నిషేధించెడివాడు. మీరాబాయి అతనిని చూడనేగినది మార్గమధ్యమున ఆమెను శిష్యులడ్డగించి మా గురువును

చూడవీలులేదన్నారు కారణమేమని ఆమె అడిగెను. మా గురువు స్త్రీల ముఖమును చూడరని వారు బదులుపలికిరి. మీరా పకపక నవ్వినది. **"ఇంతవరకు కృష్ణపరమాత్ముడు ఒక్కడే పురుషుడనుకొనుచుంటినే నేటికి మీ గురువొకడు పురుషుడు తయారైనాడన్నమాట. ప్రకృతికి లోబడినవారు పురుషులైనను స్త్రీలయినను నాదృష్టికి స్త్రీలే".** ఆమె మరల నవ్వెను ఈ విషయము రూపగోస్వామికి తెలిసినది. అతడు తన అజ్ఞానమునకు ఎంతయో బాధపడినాడు. ఆమెకు దర్శనమొసగి క్షమాపణము చెప్పుకొనెను. బృందావనమున మహాభక్తులెందరో ఆమెకు శిష్యులైరి. మీరా కీర్తి దేశ దేశములకు ప్రాకినది. ఆమె ఎడల తనుకావించిన అపకృతికి భర్త పశ్చాత్తాపపడెను. అతడు భిక్షుక వేషమున బృందావనము కేగినాడు. ఒకనాడతడు మీరాను భిక్షమడిగెను. ఆమె భిక్ష వేయబోయినది అతడు చిత్రమైన భిక్ష కావలెనన్నాడు. అదేమియని ఆమె అడిగెను ఆమె మరల చిత్తూరునకు రావలెనని అతడు పలికెను. భిక్షకుడై వచ్చినవాడు తన భర్తయని గ్రహించిన ఆమె మారు పలుకక సమ్మతించినది. ఆ జగజ్యోతి చిత్తూరునకు వచ్చెను ఆమె వచ్చిన కొలది దినములకే భర్త మరణించినాడు. అప్పుడు మీరాకు ఇంకను ఇరువదియైదేండ్లు దాటలేదు. అతని తర్వాత అతని తమ్ముడు రత్నసింగు రాజయ్యెను. అతనికి వదినె వాలకము నచ్చలేదు. ఈమెను నాశనమొనర్చువరకును వంశపుమచ్చ పోదని అతని విశ్వాసము. వాడు ఆమెను చంపుటకు ఎన్నో రీతులలో ప్రయత్నించెను. తన అన్న మరణించినప్పుడు ఆమెను సహగమనము చేయమని వాడు నిర్బంధించెను. దానికామె అంగీకరింపలేదు. తన తనువు మనస్సు కృష్ణార్పితములని వాటిపై తనకు హక్కులదేనియు ఆమె నిర్భయముగా తెలిపినది. దీనితో వాడు వేసిన ఎత్తు సాగిరాలేదు. వాడు ఆమెకొకనాడు ఒక బుట్టనుపంపినాడు అందులో కృష్ణసేవకై "పూమాల"లున్నవని చెప్పి పంపెను. మీరా మొదటనే అనుమానపడినది ఆమెకేమి భయమున్నది? కృష్ణ నామస్మరణముతో ఆ బుట్టను తెరచెను. అందులోనున్న నల్లత్రాచు నిజముగా మాలగనే మారినది. మీరా ఆ మాలను కృష్ణపాదములకు సమర్పించెను. మరిది అంతటితో తన ప్రయత్నములు మానలేదు. అతనొకనాడు వాసుదేవ సాలగ్రామమని మరియొక సర్పమును పంపినాడు. నిరంతర కృష్ణపాదార్పిత చిత్తయగు ఆమె ఆ బుట్టను తెరచినది. అందులో నిజమునకు సాలగ్రామమే ఉన్నది. ఇక మరిది రహస్యము పనికి రాదనుకొనెను. ఒకనాడు పచ్చి విషము ఒక పాత్రలో నింపుకొని వచ్చెను. ఆ విషమును త్రాగి మరణింపవలసినదని నిర్బంధించినాడు. మీరా వానిని ధిక్కరింపవచ్చును అయినా గిరిధరుడు తన పాలిటనున్నాడని ఆమెకు తెలియును. ఆమె విషపాత్రను తీసుకొని గుటగుట త్రాగివేసినది. ఆ విషము ఆమెకు అమృతమైనది. మరియొకనాడు రత్నసింగు కంటకశయ్యను పంపి దానిపై శయనింప వలసినదని అతని నిర్బంధము మేరకు ఆమె అట్లే శయనించినది. ఆ కంటకములు క్షణములో పూవులైపోయినవి. ఇటువంటి విచిత్రములు ప్రతి భక్తుని జీవితములో కూడ ఉండును. వారీ సిద్ధశక్తులను కోరరు. అవి భక్తికి బాధకములని వారి తలంపు. కాని పరమాత్ముడు వారి యోగక్షేమమును కంటికి రెప్పవలె రక్షించును.

మరిది పెట్టు బాధలు ఆమెకు నానాటికి దుస్సహములైనవి. కాని ఆమెకొక సమస్య బాధించుచున్నది. స్త్రీకి చిన్ననాడు పుట్టినింట ఉండవలెను. వివాహమైన తర్వాత భర్త ఇంట ఉండవలయును, ముసలి తనమున సంతానమును ఆశ్రయించి జీవింపవలెను. తనకు భర్త లేడు, సంతానము లేదు. కాని భర్త గృహమును వదలిపోవుట తగునో తగదో అను సందేహము ఉండెను. ఈ సూక్ష్మ విషయమును వివరింప వలసినదని ఆమె తులసీదాసునకు వినయముతో ఒక పత్రిక వ్రాసినది. వారప్పుడు కాశీనగరమున ఉండిరి. తులసీదాసు మహాభక్తుడు రామాయణమును రచించిన భక్త కోటీరము. మహాకవిగ మహాభక్తుడుగా అతనికి సరియైన వారు హిందీ సాహిత్యమున లేరనవచ్చును. మీరా తులసీకి వ్రాసి పంపిన పత్రిక ఈ క్రింది విధముగనున్నది.

'స్వామి! మీరు సుఖనిధానులు. భక్తుల దుఃఖమును హరించు కరుణా హృదయులు. మీకు మాటిమాటికి నమస్కరించుచున్నాను. నా హృదయ తాపమును హరింపుడు ఇంటిలోని స్వజనము నా భక్తిని సాగనిచ్చుట లేదు. వారు అనేకమైన ఆటంకములను కల్పించుచున్నారు సాధుసంగతి ఒనర్పనివ్వరు. భజన చేసుకొననివ్వరు. చిన్ననాటినుండి నాకు గిరిధరునితోటి మైత్రి ప్రాప్తించినది. ఎంత ప్రయత్నించినను ఆ స్నేహము వదలుట లేదు. నన్నిప్పుడేమి చేయమందురు? నా పాలిటికి తల్లిదండ్రులు మీరే నాకుచిత మార్గమును ఉపదేశింపవలెననెను'.

**తులసీదాసు ఆ విషయమునకు ఇట్లు సదుత్తరము పంపినాడు.**

"బిడ్డా! భగవంతుడు ఎవ్వరికి ప్రియుడుకాడో వారు మనకు పరమ స్నేహితులైనను వారిని వదలితీరవలెను. అట్టివారు కోటి శత్రువులతో సమానము. భక్తుడైన ప్రహ్లాదుడు శ్రీహరి కొరకై తండ్రిని వదిలెను. విభీషణుడు అన్నను వదిలెను. భరతుడు తల్లిని ద్వేషించెను. బలి శుక్రాచార్యుని వదలుకొనెను. గోపకాంతలు భర్తలనే వదలిరి. వీరందరును దేవుని భక్తులే. తల్లీ! ఎవరికి భగవంతునిపై అనన్యప్రీతి ఉండునో వారితోటి సంబంధమే ధన్యము. తక్కిన సుఖములు కన్నుచెరచు కాటుక వంటివి. లౌకిక బంధములు వినాశహేతువులు. భగవంతుడే పరమహితుడు, భక్తులకు ప్రాణాధికుడు. ఏ మార్గమున కృష్ణుడు చిక్కునో అదియే ఉత్తమ ధర్మము".

ఈ మాటతో మీరా సందేహము పటాపంచలైనది. ఆమె తక్షణమే ఇల్లు వదిలెను. మీరా బృందావనము చేరినది. అక్కడ ఒక కృష్ణ దేవాలయము ఉన్నది. ఈ స్వామికి 'రణబాంకురా' అని పేరు. అక్కడ ఆమె భజన కీర్తనాదులు చేయుచుండెడిది. కొంతకాలమైన తర్వాత మీరా తీర్థయాత్రకు బయలుదేరెను. త్రోవలో తులసీదాసు చరణకమలములను ఆమె సేవించెను. ఆ పరమ భక్తుని ఆశీర్వాదము పొందెను. కృష్ణ సంచరణ పవిత్ర క్షేత్రములను ఆమె దర్శించుచు ద్వారక చేరినది. కృష్ణ పరమాత్ముడు కడపటి రోజులలో నివాస మొనర్చిన పరమ పవిత్ర ప్రాంతమది. ఆమె అచటనే తన జీవిత శేషమును గడిపి కడకు కృష్ణఐక్యము పొందెను. గోలోకమునుండి దిగివచ్చిన రాధాదేవి మరల గోలోకమునకు పోయినది.

చూచారా! మీరాబాయి ఎన్ని కష్టముల కోర్చి తనవారెవరు లేకున్నను ఒంటరిగ ధైర్యముగ ఎలాగ ముందుకు సాగిపోయిందో. అందువలన మీరు నేటినుండి దైవభక్తినే ఎక్కువగా తలచి శరీర బంధువుల కంటే ఆత్మ బంధువులకే ఎక్కువ విలువనిచ్చి జ్ఞానవంతులై యోగులై మోక్షము పొందగలరని ఆశిస్తున్నానని ఆ గురువు తన ఏడు మంది శిష్యులకు హితము చెప్పెను. నేటి భక్తులు శిష్యులు పూర్వపు సాంప్రదాయములను వదలి, జ్ఞానము గురువు గురుసాంప్రదాయములను వాటిని మట్టియందు కలిపి, తాము చేయు పనులు సక్రమమైనవేనని తలంచుచున్నారు. పలుకని బొమ్మల ముందర సువాసన బత్తీలు వెలిగించడమే భక్తి అనుకున్నారు. మంచి చెడ్డలను గుర్తించి హెచ్చరించు గురువులకు పూర్తి దూరమైనారు. పూర్వము రాజులు కూడ గురువులైన కులగురువులను వారికి తమతమ ఆస్థానములలో అగ్రస్థానములనిచ్చి వారి సలహామేరకు పరిపాలన సాగించుచుండిరి. ఆ సాంప్రదాయమున్న ఈ దేశములో నేడు

ఇంటికి వచ్చిన గురువులను అతిథుల మాదిరి లేక  బిక్షగాల్ల మాదిరి చూచు కాలమొచ్చినది.  జన్మ రహస్యములు బోధించి నీవు పలానా అని తెలియజేయు గురువులకంటే, మాయలో కూరుకు పోవులాగజేయు శరీరబంధువులే అధికులను కాలమొచ్చినది.  ఎప్పటికైన ఆత్మ ఔన్నత్యమునుకోరు ఆత్మబంధువైన గురువుకంటే  ఆత్మపతనముకోరు శరీరబంధువులు అధికులు కారని తెలుసుకోండి.

P P M P P

ఇట్లు

**ఇందూ ధర్మప్రదాత**

**సంచలనాత్మత రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు**